శ్రీరస్తు

# శ్రీభాష్యసారము

శ్రీబాదరాయణ మహర్షి ప్రణీతములైన బ్రహ్మసూత్రములకు
భగవద్రామానుజుల శ్రీభాష్యము ననుసరించి
వ్రాయబడిన ఆంధ్ర వ్యాఖ్యానము

ద్వితీయభాగము (3, 4 అధ్యాయములు)



రచయిత

కె. ఎస్. రామానుజాచార్యులు M.A.,

రిటైర్డ్ ప్రిన్సిపాల్

శ్రీవేదసంస్కృత కళాశాల, నెల్లూరు - 524 003

1991

ప్రథమ ముద్రణము 1991

ప్రజోత్పత్తి వైశాఖము

కాపీలు : 1000

వెల : 25/-

ప్రతులకు

కె. ఎస్. రామానుజాచార్యులు
వానమామలై మఠం
మూలపేట, నెల్లూరు-524 003

శ్రీజయలక్ష్మీ పబ్లికేషన్స్
కూకట్‌పల్లి (రామాలయంవద్ద)
హైదరాబాద్

శ్రీగోదా గ్రంథమాల
మునునూరు, కృష్ణాజిల్లా - 521 207

ముద్రణ

శ్రీసత్యసాయి ప్రింటర్స్
6-2-151సి, టి. నగర్, తిరుపతి.

శ్రీరస్తు

# విజ్ఞప్తి

ఆర్యా!

శ్రీభాష్యసార ప్రథమభాగము వెలువడి ఆంధ్రపాఠకుల ఆదరాభి-మానములకు పాత్రమగుట ఎంతయుముదావహము. పాఠకులు ఎదురు చూచుచున్న ద్వితీయ భాగము ప్రస్తుతము శ్రీపద్మావతీసమేత శ్రీనివాస భగవానుని దివ్యానుగ్రహముతో వెలువడుచున్నది. గ్రంథముల గుణ దోషములను నిర్ణయించువారు పాఠకమహాశయులే అగుటవలన వారికి ముకుళితహస్తములతో స్వాగతమును పలుకుచున్నాను.

శ్రీభాష్యసార ద్వితీయభాగము ముద్రణమునకు దయతో పది వేలరూప్యముల ఆర్థికసహాయము నందించి మహోపకారమును గావించిన తిరుమల తిరుపతి దేవస్థానాధికారులకు సర్వథా సర్వథా కృతజ్ఞుడను. "బ్రహ్మణి శ్రీనివాసే భవతు మమ వరస్మిన్ శేముషీ భక్తిరూపా" అనుచు శ్రీభాష్యకారులు శ్రీభాష్యరచనకు శ్రీకారము చుట్టినది. ఈ శ్రీనివాసపరబ్రహ్మము నెమటనే. అట్టి ఈ స్వామి ద్రవ్యసహాయముతో శ్రీభాష్యసారముద్రణ జరుగుట నా అదృష్ట విశేషము.

భగవదనుగ్రహమునకు భాగవతపురుషకారము అవశ్యకము. నా మీది అవ్యాజ్యానుగ్రహముతో పురుషకారకృత్యము గావించి, నన్ను ధన్యుని గావించిన పరోపకారధురీణులు, సహృదయశిరోమణి, బహు-ముఖప్రజ్ఞాశాలి, వక్త, కవి, విమర్శకులు డా. ఎస్. బి. రఘునాథాచార్యులు [ప్రొఫెసర్, సంస్కృతవిభాగము, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయము తిరుపతి.] గారికి నా ప్రణామములు.

ఏతద్గ్రన్థ రచనకు నన్ను ప్రోత్సహించినవారు సుహితని రస్వత సమారాధకులు, శ్రీగోదాగ్రన్థ మాలావ్యవస్థాపకులు, శతాధిక గ్రంథ ప్రకాశకులు అయిన శ్రీమాన్ కే.టి.ఎల్. నరసింహాచార్యులు గారు

దీనికి చక్కని వ్రాతప్రతిని తయారుచేసిఇచ్చినవారు శ్రీయుతులు నేలనూతనల శ్రీకృష్ణమూర్తి ఎం.ఏ., ఎల్.ఎల్ బి, అడ్వకేట్ గారు వీరు నృత్యసంగీతసాహిత్యరసికులు, విమర్శనాధురంధరులును.

ఇందు నిబంధించుటకు శ్రీపద్మావతీ శ్రీనివాసుల ఛాయాచిత్రము లను ఒసంగి సహకరించిన సరసహృదయులు, విద్యాభూషణ, ఉప న్యాసకరత్న, కవితావిశారద శ్రీమాన్ వరదాచార్యులు గారు, ఎడిటర్, శ్రీరామానుజకీర్తికౌముది, గుంటూరు.

శ్రీభాష్యసార ప్రకాశమునకు అనేకవిధముల తమ సహకార సంపదల నందించి ప్రోత్సహించిన పవిత్రహృదయులు—

కీ. శే. శ్రీకంకణాల యతిరామానుజయ్యగారు హైదరాబాదు. కీ.శే. శ్రీమతి కొండూరి లక్ష్మీనరసమ్మ గారు, శ్రీమన్నారాయణపురం, ఉల్లిపాలెం, కృష్ణా జిల్లా. శ్రీమాన్ డా॥ జి.వి. చెల్వపిళ్ళగారు, నెల్లూరు ప్రస్తుత నివాసము కోవినా [అమెరికా] శ్రీమాన్ శేట్టలూరు రాఘవ శఠకోపఅయ్యంగార్, తిరుమల. [VRS అయ్యంగార్] శ్రీమాన్ సౌమిత్రి రంగాచార్యులు గారు, హనుమకొండ, విద్వత్కవిశిరోమణి శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులు గారు, తిరుపతి. సంగీతకళానిధి శ్రీమాన్ ఎన్.సి. కృష్ణమాచార్యులు, విజయవాడ, శ్రీమాన్ కె.వి.ఆర్. నరసింహాచార్యులు గారు, ఎం.ఏ, లెక్చరర్, ఓరియంటల్ కళాశాల, చిననింద్రకొలను. ఇట్లు ఈ కార్యక్రమమున సహకరించినవారు ఎందరో మహానుభావులు. అందరకు వందనములు. ఈ గ్రంథమును చక్కగ ముద్రించిన శ్రీమాన్ D.S.P. రామకృష్ణ, మేనేజరు శ్రీసత్యసాయి ప్రింటర్స్, తిరుపతి. గారికి నా శుభాశీస్సులు.

సర్వేజనా స్సుఖినోభవన్తు.

నెల్లూరు, ఇట్లు

**1-10-91.** కె. ఎస్. రామానుజాచార్యులు

శ్రీరస్తు

# అధికరణసూచి

## తృతీయాధ్యాయము — సాధనాధ్యాయము

### ప్రథమపాదము — వైరాగ్యపాదము



### ద్వితీయపాదము — ఉభయలింగపాదము



### తృతీయపాదము — గుణోపసంహారపాదము

### చతుర్థపాదము — అంగపాదము



### చతుర్థాధ్యాయము—ఫలాధ్యాయము

### ప్రథమపాదము—అఘహానిపాదము



శ్లో॥ శ్రీశేషసూరికుల వారిధి పూర్ణచంద్రం
శ్రీశ్రీనివాస గురువర్య కృపాత్తబోధమ్।
వేదాంతయుగ్మ విశదీకరణ ప్రవీణం
శ్రీకృష్ణసూరి మనఘం శరణం ప్రపద్యే॥

శ్రీరస్తు.

శ్రీమతే రామానుజాయ నమః



భ గ వ ద్రా మా ను జు లు

(నరసాపురం - ప॥ గో॥ జిల్లా)

శ్లో॥ పుణ్యాంభోజ వికాసాయ పాపధ్వాంత క్షయాయ చ।
శ్రీమానావిరభూద్భూమౌ రామానుజ దివాకరః॥

శ్రీరస్తు
శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ భాష్యసారము

## రెండవ భాగము

## తృతీయాధ్యాయము (సాధనాధ్యాయము)

### ప్రథమ పాదము (వైరాగ్యపాదము)

### 69. తదంతర ప్రతిపత్త్యధికరణము 1

జీవుడు భూత సూక్ష్మములతో కూడిన ఒక దేహము నుండి మరియొక దేహమున ప్రవేశించును.

288 సూ॥ "తదంతర ప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః ప్రశ్న నిరూపణాభ్యాం" 3-1-1

అర్థ : తదంతరప్రతిపత్తౌ = జీవుడు ఒక దేహమునుండి మరియొక దేహమును పొందునపుడు ; సంపరిష్వక్తః = భూత సూక్ష్మములతో కూడినవాడై ; రంహతి = పోవుచున్నాడు ; ప్రశ్న నిరూపణాభ్యాం = పంచాగ్ని విద్యయందలి ప్రశ్న సమాధానములనుబట్టి ;

వివ- : ఛాందోగ్యమున 5వ ప్రపాఠకమునందు పంచాగ్ని విద్య ప్రస్తుతింపబడినది. "శ్వేతకేతుః హారుణేయః పాంచాలానాం సమితిమేయాయ" (ఛా-5-3-1) ఆరుణి కుమారుడు శ్వేతకేతువు పాంచాలరాజు ప్రవాహణునియొక్క సభకు వెళ్ళెను. అచట ఆ రాజు శ్వేతకేతువును చూచి అయిదు ప్రశ్నలను అడిగెను. అందులో ఒక ప్రశ్న "వేత్థ యథా పంచమ్యా మాహుతా వాపః పురుష వచసో భవంతి" (ఛా- 5-3-3) అయిదవ ఆహుతిలో అప్పులు (ఉదకములు) పురుషుడు అని చెప్పబడుచున్నవి. ఇది ఎట్లో తెలిసికొంటివా ? ఈ ప్రశ్నకు సమాధానము తెలియకపోవుటచే శ్వేతకేతువు తండ్రియొద్దకు వెళ్లెను.

అతనికిని ఈ విషయము తెలియనందువలన అతడు ప్రవాహణుని యొద్దకు వెళ్ళి ఈ ప్రశ్నకు సమాధానమును చెప్పుమని ప్రార్థించెను.

అంతట పంచాగ్నివిద్యా ప్రవీణుడైన ఆరాజు అరుణికి ఆ విద్యను ఉపదేశించెను.

1. "ద్యులోకము" అను అగ్నియందు దేవతలు శ్రద్ధను హోమము చేయుదురు. దానినుండి సోమరాజు ఏర్పడును. 2. ఆ దేవతలే "పర్జన్యుడు" అను అగ్నియందు పై సోమరాజును హోమముగావింతురు. అంతట వర్ష మేర్పడును. 3. ఆ వర్షమును దేవతలు "పృధివి" అను అగ్నియందు హోమముజనర్తురు. దానినుండి అన్న మేర్పడును. 4. దేవతలు ఆ అన్నమును "పురుషుడు" అను అగ్నియందు హోమము చేయుదురు. అది శుక్లముగ పరిణమించును. 5. ఆ శుక్లమును దేవతలు "యోషిత్" (స్త్రీ) అనుఅగ్నియందు హోమము చేయుదురు. వీనిలో ద్యు, పర్జన్య, పృధివి, పురుషులతర్వాత అయిదవ అగ్ని స్త్రీ అగుచున్నది. ఈమెయందు హోమము చేయబడిన శుక్లమే పురుషుడుగా పరిణమించుచున్నది. ఈ పంచాగ్నులయందను హోమం చేయునట్టి దేవతలు ప్రాణములే. ఈతత్త్వమును తెలుపునదియేపంచాగ్ని విద్య "ఇతి తుపంచమ్యామాహుతా వాపః పురుషవచసో భవంతి" (ఛా-5-9-1)అనుచు ఈ ప్రకరణము సమాప్తమగుచున్నది. ఈప్రశ్న సమాధానములలో ఉదకములే క్రమపరిణతములై పురుషుడుగా ఏర్పడినట్లు చెప్పుటచే భూతసూక్ష్మములతో కూడియే జీవుడు దేహాంతరమును పొందుచున్నాడని స్పష్టమగుచున్నది.

289 సూ॥ "త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్" (2) 3-1-2

అర్థ: త్ర్యాత్మకత్వాత్ + తు=త్రివృత్కరణముచే ఉదకముల యందు తక్కిన రెండు భూతములు చేరియుండుటవలనను ; భూయస్త్వాత్ = వానిలో ఉదకములయొక్క భాగము అధికముగా వుండుట

వలనను ; పంచాగ్నివిద్యలో "ఆపః" అని యితర భూతసూక్ష్మములకును ఉపలక్షణముగా చెప్పబడినది.

290 సూ॥ "ప్రాణగతేశ్చ" (3) 3-1-3

అర్థ : ప్రాణగతేః + చ = దేహమునుండి జీవుడు ఉత్క్రమించునపుడు అతనితోపాటు ప్రాణములును అనగా ఇంద్రియములును ఉత్క్రమించుచున్నవనిచెప్పుటవలనను ఆ యింద్రియములకు ఆశ్రయములైన భూత, సూక్ష్మములను ఉత్క్రమించుచున్నవని తెలియుచున్నది.

ఇందులకు ప్రమాణము. "త ముత్క్రామంతం ప్రాణఃఅనూత్క్రామతి ప్రాణ మనూత్క్రామంతం సర్వే ప్రాణాః అనూత్క్రామంతి" (బృ- 6-4-2) "శరీరము నుండి ఉత్క్రమించుచున్న జీవుని ముఖ్యప్రాణము, దానిని ఇంద్రియములు అనుసరించి పోవుచున్నవి."

291 సూ॥ "అగ్న్యాది గతిశ్రుతేరితిచేన్న భాక్తత్వాత్" (4)3-1-4

అర్థ : అగ్న్యాదిగతి శ్రుతేః = ప్రాణోత్క్రమణ సమయమున వాక్కు మొదలగునవి అగ్ని మొదలగు తమ తమ అధిష్ఠానదేవతలలో చేరిపోవుచున్నవి అని చెప్పుటవలన ఇంద్రియములు జీవుని అనుసరించిపోజాలవు. ; ఇతిచేత్ = అనుచో ; న = అట్లు కాదు ; భాక్తత్వాత్ = "మరణ సమయమున వాక్కు అగ్నిని, ప్రాణము వాయువును, చక్షున్సు సూర్యుని చేరును" అనిచెప్పుట (యత్రాస్య పురుషస్య మృతస్యాగ్నిం వాగప్యేతి. వాతం ప్రాణః.చక్షురాదిత్యం) (బృ-5-2-13) కేవలము గౌణము. "లోమములు ఓషధులను, కేశములు వనస్పతులను చేరును." అని చెప్పునట్టి తర్వాతి వాక్యము గౌణార్థకమే కదా కావున ఇంద్రియములు జీవుని అనుసరించి పోవునే కాని అగ్న్యాది దేవతలను చేరుటలేదు.

282 సూ॥ "ప్రథమేఽశ్రవణాదితిచేన్న తా ఏవ హ్యుపపత్తేః (5) 3–1–5

అర్థ : ప్రథమే = పంచాగ్ని హోమములలో మొదటిదైన ద్యు-లోకాగ్ని హోమమునందు ; అశ్రవణాత్ = ఉదకములు హోమముచేయ బడినట్లు చెప్పబడనందువలన "అప్" శబ్దసూచితములైన భూత సూక్ష్మములు జీవునితో కలిసి వెళ్ళవు ; ఇతిచేత్ = అనుచో ; న=అట్లు కాదు ; తాః ఏవహి = ఆ ఉదకములే కదా అచట శ్రద్ధాశబ్దముచే చెప్పబడినవి ; శ్రద్ధావా ఆపః " (యజు, 3 అష్ట 2-4-33) " శ్రద్ధ యనగా ఉదకములు " అనుచు వేదమే శ్రద్ధా శబ్దమునకు అర్థమును నిర్ణయించియున్నది. ఉపపత్తేః = ప్రశ్న సమాధానములు సరిపో వలయునన్నచో ఈఅర్థమును స్వీకరించుటయే ఉపపన్నమగుటవలన:

283 సూ॥ అశ్రుతత్వాదితి చేన్నేష్టాదికారిణాం ప్రతీతేః (6) (3–1–6)

అర్థ ၊ అశ్రుతత్వాత్ = పంచాగ్నివిద్యలోని హోమములలో దేనియందుస జీవుని హోమము చెప్పకపోవుటవలన జీవుడు భూత సూక్ష్మములతో కలిసి ప్రయాణము చేయుచున్నాడనుట అసంగతము ; ఇతిచేత్ = అనుచో ; న = అట్లుకాదు ; ఇష్టాదికారిణాం = ఇష్టము = యజ్ఞయాగాదులు ; పూర్తము=కటాకప్రతిష్ఠాదులు : దత్తము=దానము ఈ మొదలైన సత్కార్యములను గ్రామముందుండి చేయువారు ధూమమార్గము పొందుదురు. " (అథ య ఇమే గ్రామే ఇష్టా పూర్తే దత్తమిత్యుపాసతే తే ధూమ మభిసంభవంతి) " (ఛా- 5-10-3) అని తర్వాతి వేదవాక్యము చెప్పుచున్నందువలన ఆ సత్కార్యములను చేసిన జీవుడే సోమరాజుగ, వర్షముగ, అన్నముగ, శుక్లముగ నయి పురుషుడుగ జన్మించుచున్నాడు, అని ; ప్రతీతేః = తెలియు

చున్నందువలన ఉత్క్రమణ సమయమున జీవుడు భూత సూక్ష్మములతో కలసి బయలుదేరును అనుట యుక్తమే.

294 సూ॥ భాక్తం వాఽనాత్మవిత్త్వాత్తథాహి దర్శయతి(7)3-1-7

అర్థ : అనాత్మవిత్త్వాత్=కేవలయజ్ఞయాగాదులను చేయువారు ఆత్మతత్త్వమును తెలిసినవారు కానందువలన; భాక్తంవా= "తం దేవా భక్షయంతి" (ఛా- 5-10-3) "దేవతలు ఆ సోమరాజును అనగా జీవుని భక్షింతురు" అను వాక్యము గౌణార్థకము కావచ్చును. తథా= అట్లు; దర్శయతి హి = ( "యదా పశురేవం స దేవానాం" బృ- 3-4-10) మానవులకు పశువు ఎట్లు ఉపయోగపడుచున్నదో అట్లే దేవతలకు ఇచటి నుండి వెళ్ళిన ఆత్మవేత్త కాని జీవుడు ఉపయోగపడును." అని వేదము బోధించుచున్నది కదా!

## 70 కృతాత్యయాధికరణము 2

### కర్మశేషము పునర్జన్మకు కారణము

295 సూ॥ "కృతాత్యయే ఽనుశయవాన్ దృష్టస్మృతిభ్యాం యథేతమనేవం చ (1) 3-1-8

అర్థ : కృత + అత్యయే = చేసిన కర్మలను అనుభవించి అవి పూర్తియైనంతనే; అనుశయవాన్ = అనుభవింపగా మిగిలిన కర్మశేషము కలవాడై, మరల భూలోకమున జన్మించును. దృష్టస్మృతిభ్యాం = వేదవచనము వలనను, స్మృతివచనము వలనను.

వేదవచనము! "తద్య ఇహ రమణీయ చరణాఅభ్యాశో హయత్తే రమణీయాం యోని మాపద్యేరన్ బ్రాహ్మణ యోనిం" (ఛా 5.10-7) "ఎవరు మంచి కర్మలను ఆచరింతురో అట్టివారు స్వర్గాదిసుఖములను

అనుభవించి మరల యోగ్యమైన బ్రాహ్మణాది జాతులలో ఏదేని ఒక దానియందు జన్మింతురు."

స్మృతివచనము : "తతః పరివృత్తౌ కర్మఫలశేషేణ జాతిం రూపమ్" (ఆ.ప.సూ. 3-1-2-1) "ఆ స్వర్గమునుండి తిరిగి వచ్చినపుడు స్వర్గమున అనుభవింపగా మిగిలిన కర్మశేషమునుబట్టి మంచి జాతిని, మంచి రూపమును పొందుదురు". యథా + ఇతమ్ = ఏ మార్గమున వెళ్ళిరో ఆ మార్గముననే వెను దిరిగి వత్తురు. అనేవం చ= ఇట్లుకాక వేరు మార్గమునను తిరిగి రావచ్చును.

296 సూ॥ "చరణాదితిచేన్న తదుపలక్షణార్థేతి కార్ష్ణాజినిః (2) 3-1-9

అర్థ : చరణాత్ = స్మృతివిహితములైన సంధ్యావందనాది కార్యములను ఆచరించుటవలన బ్రాహ్మణ్యాదికము కలుగునే కాని కర్మశేషమువలన కాదు, ఇతిచేత్=అనుచో ; న = అట్లుకాదు ; తత్ + ఉపలక్షణ + అర్థా= "రమణీయచరణాః" = "సదాచార సంపన్నులు" అనునెడ ఆ సదాచారము కర్మశేషమునకును సూచక మగుచున్నది. కావున కర్మశేషమును బట్టియే ఉత్తమజాతియందు జన్మింతురు. ఇతి=అని; కార్ష్ణాజినిః = "కార్ష్ణాజిని" అను మహర్షి తలంచుచున్నాడు.

297 సూ॥ "ఆనర్థక్యమితిచేన్న తదపేక్షత్వాత్" (3) 3-1-10

అర్థ : ఆనర్థక్యం = కర్మమునకే ప్రాముఖ్యమును ఇచ్చు పక్షమున స్మృతివిహితమైన ఆచారమునకు నిష్ప్రయోజనత్వము సంభవించును. ఇతిచేత్ = అనుచో ; న = అట్లుకాదు ; తత్ + అపేక్షత్వాత్ = కర్మములు స్మృతి విహితములైన ఆచారములను అపే

క్షీంచియే ఉండుటవలన అనగా ఆచారములేని కర్మములు ఫల ప్రదములు కావు అని భావము. ఈ విషయమే "సన్ధ్యాహీనోఽశుచిర్నిత్యమనర్హస్సర్వకర్మసు" "సంధ్యావందనము చేయనివాడు ఏ వైదికకర్మను చేయుటకును; అర్హుడు కాడు" అను స్మృతి వచనముచే చెప్పబడుచున్నది. కావున సదాచారముతో కూడిన సత్కర్మములే ఉత్తమజాతిప్రాప్తికి హేతువులు.

298 సూ॥ "సుకృత దుష్కృతే ఏవేతి తు బాదరిః" (4) 3-1 11

అర్థ ॥ సుకృత దుష్కృతే + ఏవ = "రమణీయ చరణాః", "కపూయ చరణాః" (ఛా- 5-10-7) అను పదములకు "సుకృతము చేసినవారు", "దుష్కృతము చేసినవారు", అనియే అర్థము. ఇతితు= ఇట్లని, బాదరిః = బాదరి యను మహర్షి తలంచుచున్నారు.

వివ : "రమణీయ చరణాః" అను పదమునకు మంచి ఆచారము కలవారు" అను అర్థమును చెప్పి; ఇది యజ్ఞయాగాది సత్కర్మములకును సూచకము ఆచారము, సత్కర్మ ఈ రెండున్నూ కలసి ఉత్తమజన్మప్రాప్తికి హేతువులు అని "కార్ష్ణాజిని" మహర్షియొక్క ఆశయము. కాని బాదరి అను మహర్షి "రమణీయచరణాః" అను పదము ఆచారమును ప్రధానముగ కర్మములను గౌణముగా చెప్పుట కాక సాక్షాత్తుగ సుకృతమునే బోధించును ; కావున మనము చేయు సుకృతము ఉత్తమ జన్మమునకు కారణమగుచున్నదని తలంచు చున్నారు. ఈ అర్థమే బాదరాయణులకును అభిమతము.

### 71. అనిష్టాదికార్యధికరణము 3

### పాపిష్ఠులకు చంద్రలోకగమనాగమనాదులు ఉండవు

299 సూ॥ "అనిష్టాదికారిణామపి చ శ్రుతమ్ (1) (3-1-12

అర్థ : అనిష్టాదికారిణాం + అపిచ = ఇష్టము, పూర్తము మొదలగు సత్కర్మలను చేయనివారికిని చంద్రలోక గమనము; శ్రుతమ్ = వేదమున చెప్పబడిఉన్నది

వివ : "యే వై కే చాస్మాల్లోకాత్ప్రయన్తి చంద్రమసమేవ తే సర్వే గచ్ఛన్తి "(కౌషీతకీ 1-2) "ఈ లోకమునుండి వెడలువారు అందఱు చంద్రుని పొందుచున్నారని" చెప్పుటచే ఇష్టాపూర్తాదులను చేసిన వారికి చేయనివారికిని, చంద్రలోకప్రాప్తి సమానమని తెలియుచున్నది

**300 సూ॥ సంయమనే త్వనుభూయేతరేషా మారోహావరోహౌ తద్గతి దర్శనాత్. (2) 3-1-13**

అర్థ : సంయమనేతు = యమునియొక్క శాసనమున; అనుభూయ = పాపఫలమును అనుభవించి; ఇతరేషామ్ = ఇష్టా పూర్తాదులు చేయని పాపిష్ఠులకు; ఆరోహ+అవరోహౌ = చంద్రలోకమునకు వెళ్ళుట, వచ్చుట అనునవి సంభవించును. తత్ + గతిదర్శనాత్ = యమసదమునకు పాపిష్ఠులు వెళ్లునట్లు శ్రుతి చెప్పుటవలన. శ్రుతి : "వైవస్వతం సంగమనం జనానాం" యమం రాజానమ్ ఆరణ్య 2(ప-1) వివస్వంతుని కుమారుడు జనులకు సంగమస్థానము అయిన యమధర్మరాజును"— ఇచట "జనానామ్" అను పదము పుణ్యవంతులను, పాపిష్ఠులను బోధించుచున్నది.

**301 సూ॥ "స్మరంతి చ" (3) 3-1-14**

అర్థ : స్మరంతి చ = స్మృతి కర్తలును ఈ అర్థమును బోధించుచున్నారు.

శ్రుతి : "సర్వేచైతే వశం యాన్తి భగవన్నిల" (విష్ణుపురా- 3-7-5) వీరందఱు యమునికి వశ్యులు అగుదురుకదా భగవన్!

302 సూ॥ "అపిసప్త" (4) 3-1-15

అర్థ : సప్త + అపి = నరకలోకములు ఏడును పాపిష్ఠులు పాపఫలమును అనుభవించుటకు నివసింపదగియున్నవి.

303 సూ॥ "తత్రాపి తద్వ్యాపారాదవిరోధః" (5) 3-1-16

అర్థ : తత్ర + అపి="ఆ ఏడు రౌరవాది నరకములయందును తత్ + వ్యాపారాత్ = ఆ యమునికి అధికారము ఉన్నందువలన; అవిరోధః = పాపిష్ఠులు యముని సన్నిధికి చేరుటలో విరోధములేదు.

వివ : పాపిష్ఠులు మరణానంతరము మొదట యమసదనమును చేరుదురు. పిదప యముని ఆజ్ఞచొప్పున వారి వారి కర్మానుభవమునకు తగిన నరకలోకమునకు పోవుదురు. అచట పాపఫలమును అనుభవించి అచటినుండి చంద్రలోకమును చేరి క్రమముగా భూమికి చేరుదురు. ఈ ఐదు పూర్వపక్ష సూత్రములు.

ఇక సిద్ధాంతము :

304 సూ॥ "విద్యాకర్మణోరితితు ప్రకృతత్వాత్" (6) 3-1-17

అర్థ : విద్యాకర్మణోః + ఇతితు = బ్రహ్మవిద్యానిష్ఠులకు అర్చిరాది మార్గము, ఇష్టాపూర్త కర్మనిష్ఠులకు ధూమాది మార్గము అని ప్రకృతత్వాత్=ప్రస్తావింపబడుటవలన వీరికంటె భిన్నులైనపాపిష్ఠులకు చంద్రలోకగమనము సంభవింపదు. బ్రహ్మవేత్తలు అర్చిరాది మార్గమున బ్రహ్మమును చేరుదురు. కర్మనిష్ఠులు ధూమాది మార్గమున చంద్రలోకమును చేరుదురు. కావున పాపిష్ఠులకు ఈ రెండు అవకాశములును లేవని భావము.

305 సూ॥ "న తృతీయే తథోపలబ్ధేః (7) 3-1-18

అర్థ : తృతీయే=విద్యానిష్ఠులు, కర్మనిష్ఠులు కాని పాపిష్ఠుల విషయమునందు ; న = వారు దేహము దాల్చుటకు పంచాగ్ని విద్యలో చెప్పబడిన పంచమాహుతితో ఆ అవసరము లేదు; తథా + ఉపలబ్ధేః = అ విధముగ శ్రుతియందు చూపట్టుచుండుటవలన.

శ్రుతి : "వేత్థ యథా కేనాసౌ లోకో న సమ్పూర్యతే" "ఈద్యు లోకము జీవులతో నిండకపోవుటకు కారణమేమి? " అను ప్రశ్నకు "అథైతయోః పథోర్న కతరేణ చ తానీ మాని క్షుద్రాణ్య సకృదా వర్తీని భూతాని భవన్తి జాయస్వ మ్రియస్వేత్యేత త్తృతీయంస్థానం తేనాసౌ లోకో న సమ్పూర్యతే " (ఛా- 5-10-8) " తృతీయస్థాన శబ్దవాచ్యులైన పాపిష్ఠులు ఈ దేవయాన పితృయానములలో ప్రవేశించక జనన మరణ ప్రవాహమున మునిగి తేలుచు నరకములను అనుభవించుచుందురు కావున ఈ ద్యులోకము జీవులచే నిండకున్నది " అని సమాధానము చెప్పబడినది. దీనిని పాపిష్ఠులు జన్మలను పరిగ్రహించునపుడు పంచమాహుత్యపేక్ష లేదని తెలియుచున్నది. కావుననే చంద్రలోక గమనము పైతము వీరికి లేదు.

306 సూ॥ " స్మర్యతేపి చ లోకే " (8) 3-1-19

అర్థ : లోకేచ = లోకమునందును ; స్మర్యతే + అపి = పంచమాహుతి సంబంధము లేకయే ద్రౌపది మొదలగు వారు జన్మించినట్లు భారతాదులయందు చెప్పబడియున్నది.

307 సూ॥ " దర్శనాచ్చ " (9) 3-1-20

అర్థ : దర్శనాత్ + చ = శ్రుతులయందు పంచమాహుతితో

అవసరము లేని కొన్ని జీవముల ఉత్పత్తి చెప్పబడుటవలనను ఇది సంభవమే.

శ్రుతి: "తేషాం ఖల్వేషాం భూతానాం త్రీణ్యేవ బీజాని భవన్త్యాణ్డజం జీవజముద్భిజ్జం ఇతి "(ఛా- 6-3-1) "ఈ ప్రాణుల ఉత్పత్తికి మూడు విధములైన బీజములు కలవు. 1. అండజము = గ్రుడ్డునుండి పుట్టునది. 2. జీవజము = ఒక ప్రాణినుండి పుట్టునది. 3. ఉద్భిజజము= భూమిని భేదించుకొని పుట్టునది." వీనిలో ఉద్భిజజములకు పంచమాహుతితో అవసరము లేదు.

308 సూ॥ తృతీయశబ్దావరోధసంశోకజస్య (10) 3-1-21

అర్థ : సంశోకజస్య = చెమట మొదలగువానివలన కలుగు ప్రాణులను, తృతీయశబ్ద + అవరోధః = మూడవదైన " ఉద్భిజ్జ" పదముచేత పేర్కొనుట సంభవించినది. (అవరోధః = సంగ్రహః)

72. తత్స్వాభావ్యాపత్త్యధికరణము 4

జీవుడు జన్మ పరిగ్రహమునకు దిగి వచ్చునపుడు ఆకాశాదులయందు వాని సాదృశ్యమును కలిగియుండును.

309 సూ॥ " తత్స్వాభావ్యాపత్తిరుపపత్తేః 3-1-22

అర్థ : తత్ + స్వాభావ్య + ఆపత్తిః=పరలోకము నుండి దేహ ధారణమునకై ఈ లోకమునకు వచ్చు జీవులు ఆకాశమై, వాయువై ధూమమై, మేఘమై, వర్షమై, ఈ విధముగ క్రిందికి దిగివత్తురు.

శ్రుతి : " యథేత మాకాశ మాకాశాద్వాయుః వాయుర్భూత్వా

ధూమో భవతి ధూమోభూత్వాఽభ్రం భవతి. అభ్రం భూత్వామేఘో భవతి మేఘోభూత్వా ప్రవర్షతి " (ఛా– 5– 10–5) అను శ్రుతివాక్యము నందు ఆకాశాదులుగ అగుట అనగా ఆకాశాదుల సాదృశ్యమును కలిగి యుండుట అని అర్థము; ఉపపత్తేః = ఆకాశాది రూపములతో సుఖ దుఃఖములను అనుభవింపకుండుట ఉపపన్నమగుటవలన.

వివ : ధూమాదిమార్గమున చంద్రలోకమును చేరిన కర్మఠులు పునర్జన్మకై దిగి వచ్చునపుడు ఆకాశము, వాయువు, మొదలగువాని శరీరముగ దాల్చి సుఖదుఃఖముల ననుభవింతురు. అని పూర్వపక్షము. కాని ఆకాశమగుట, వాయువగుట అనగా వానితో సాదృశ్యమును పొందుట అనియే అర్థము.అయా శరీరములనుదాల్చుట అనికాదు. అచట సుఖదుఃఖానుభవము లేకపోవుటచే శరీర పరిగ్రహము సైతము ఉండదుగదా.

## 73. నాతిచిరాధికరణము 5

జీవుడు ఆకాశమునుండి ఓషధులలో చేరునంత వఱకును వేగముగ దిగి వచ్చును.

310 సూ॥ " నాతిచిరేణ విశేషాత్ " 3–1–23

అర్థ : అతిచిరేణ = జీవుడు ఆకాశమునుండి క్రిందికి దిగి ఓషధు లలో ప్రవేశించునంతవఱకును ఎక్కడా ఆలస్యముగ; న = ఉండడు. విశేషాత్ = " అతోవై ఖలు దుర్నిష్ప్రపతరమ్ " (ఛా– 5–10–6) "ఇచట నుండికదా (ధాన్యాదులనుండి) బయట పడుట దుఃఖసాధ్యమైనది. " అని విశేషించి చెప్పుటవలన.

## 74. అన్యాధిష్ఠితాధికరణము 6

జీవుడు ఓషధులయందు చేరియుండును.

311 సూ॥ " అన్యాధిష్ఠితే పూర్వవదభిలాపాత్ " (1) 3-1-24

అర్థ : అన్య + అధిష్ఠితే = క్రిందికి దిగివచ్చు జీవుడు ఇతర జీవులచే అధిష్ఠింపబడియున్న వ్రీహ్యాదులయందు ఆ జీవులతోబాటు కలసియుండును ; పూర్వవత్ = మునుపటి ఆకాశాదులయందువలె, అభిలాపాత్ = వ్రీహ్యాదుల రూపమున ఉండును అని చెప్పియున్నందు వలన.

వివ : జీవుడు దేహధారణము కొఱకు దిగివచ్చునప్పుడుఆకాశము మొదలు వ్రీహ్యాదులవరకు వానియందు కలసియుండునే కాని ఆ రూపమున జన్మింపడు. జన్మించుట అన్నది మనుష్యాది రూపముననే అని భావము.

312 సూ॥ " అశుద్ధమితిచేన్న శబ్దాత్ " (2) 3-1-25

అర్థ : అశుద్ధమ్ = క్రిందికి దిగివచ్చు జీవుడు తాను అంతకు ముందు జన్మలలో చేసిన అగ్నిషోమీయాది పశుహింసాదులవలన ఏర్పడిన అపరిశుద్ధమైన కర్మము వ్రీహ్యాదిజన్మకు కారణము అని ఏల చెప్పరాదు ? ఇతిచేత్ = అనుచో ; న = అట్లుకాదు. శబ్దాత్ = అగ్నిషోమీయాదులయందు చేయు పశు హింసాదికమును వేదమే విధించుట వలనను, యజ్ఞమున కావించిన హింస హింస కాదని " హిరణ్యశరీర ఊర్ధ్వస్స్వర్గం లోకమేతి " (యజు 4-9-6-4-6) " బంగారు శరీరము కల పశువు స్వర్గలోకమును పొందుచున్న" దని చెప్పుటచే యజ్ఞ

యాగాదులవలన అపరిశుద్ధకర్మము ఏర్పడుట గాని దానివలన వ్రీహ్యాది జన్మము కలుగుటగాని సంభవింపవు అని భావము.

313 సూ॥ "రేతస్సిగ్యోగోఽథ" (3) 3-1-26

అర్థ : అథ = వ్రీహిలో చేరిన పిదప, రేతస్సిచ్ + యోగః= శుక్లమును సేచనమొనర్చు పురుషునిలో అతడు భుజించిన అన్నము ద్వారా వచ్చి చేరును.

314 సూ॥ "యోనే శ్శరీరమ్" (4) 3-1-27

అర్థ : యోనేః = స్త్రీయొక్క గర్భాశయమును ప్రవేశించిన పిదప ; శరీరమ్ = జీవుడు శరీరమును ధరించును.

తృతీయాధ్యాయ ప్రథమపాదార్థ సంగ్రహశ్లోకః

శ్లో॥ పాదేత్వర్థాష్టదస్మిన్వపురిహ విజహద్భూత సూక్ష్మైస్సహేయాత్
భుక్త్వస్వర్గేఽవరోహే దనుశయసహితో మాత్రయా భిన్నమార్గః।
చన్ద్రిప్రాప్త్యాది నస్యాన్నిరయపథజుషామప్యరాసదృక్త్వంద్వౌ
తస్మాచ్ఛీఘ్రావరోహః పరవపుషివరం వ్రీహిపూర్వేపి యోగః ॥

తా॥ ఈ తృతీయాధ్యాయ ప్రథమ పాదమునందు మొదటి అధికరణమున జీవుడు భూతసూక్ష్మములతో కలసి మరణసమయమున శరీరమునుండి బయలువెడలును అని, రెండవ యధికరణమున స్వర్గలోక సౌఖ్యముల ననుభవించి, పునర్జన్మకై జీవుడు కర శేషముతో వెళ్ళిన మార్గమునగాని, మరియొక మార్గమునగాని దిగి వచ్చును అని, మూడవ యధికరణమున నరకలోకమును పొందిన

వారికి, చంద్రలోక ప్రాప్తి లేదు అని, నాల్గవ యధికరణము
ఆకాశాదులద్వారా దిగి వచ్చునపుడు ఆకాశాది సాదృశ్యమును కలి
యుండును అని, అయిదవ అధికరణమున ఆకాశము మొదల
వ్రీహి పర్యంతము వేగముగ దిగివచ్చునని, ఆరవ యధికరణము
ఆ వ్రీహులయందు జీవుడు సంశ్లేషించి ఉండునని ఈ యార
విషయములు వివరింపబడినవి.

ఇందు జీవుని జన్మ మరణప్రకారములను వివరించినంద
వలన ఈ పాదమునకు "వైరాగ్యపాదము" అను నామము సార్థ
మగుచున్నది.

తృతీయాధ్యాయ ప్రథమపాదము సమాప్తము

శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః

తృతీయాధ్యాయ ద్వితీయ పాదము

ఉభయలింగ పాదము

## 75. సంధ్యాధికరణము 1

### స్వప్న జగత్సృష్టి పరమాత్మయొక్క కార్యము

**315 సూ॥ "సన్ధ్యే సృష్టిరాహహి" (1) 3-2-1**

అర్థ : సన్ధ్యే = స్వప్నమునందు (జాగ్రత్ - సుషుప్తి దశల మధ్య ఏర్పడుటచే స్వప్నము "సంధ్యము" అనబడుచున్నది. సంధౌ భవం = సంధ్యమ్) సృష్టిః = స్వాప్నిక పదార్థముల సృష్టి జీవునిచే చేయబడుచున్నది. ఆహహి = "అథ రథాన్రథయోగాన్ పథస్సృజతే అథ వేశాన్తాన్ పుష్కరిణ్యః స్రవన్త్యః సృజతే సహి కర్తా" (బృహ-4-3-10) "రథములను, రథములు సంచరించుమార్గములను సృజించును వీనికి ఆ జీవుడు కర్త. అని శ్రుతి" చెప్పినది కదా!

**316 సూ॥ "నిర్మాతారం చైకే పుత్రాదయశ్చ (2) 3-2-2**

అర్థ : ఏకే = కొందఱు (కఠశాఖీయులు) నిర్మాతారంచ = "య ఏష సుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః"(కఠ- 2-5-8) "జీవుడు నిద్రించుచున్నవారిలో మేల్కొనియుండి పుత్రపౌత్రాదులను ఇతర పదార్థములను నిర్మించుచుండును" అను శ్రుతివచనములను బట్టి జీవుడే స్వాప్నిక పదార్థములకు నిర్మాత అని చెప్పుదురు. పుత్రాదయః + చ = పై మంత్రమున "కామం కామం" అను పదములకు "పుత్రపౌత్రాదులు" అని అర్థము అనియు చెప్పుదురు.

వివ : కామ శబ్దమునకు "పుత్రపౌత్రాదులు" అర్థము అము ఎట్లు కావగును ? అని శంకింప నవసరములేదు. కఠోపనిషత్తునందు ఆ

ప్రకరణముననే" సర్వాన్ కామాన్ ఛందతః ప్రార్థయస్వ" (కఠ 1_1_25) "కామముల నన్నింటిని స్వేచ్ఛగా కోరుకొనుము" అని చెప్పి "శతాయుషః పుత్రపౌత్రాన్ వృణీష్వ" (కఠ 1-1-23) "నూఱు సంవత్సరములు జీవించు పుత్రపౌత్రులను కోరుకొనుము" అని చెప్పుటచే కామశబ్దమునకు పుత్రపౌత్రాదులు అను అర్థమును వివరించినట్లయినది. కావున జీవుడే స్వప్న పదార్థములను సృజించును అని పూర్వపక్షము. ఇక సిద్ధాంతము.

317 సూ॥ మాయామాత్ర తు కార్త్స్న్యేనానభివ్యక్తస్వరూపత్వాత్" (3)3-2-3

అర్థః మాయామాత్రంతు=స్వప్నమున చూడబడు రథాదులు పరమాత్మయొక్క మాయచే కల్పితములు మాత్రమే. కార్త్స్న్యేన=సమగ్రముగ, అనభివ్యక్త స్వరూపత్వాత్=జీవుడు అభివ్యక్తము కాని స్వరూపమును కలిగి యుండుటవలన.

వివః "య ఏష సుప్తేషు జాగర్తి" (కఠ2-5-8) "ఈ నిద్రించుచున్న వారిలో ఎవడు మేల్కొనియున్నాడో" అను వాక్యమున మేల్కొని యున్నట్లుపేర్కొనబడినవాడు పరమాత్మయే గాని జీవుడు కాడు. "తస్మిల్లోకాశ్శ్రితాస్సర్వే తదునాత్యేతి కశ్చన" (కఠ 2-5-8) "అతనియందు లోకములన్నియు ఆశ్రయించుకొనియున్నవి. అతనిని అతిక్రమించి ఎవ్వడును పోలేడు" అను వాక్యముచె ఈ విషయము స్పష్టము కాగలదు. కావున స్వప్నమున చూడబడు రథాదులు ఆ పరమాత్మచే సృజింపబడినవి. ఇవి తాత్కాలికములై ఆశ్చర్యకరములగుచున్నందున సూత్రమున మాయాశబ్దముచే పేర్కొనబడినవి. జీవుడు సంసారదశయందు సత్యసంకల్పత్వాది గుణములను కలిగియుండజాలడు. కావున అతడు స్వాప్నికపదార్థములను సృజింపడు.

318 సూ॥; "పరాభిధ్యానాత్తు తిరోహితం తతోహ్యస్యబన్ధవిపర్యయౌ" (4) 3-2-4

అర్థః పర + అభిధ్యానాత్ + తు = పరమాత్మయొక్క సంకల్పముచేతను, తిరోహితం=జీవునియొక్క సత్యసంకల్పత్వాది గుణములు తిరోధాయకములైనవి. తతః హి = ఆ పరమాత్మ సంకల్పమువలన గదా, అస్య = ఈ జీవునకు, బంధవిపర్యయౌ=సంసారబంధము, మోక్షము కలుగుచున్నవి.

వివ: సంసారదశయందు జీవునకు సత్యసంకల్పత్వాది గుణములు తిరోహితములగుటవలన అతడు స్వాప్నిక పదార్థములను సృజింపలేడు. జీవుని సత్యసంకల్పాది గుణములు తిరోహితములగుటకు కారణము అతని కర్మానుసారియైన పరమాత్మయొక్క సంకల్పమే. పరమాత్మ యొక్క సంకల్పమువలననే జీవుడు సంసారబంధ మోక్షమును పొందుచున్నాడు. జీవుని బంధ మోక్షములు పరమాత్మాధీనములని భావము.

319 సూ॥ దేహయోగాద్వా సోఽపి (5) 3_2_5.

అర్థః సః + అపి=ఆ తిరోధానము, దేహయోగాత్ + వా=శరీర సంబంధమువలన కలుగుచున్నది.

వివ: జీవునకు స్థూల సూక్ష్మ శరీరముల సంబంధము వలన సృష్టి స్థితి, ప్రళయములయందు సత్యసంకల్పత్వాదిగుణములు తిరోహితములగు చున్నవి,

320 సూ॥ "సూచకశ్చ హి శ్రుతేరాచక్షతే చ తద్విదః" (6) 3-2-6

అర్థః సూచకః + చ + హి=స్వప్నములు శుభాశుభములకు సూచకములును అగుచున్నవి కదా!; శ్రుతేః=శ్రుతివలన

శ్రుతిః "యదా కర్మసు కామ్యేషు స్త్రియం స్వప్నేషు పశ్యతి

సమృద్ధిం తత్ర జానీయా త్తస్మిన్ స్వప్న నిదర్శనే-"ఛాం-5-2-9 కామ్యకర్మలను చేయునపుడు స్వప్నమున స్త్రీని చూచినచో సమృద్ధి కలుగునని తెలిసికొనవలయును.

తద్విదః + చ=ఆ స్వప్నశాస్త్రవేత్తలును; ఆచక్షతే=స్వప్నములు శుభాశుభ సూచకములని చెప్పుచున్నారు. చూడుడు: "అథ స్వప్నే పురుషం కృష్ణం కృష్ణదంతం పశ్యతి స ఏనం హన్తి" స్వప్నము నందు నల్లని దంతములు కల నల్లని పురుషుని చూచినచో అతడే ఇతనిని చంపునని తెలిసికొనవలయును.

వివ: స్వప్నములు శుభాశుభసూచకములని శ్రుతి చెప్పుచున్నది. స్వప్నశాస్త్రవేత్తలును అట్లే చెప్పుచున్నారు. జీవుడే స్వప్న పదార్థములను సృష్టించుకొనుపక్షమున అశుభసూచికములైన పదార్థములను ఏల సృష్టించుకొనును? కావున స్వాప్నిక పదార్థములు పరమాత్మయొక్క మాయా సృష్టి మాత్రమే అని సిద్ధాంతము.

### 76 తదభావాధికరణము 2

నిద్రలో జీవుడు నాడులను పురీతన్నాడిని, పరమాత్మను ఆశ్రయించి యుండును.

321 సూ॥ "తదభావో నాడీషు తచ్ఛ్రుతేరాత్మని చ"(1) 3-2-7

అర్థ: తత్ + అభావః = ఆ స్వప్నములేకపోవుట అనగా సుషుప్తిదశ; నాడీషు = నాడులయందును; పురీతత్ అను ఒక ప్రత్యేక నాడియందును, ఆత్మని చ = పరమాత్మ యందును జీవునికి సంభవించును. శ్రుతేః = శ్రుతివలన;

వివ: "అసు తదా నాడీషు సుప్తో భవతి" (ఛాం. 8-6-3) ఈ నాడులయందు జీవుడు నిద్రాదశలో చేరియుండును. "పురీతతి శేతే" (బృ 4-1-19) పురీతత్ అను నాడియందు శయనించియుండును. "సతా సోమ్య తదా సంపన్నో భవతి" (ఛాం 6-8-1) ఓ సౌమ్యుడా! నిద్రయందు జీవుడు సత్ అనబడు పరమాత్మతో చేరియుండును. అను ఈ ఉపనిషద్వాక్యములు జీవుడు సుషుప్తిదశలో నాడులయందు పురీతన్నాడియందు, పరమాత్మయందును చేరిఉండును అని చెప్పుటచే వీటి అన్నింటియందును ప్రాసాద ఖట్వా పర్యంకన్యాయమున (మేడ మీది మంచము మీదగల పరుపు మీద పండుకొనియున్నాడు అను విధముగ) చేరియుండవచ్చును. నాడులద్వారా పురీతన్నాడిని చేరి అచట బ్రహ్మముతో చేరియుండునని భావము.

322 సూ|| "అతః ప్రబోధోఽస్మాత్" (2) 3-2-8

అర్థః: అతః=బ్రహ్మమే జీవునకు సుషుప్తిదశలో సాక్షాత్తు విశ్రమస్థానమగుటవలన; అస్మాత్=ఈ పరబ్రహ్మమునుండి, ప్రబోధః= జీవుడు మేల్కొనుట జరుగుచున్నది.

### 77 కర్మానుస్మృతిశబ్దవిధ్యధికరణము 3

జీవుడు సుషుప్తిదశలో పరమాత్మను చేరియున్నను మోక్షమును పొందడు.

323 సూ|| "స ఏవతు కర్మానుస్మృతిశబ్ద విధిభ్యః 3-2-9

అర్థః: సః + ఏవతు=నిద్రకు ఉపక్రమించిన జీవుడే నిద్రావసానమున ప్రబోధమును గాంచును; కర్మ=తాను అనుభవింపవలసిన కర్మ శేషించియుండుట వలనను; అనుస్మృతి=ఆ దేవదత్తుడను నేను

అని స్మరించుట వలనను; శబ్ద="త ఇహ వ్యాఘ్రో వా సింహో వా... యద్యద్భవంతి తథా భవంతి" (ఛా-6-10-2) జీవుడు నిద్రించుటకు ముందు వ్యాఘ్రముగ, సింహముగ ఈ రీతులలో ఏ విధముగ నుండెనో నిద్రనుండ మేల్కొనిన పిదప కూడ అట్లే ఉండును అను శ్రుతి వలనను; విధిభ్యః=మోక్షాదులకు ఉపాయములైన ఉపాసనాది విధులను ఆచరించుటకొఱకును, నిద్రించిన జీవుడే మేల్కొనును గాని మరియొకడు కాడు.

వివ: జీవుడు సుషుప్తి దశయందు పరమాత్మతో జేరియుండునని పై తదభావాధికరణమునందు తెలుపబడినది. జీవుడు పరమాత్మతో చేలినచో ఇక అతనికి మోక్షమేకదా! కావున మేల్కొను జీవుడు ముందు నిద్రించిన జీవునికంటె భిన్నమైనవాడై ఉండవలయును అని సందేహము రాగా దానిని నివర్తింపచేయుటకై ఈ అధికరణము ప్రారంభింపబడినది. నిద్రాదశలో జీవుడు పరమాత్మను ఆశ్రయించియున్నను శరీరేంద్రియాదిసంబంధము వీడనందువలన అతనికి మోక్షము సిద్ధింపదు.

### 78 ముగ్ధాధికరణము 4

మూర్ఛ అర్ధమరణము

**324 సూ|| "ముగ్ధేఽర్ధ సంపత్తిః పరిశేషాత్" 3-2-10**

అర్థ: ముగ్ధే=మూర్ఛను పొందిన వానిలో; అర్ధసంపత్తిః=సగము మరణదశ ఏర్పడుచున్నది; పరిశేషాత్=పరిశేషన్యాయమువలన.

వివ: జాగ్రత్, స్వప్న, సుషుప్తులు అను మూడు దశలలో దేనియందును ఈ మూర్ఛావస్థ చేరదు. మూర్ఛానంతరము ఆ వ్యక్తి

తిరిగి లేచి తిరుగుజచే ఇది పూర్తిమరణము కాజాలదు. కావున మూర్ఛను అర్ధమరణమని భావింపవలయును.

79 ఉభయలింగాధికరణము 5

పరబ్రహ్మము నిఖిలదోషరహితము, కళ్యాణగుణసహితము నై యుండును.

325 సూ॥ నస్థానతోఽపి పరస్యోభయలింగం సర్వత్ర హి (1) 3-2-11

అర్థః స్థానతః + అపి=స్థానమునుబట్టియు, అనగా తాను వ్యాపించియుండు చేతనాచేతనములను బట్టియు; పరస్య=పరమాత్మకు; న= జీవునికిగల పై స్వప్ననిద్రాదులవంటి దోషములు సంభవింపవు. సర్వత్ర=అంతట, అనగా శ్రుతి, స్మృతుల యందు; ఉభయలింగం హి=పరమాత్మ దోషములులేనివాడు, కళ్యాణగుణములు కలవాడు అని ఈ రెండు లక్షణములు గలవాడుగ కీర్తింపబడుచున్నాడు కదా!

శ్రుతిః "అపహతపాప్మా.......సత్యసంకల్పః (ఛాం 8-1-5) పాపములు లేనివాడు......సత్యమైన సంకల్పము కలవాడు.

స్మృతిః "సమస్తకల్యాణగుణాత్మకోసౌ-(వి.పు" 6-5-84) ఈ పరమాత్మ సమస్త కళ్యాణగుణములు కలవాడు. ఈ మొదలగునవి.

326 సూ॥ "భేదాదితి చేన్న ప్రత్యేకమతద్వచనాత్" (2) 3-2-12

అర్థః భేదాత్=అవస్థాభేదమును బట్టి అనగా ప్రకృతిసంబంధమునుబట్టి జీవునివలె పరబ్రహ్మముకూడ పై నిద్రాది దోషములను

పొందవలయును. ఇతిచేత్ = అనుచో; న = అట్లుకాదు. ప్రత్యేకం = ప్రత్యేకముగ; అతద్వచనాత్=ఆ దోషములు బ్రహ్మమునకు అంటవు అని శ్రుతి చెప్పుటవలన.

శ్రుతి: "యస్య పృథివీ శరీరం...స త ఆత్మాఽన్తర్యామ్యమృతః" (బృ 5-7-3). ఎవనికి పృథివి శరీరమో...అతడు నీకు ఆత్మ. నీలో ఉండి నిన్ను నియమించువాడు. అతడు మరణము లేనివాడు.

327 సూ|| "అపి చైవమేకే"- (3) 3-2-13

అర్థః అపిచ=మఱియు; ఏకే = కొందఱు (కఠశాఖీయులు) ఏవం=ఈ విధముగ, అనగా జీవుడు, పరమాత్మ, ఇద్దఱు శరీరము నందు ఉన్నను పరమాత్మకు ఆ దోషములు అంటవు అని స్పష్టముగ చెప్పుచున్నారు.

కఠ శ్రుతి: ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే।
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి
అనశ్నన్నన్యో అభిచాకశీతి-(ముండ 3-1-1)

"రెండు పక్షులు కలసి మెలసి స్నేహముతో ఒకే వృక్షమును ఆశ్రయించుకొని యున్నవి. వానిలో ఒక పక్షి ఆ వృక్షముయొక్క తీయని ఫలమును తినుచుండగా, రెండవ పక్షి ఆ ఫలమును తినకయే ప్రకాశించుచున్నది. ఇచట రెండు పక్షులు జీవాత్మపరమాత్మలు. దీనిని బట్టి బ్రహ్మము ప్రకృతి యందు వ్యాపించి యున్నను దాని దోషములు ఏవియు బ్రహ్మమునకు సంక్రమింపవు అవి స్పష్టమగుచున్నది.

328 సూ|| "అరూపవదేవ హి తత్ప్రధానత్వాత్" (4) 3-2-14

**అర్థ:** తత్=ఆ బ్రహ్మము; ప్రధానత్వాత్=జీవులకు నామ, రూప ములను కల్పించుట ప్రధానమైనందువలన; అరూపవత్+ఏవ హి= పృధివ్యాదులను శరీరముగ కలిగియుండియు రూపము లేనిదానివలె ఉండును.

**వివ:** మనుష్యాదిశరీరములయందు జీవుడు కర్మఫలము ననుభవించుటకై ప్రవేశించును. జీవునిచే కర్మఫలమును అనుభవింప చేయుటకై అతనికి నామ, రూపములను కలిగించి, అందు పర మాత్మయు ప్రవేశించును. అట్లు ప్రవేశించినను, ఫలభోక్త కానందు వలన అతనికి ఎట్టి దోషములును అంటవు. కావున బ్రహ్మము దోష రహితము, కళ్యాణగుణసహితమునై ఒప్పుచున్నది.

329 సూ॥ "ప్రకాశవచ్చావైయర్థ్యాత్" (5) 3-2-15

**అర్థ:** ప్రకాశవత్+చ="సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" (తై-బ్ర 1-1) సత్యము, జ్ఞానము అనంతమునైన బ్రహ్మము అను వాక్యముచే తెలియబడు బ్రహ్మముయొక్క స్వయంప్రకాశత్వమువలె; అవైయర్థ్యాత్="యస్సర్వజ్ఞః" (ముండక 1-1-9) ఎవడు సర్వజ్ఞుడో; "పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీజ్ఞానబలక్రియాచ" (శ్వేత 6-8) ఈ బ్రహ్మముయొక్క ఉత్తమము, నానావిధములైన శక్తి సహజములైన జ్ఞాన, బల, (క్రి) యాదులు ప్రసిద్ధములేకగా: ఈ మొదలయిన ఉపనిషద్వాక్యములచే తెలుపబడిన సర్వజ్ఞత్వాదికళ్యాణ గుణములును వ్యర్థములు కాకుండుటకుగా బ్రహ్మమునందు వీనిని కూడ అంగీకరింపవలయును. కావున పరబ్రహ్మము అనంత కళ్యాణ గుణాకరము.

330 సూ॥ "ఆహ చ తన్మాత్రమ్" (6) 3-2-16

అర్థః తత్ + మాత్రం="సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" (తై-బ 1-1) అను వాక్యము సత్యత్వాది గుణములను మాత్రమే; అహచ= తెలిపినదేకాని, ఇతర-ఉపనిషద్వాక్యములచే తెలుపవడిన సర్వజ్ఞత్వ, సత్యసంకల్పత్వాది గుణములను నిషేధింపలేదు.

331 సూ॥ "దర్శయతి చాథో అపి స్మర్యతే" (7) 3-2-17

అర్థః అథో=సమస్త వేదాంతగణము; దర్శయతిప="తమీశ్వరాణాం పరమం మహేశ్వరం" (శ్వేత 6-7) ఈశ్వరులకును అధీశ్వరుడైన అతనిని; "నిష్కళం నిష్క్రియః౦ శాంతం" (శ్వేత 6-19-2) అవయవరహితుడు, క్రియాశూన్యుడు, నిర్వికారుడు అనుచు శ్రుతి పరమాత్మయొక్క కళ్యాణగుణాకరత్వమును, నిర్దోషత్వమును బోధించుచున్నది; స్మర్యతే + అపి=యో మామజమనాదించ వేత్తి లోకమహేశ్వరమ్." (భ. గీ. 10 3) ఎవడు నన్ను జన్మము, అదిలేనివానినిగను, లోకములకు అధిపతిగను తెలిసికొనుచున్నాడో, అనుచు ఈ విషయము స్మృతియందును పేర్కొనబడియున్నది.

332 సూ॥ "అత ఏవ చోపమా సూర్యకాదివత్"-(8) 3 2-18

అర్థః అత ఏవ చ=ఇందువలననే, అనగా బ్రహ్మము చిదచిదాత్మక ప్రపంచమున వ్యాపించియుండియు దాని దోషములు తనకు అంటక సర్వజ్ఞత్వాదికళ్యాణగుణములను కలిగియుండుటవలననే: సూర్యక + ఆదివత్ = జలాదులయందు సూర్యప్రతిబింబాదులవలె బ్రహ్మము సర్వత్ర ఉండునని; ఉపమా=సామ్యము చెప్పబడుచున్నది.

ప్రమాణము :

"ఆకాశమేకం హి యథా ఘటాదిషు పృథగ్భవేత్|
తథాఽఽత్మైకోహ్యనేకస్థో జలాధారేష్వివాంశుమాన్"
(యాజ్ఞ. స్మృ-ప్రాయశ్చిత్తకాండ 144)

ఆకాశ మొక్కటే యైనను ఘటాదులయందు వేరువేరుగా భాసించు నట్లును, సూర్యుడు ఒక్కడే అయినను జలాశయములయందు భిన్న భిన్నముగా భాసించునట్లును ప్రపంచమున బ్రహ్మము భాసించును.

333 సూ: "అమ్బువదగ్రహణాత్తు న తథాత్వమ్" (9)3.2.19

అర్థ: అమ్బువత్=నీటియందు (సూర్యప్రతిబింబము)వలె; అగ్రహణాత్+తు=పృథివ్యాదులయందు పరమాత్మ(వ్యాప్తి) గ్రహింపబడనందు వలన; తథాత్వం=(నీటియందు ప్రతిబింబించిన సూర్యుని వలె) పరమాత్మ ఆశ్రయ దోషరహితుడై ఉండుట; సరిపడదు.

వివ: సూర్యుడు వాస్తవముగ నీరులో ప్రవేశింపడు. అతని ప్రతిబింబము మాత్రమే అందు గోచరించును. కావున సూర్యునికి ఆ జలములో ఉండు దోషములు సంక్రమింపవు. కాని పరమాత్మ పృథివ్యాది సకల పదార్థములయందును నామరూపవ్యాకరణమునకై వాస్తవముగ ప్రవేశించుచున్నాడు. కావున ప్రకృతిగతదోషములు పరమాత్మయందు తప్పక సంక్రమించును అని పూర్వపక్షము.

334 సూ|| వృద్ధిహ్రాసభాక్త్వ మంతర్భావా దుభయసామంజస్యా దేవం దర్శనాచ్చ (10) 3-2-20

అర్థ: అంతర్భావాత్=పరమాత్మ పృథివ్యాదులయందు (అంతర్భవించి) వ్యాపించి ఉండుటవలన; వృద్ధిహ్రాసభాక్త్వం=బ్రహ్మము

యొక్క స్వరూపము సంకోచవికాసముల నందుట (జలసూర్య దృష్టాంతముచే నివర్తింపబడుచున్నది.) ఉభయసామంజస్యాత్ = ఘటాదుల యందు ఆకాశమునకు "జలాశయములందు సూర్యునివలె" అను రెండు విధములైన దృష్టాంతములు సరిపడవలసి యున్నందువలనను; దర్శనాత్ + చ = దృష్టాంతమునందలి గుణము లన్నియు దార్ష్టాంతికము నందు చూపట్టకున్నను దానిని దృష్టాంతీకరించుట చూపట్టుటవలనను ఏవం = ఇట్లు నిశ్చయింపబడుచున్నది.

వివ : "ఆకాశ మేకం హి యథా ఘటాదిషు పృథగ్భవేత్" ఆకాశము ఒక్కటే అయినను అది వివిధరూపములలో నున్న ఘటాదుల యందు ఎట్లు వేర్వేరుగ గ్రహింపబడుచున్నదో అట్లే పరమాత్మ ఒక్కటే అయినను పృథివ్యాదులయందు భిన్నభిన్నముగ గ్రహింపబడు చున్నాడు అనియు "జలాధారేష్వివాంశుమాన్" జలాశయముల యందు ప్రతిబింబించిన సూర్యునివలె (జలగత దోషములు సూర్యునికి అంటని విధముగ పరమాత్మ అంతట వ్యాపించియున్నను అతనికి ఆయా పదార్థముల దోషములు అంటవు అనియు శ్రుతి; దృష్టాంత ప్రదర్శన పూర్వకముగ చేతనాఽచేతన పదార్థములయందు పరమాత్మ, వ్యాప్తిని, అతని నిర్దోషత్వమును విశదీకరించుచున్నది. ఘటాకాశ దృష్టాంతముచే చేతనాఽచేతనములయందు పరమాత్మవ్యాప్తి సత్యమని తెలుపుచున్నది. పరమాత్మ అట్లు వాస్తవముగ అంతట వ్యాపించియున్నను ఆయా పదార్థముల దోషములు పరమాత్మయందు సంక్రమింపవు అని జలసూర్యదృష్టాంతము తెలుపుచున్నది. ఈ విధముగ గ్రహించినపుడే పై రెండు దృష్టాంతములు సంగతములు కాగవు. జలసూర్య దృష్టాంతమున సూర్యుడు వాస్తవముగ జలమునందు లేనట్లే పరమాత్మయు పృథివ్యాదులయందు వాస్తవముగ లేదు అని

అర్థము రాదా? అని శంకించుట తగదు. దృష్టాంతము నందలి ధర్మములు నన్నింటిని దార్ష్టాంతికమునందు సమన్వయించవలయుననునిర్బంధములేదు. సింహ ఇవ మాణవకః బ్రహ్మచారి సింహమువంటివాడు" అను వాక్యమున బ్రహ్మచారికి సింహముతో అన్ని విధముల సామ్యము సంభవింపదుగదా. కావున పరమాత్మ అంతట వ్యాపించియున్నను వాని దోషములు అతనికి అంటవు అని సారాంశము. శ్రీశంకరులు "దర్శనాచ్చ" అను సూత్ర భాగమును వేరొక సూత్రముగ స్వీకరించి వ్యాఖ్యానించిరి.

335 సూ॥ ప్రకృతైతావత్త్వంహి ప్రతిషేధతి తతో బ్రవీతి చ భూయః (11) 3.2.21

అర్థః ప్రకృత + ఏతావత్త్వం = ప్రస్తుతమైన మూర్తాఽమూర్త. రూప బ్రహ్మశరీరముయొక్క పరిచ్ఛిన్నతను (పరిమితత్వమును) ప్రతిషేధతి హి = "నేతి నేతి" అను శ్రుతి ప్రతిషేధించుచున్నది; తతః = ఆపైన. భూయః = అధికముగ; బ్రవీతి చ = విశేషములను చెప్పుచున్నది

వివః ద్వే హివ బ్రహ్మణో రూపే మూర్తంగామూర్త మేవ చ" (బృ. 4.3.1) అను శ్రుతి "బ్రహ్మమునకు రెండు రూపములు గలవు. మూర్తము అమూర్తము అని, అనగా మూర్తప్రపంచము (స్పష్టముగ గోచరించు ప్రపంచము, అమూర్త ప్రపంచము (అస్పష్టముగ సూక్ష్మరూపమున గోచరించు ప్రపంచము) ఇవి రెండును (సమగ్ర ప్రపంచము) బ్రహ్మముయొక్క రూపము అని తెలిపి "అథాఽత ఆదేశో నేతి నేతి" (బృ 4.3.6) "ఇక ఇదికాదు ఇదికాదు అని ఉపదేశము అనుచు బ్రహ్మకు రూపమైన కృత్స్న ప్రపంచమును నిషేధించుటచేత

బ్రహ్మము సన్మాత్రమే గాని ఉభయలింగము (హేయగుణరహితము, కళ్యాణగుణ విశిష్టము) కాదు అను పూర్వపక్షమునకు ఈ సూత్రము సమాధానము. "నేతి నేతి" అను శ్రుతి మూర్తాఽమూర్తాత్మకమైన బ్రహ్మ రూపమును నిషేధించుట లేదు. బ్రహ్మము ఇంతమాత్రమే కాదు, ఇంత మాత్రమేకాదు అని దాని పరిమితత్వమును మాత్రమే నిషేధించు చున్నది. బ్రహ్మము అపరిచ్ఛిన్నము, అనన్తము అని భావము. శ్రుతి మనకు తెలియని మూర్తామూర్తాత్మకబ్రహ్మరూపమును తానే ఉప దేశించి, మరల దానిని తానే ఎందులకు నిషేధించును. అపుడది ఉన్మత్త ప్రలాపము కాదా. కావున న + ఇతి = ఏవం న=(బ్రహ్మము) ఇట్టిది మాత్రమే కాదు; అనగా మూర్తామూర్తవిశిష్టమైనది మాత్రమే కాదు"— అని యర్థము. బ్రహ్మము అపరిచ్ఛిన్నమని సారాంశము. కావుననే ఇట్లు నిషేధించిన తర్వాత "నహ్యేతస్మాదితి నేత్యన్యత్పర మస్తి" (బృ. 4.3.6) "నేతి నేతి" అనుచు అపరిచ్ఛిన్నముగ తెలుప బడిన పరమాత్మకంటె విశిష్టమైనది మరియొకటిలేదుకదా "అథ నామ ధేయం. సత్యస్య సత్యం ప్రాణా వై సత్యం తేషా మేష సత్యం" (బృ. 4. 3. 6) ఇతనికి సత్యమునకు సత్యము అని పేరు. సత్య మనగా జీవులు, వారికిని సత్యము పరమాత్మ అని యర్థము. ఆకాశాదులవలె జీవుడు ఉత్పత్తి వినాశములు లేనివాడగుటచేత సత్యము అనబడుచున్నాడు. జ్ఞానసంకోచవికాసములుగల జీవులకంటె జ్ఞానసంకోచమెరుగని పర మాత్మ విలక్షణు డగుటచేత "సత్యస్య సత్యం," అనబడుచున్నాడు. ఈ విధముగ గుణవిశేషములను శ్రుతి ప్రస్తుతించుటచే బ్రహ్మము చేతనాఽ చేతనశరీరకము, హేయగుణరహితము, కళ్యాణగుణాకరము అని స్పష్టముగ సిద్ధించుచున్నది. కావున బ్రహ్మము ఉభయలింగము; నిర్గుణము కాదు. శ్రీశంకరులు ఈ సూత్రమును వేరొక అధికరణముగ గ్రహించిరి.

336 సూ॥ తదవ్యక్తమాహహి 3.2.22

అర్థ : తత్=ఆ బ్రహ్మము; అవ్యక్తం=ఏ ప్రమాణము చేతను గోచరింపనిది అని; ఆహహి=శ్రుతి చెప్పుచున్నది కదా.

వివ : "న చక్షుషా పశ్యతి కశ్చనైనం" (తై. నా. అ. 3) ఎవ్వడును ఈ పరమాత్మను కంటితో చూడలేడు. "న చక్షుషాగృహ్యతే నాఽపి వాచా" ఈ పరమాత్మ కంటితోగాని వాక్కుతోగాని గ్రహింపబడదు ఈ మొదలైన శ్రుతివాక్యములు బ్రహ్మము ప్రమాణాఽంతర గోచరము కాదు అని తెలుపుచున్నవి.

337 సూ॥ అపి సంరాధనే ప్రత్యక్షాఽనుమానాభ్యామ్, 3.2,23

అర్థ : అపి (చ)=మరియు; సంరాధనే=ప్రీతిపూర్వకముగ భగవంతుని (ఉపాసించినచో) ఆరాధించినచో (అతని స్వరూపము సాక్షాత్కరించును) ప్రత్యక్ష+అనుమానాభ్యాం=శ్రుతిస్మృతులవలన (ఈ విషయము తెలియుచున్నది).

వివ : పరమాత్మ మనకంటికి వాక్కునకు గోచరింపకున్నను భక్తితో ఆరాధించినచో సాక్షాత్కరించును. ఇందులకు శ్రుతి ప్రమాణము. "నాఽయ మాత్మా ప్రవచనేన లభ్యః న మేధయా న బహునా శ్రుతేన-య మేవైష వృణుతే తేనలభ్యః తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్" (ముండక 3.23) ఈ పరమాత్మ వేదాధ్యయనప్రవచనములచేతగాని, బుద్ధిబలముచేతగాని, అధికముగ వినుట చేతగాని పొంద శక్యము కాదు. ఈ పరమాత్మ ఎవనిని ప్రేమించునో కరుణించునో) అతనిచేత మాత్రమే పొందదగియున్నాడు. అద్ది

ప్రియభక్తునికే ఇతడు తన స్వరూపమును సాక్షాత్కరింపజేయును. "భక్త్యా త్వనన్యయా శక్యః అహ మేవం విధోఽర్జున, జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప" (భ.గీ. 11.54) "అర్జునా, నా యీ రూపమును చక్కగ తెలిసికొని దర్శించి, సంపూర్ణముగ అనుభవించుటకు అనన్యభక్తి ఒక్కటే ఉపాయము" అనునది స్మృతి ప్రమాణము. మనము పరమాత్మను పరమప్రేమాత్మికరయిన భక్తితో సేవించినచో అతడును మనలను అత్యంతము ప్రేమతో అనుగ్రహించి, స్వస్వరూపమును దర్శింపజేయునని భావము. కావున నేతి నేతి అను శ్రుతి-పరమాత్మస్వరూపరూపగుణవిభుత్వాదులచే అపరిచ్ఛిన్నము అని మాత్రమే తెలుపుచున్నది గాని బ్రహ్మముయొక్క మూర్తాఽమూర్త రూపములను నిషేధించి, బ్రహ్మము నిర్విశేషము, సన్మాత్రము అని బోధించుటలేదు. శ్రీ శంకరుల వ్యాఖ్యానుసారము ఈ సూత్రమున "అపిచ" అని చకార మొకటి ఎక్కువగా కలదు.

338 సూ॥ ప్రకాశాదివచ్చాఽవైశేష్యం; ప్రకాశశ్చ కర్మణ్య భ్యాసాత్ 3.2॥24

అర్థ : కర్మణి=సంరాధన కర్మమునందు (ఉపాసనమునందు); అభ్యాసాత్=అభ్యాసము వలన; ప్రకాశః=బ్రహ్మస్వరూపదర్శనము కలుగుచున్నది. ప్రకాశ+ఆదివత్=బ్రహ్మ సాక్షాత్కారమున బ్రహ్మముయొక్క జ్ఞానానందాది గుణములవలె మూర్తాఽమూర్తవిశిష్ట స్వరూప జగదైశ్వర్యమును భాసించుటలో; అవైశేష్యం=విశేషము లేకుండుట (సంభవించుచున్నది).

వివ : ఉపాసనాఽభ్యాస పాటవమున బ్రహ్మముమ సాక్షాత్కరింపవచ్చును. ఆ సాక్షాత్కార సమయమున బ్రహ్మముయొక్క జ్ఞానా

నందాదిగుణములవలె మూర్తామూర్త విశిష్టత్వరూపజగదీశ్వరత్వాది గుణములును భాసింపవచ్చును. కావుననే వామదేవఋషి "అహంమను రభవం, సూర్యశ్చ" (బృ. 3.4.10) నేను మనువునై యుంటిని, సూర్యుడనై యుంటిని" అని అనుచు బ్రహ్మసాక్షాత్కారసమయమున జగదీశ్వరత్వాది గుణములను అనుసంధించెను.

339 సూ॥ అతో౽నన్తేన తథాహి లింగమ్ 3.2 25.

అర్థ: అతః=ఇందువలన; అనన్తేన = లెక్కింపశక్యముకాని కళ్యాణగుణములతో (బ్రహ్మము కూడియుండును) తథాహి=అట్లేకదా; లింగం = నిర్దుష్టత్వకళ్యాణగుణాకరత్వరూపమైన బ్రహ్మలింగము సిద్ధించుచున్నది.

వివ: పై హేతువులవలన బ్రహ్మము అనంతకళ్యాణగుణ విశిష్టమైనదని సిద్ధించుచున్నది. ఈ రీతిని బ్రహ్మము ఉభయ లింగము అనగా హేయగుణ రహితము, కళ్యాణగుణవిశిష్టము అనుట స్పష్టమగుచుండగా "బ్రహ్మము సన్మాత్రమే" సన్మాత్రమే" అనుట ఎట్లు పొసగును?.

80 అహికుండలా౽ధికరణము 6

బ్రహ్మము— చేతనా౽చేతనములు

340 సూ॥ ఉభయవ్యపదేశాత్త్వహి కుండలవత్ 3.2.26

అర్థ: ఉభయవ్యపదేశాత్ + తు=జగద్బ్రహ్మములకు భేదమును అభేదమును శ్రుతులు చెప్పువలన; అహికుండలవత్=అహికుండల న్యాయ

మునపై భేదాఽభేదములు రెండును సంభవింపవచ్చును.

వివ : మూర్తాఽమూర్తాత్మకమైన ఈ అచిత్ప్రపంచము బ్రహ్మముకంటె భిన్నమా? అభిన్నమా? అను సందేహమునకు ఈ అధికరణమున సమాధాన మొసగబడుచున్నది. "ఆత్మైవేదం సర్వం" (ఛాం 7.23.2) "ఈ ప్రపంచమంతయు ఆత్మయే" అను శ్రుతి జగత్తునకు బ్రహ్మమునకు అభేదమును బోధించుచున్నది. "అస్మాన్మాయీ సృజతే విశ్వమేతత్" (శ్వే 4.9) "ప్రకృతి విశిష్టుడైన పరమాత్మ దీని నుండి ఈ విశ్వమును సృజించుచున్నాడు." అను శ్రుతి భేదమును బోధించుచున్నది. ఇది యెట్లు సంభవము? అనగా పొడవుగా ఉండు సర్పము చుట్టచుట్టుకొని పరుండునపుడు కుండలాకారమున గోచరించును. నిద్రనుండి లేవగనే మెలికలు తిరుగుచు దీర్ఘముగ చూపట్టును, దీర్ఘమైన సర్పమే కుండలాకారమును పొందినట్లు బ్రహ్మము జగదాకారముగ పరిణమించినది అని అంగీకరించుట యుక్తము. ఇట్లు చెప్పిననే పై రెండు విధములైన శ్రుతులకును సమన్వయము కుదురగలదు అని యొక పక్షము.

341 సూ॥ ప్రకాశాశ్రయవద్వా తేజస్త్వాత్ 3.2.28.

అర్థ : తేజస్త్వాత్ = తేజోద్రవ్య మగుటవలన; ప్రకాశ + ఆశ్రయవత్ + వా = ప్రకాశమునకును (కాంతికిని) దానికి ఆశ్రయమైన దీపాది ద్రవ్యమునకునువలె నైనను; (జగత్తునకును బ్రహ్మమునకును భేదము అభేదము సిద్ధింపవచ్చును.)

వివ : దీపము, దాని కాంతి పరస్పరము భిన్నములైనను రెండును తేజోద్రవ్యములే అగుటవలన అభిన్నము అనియు చెప్ప

వచ్చును గదా. అట్లే జగద్బ్రహ్మములకు బ్రహ్మత్వమునుబట్టి అభేదమును; చైతన్యవత్త్వ చైతన్యరహితత్వ రూపభేదమునుబట్టి భేదమును అంగీకరింపవచ్చును. అహికుండల దృష్టాంతము ననుసరించినచో బ్రహ్మము అచిద్రూపపరిణామమును పొందుచున్నదని అంగీకరింపవలెవచ్చును. అది యుక్తముకాదు. ఇది ఇంకొక పక్షము.

342 సూ|| పూర్వవద్వా 3.2.28

అర్థః పూర్వవత్ + వా=(పై రెండు వాదములును సరికావు) పూర్వము జీవుడు బ్రహ్మముయొక్క అంశము అని చెప్పిన రీతిని అచిత్తును కూడ బ్రహ్మముయొక్క అంశమే అగుచున్నది.

వివ : "అంశో నానావ్యపదేశాత్" (బ్ర. సూ. II అ.3 పా. 42 సూ) ప్రకాశాదివత్తు నైవం పరః" (బ్ర. సూ. II అ.వె.పా. 45సూ) అను సూత్రములయందు చెప్పిన రీతిని జీవునివలె అచేతనప్రకృతిలో బ్రహ్మముయొక్క అంశము అని చెప్పుట యుక్తము. బ్రహ్మము చిదచిద్విశిష్టము గదా. విశిష్టవస్తువునందు విశేషవస్తువు అంశముగా నుండును. ఆ విశేషణ విశేష్యముల స్వరూప స్వభావభేదమును పురస్కరించుకొని వానిని భిన్నముగను, వాని అంశాంశిభావమును పురస్కరించుకొని అభిన్నముగను వ్యవహరింపవచ్చును అని సిద్ధాంతము.

343 సూ|| ప్రతిషేధాచ్చ 3.2.29

అర్థ : ప్రతిషేధాత్ + చ = అచిద్వస్తువుయొక్క ధర్మములను బ్రహ్మమునందు నిషేధించుటవలనను అది బ్రహ్మాభిన్నము కాక బ్రహ్మాంశ మగుచున్నది.

వివ : "స వా ఏష మహా నజ ఆత్మా అజరః అమరః" (బృ॰ 4-4-25) "అయీ పరమాత్మ గొప్పవాడు పుట్టుక లేనివాడు, ఆత్మయైనవాడు. జరామరణములు లేనివాడు" అని ప్రకృతిధర్మములైన జన్మ జరామరణాదులను బ్రహ్మమునందు నిషేధించుటవలన చేతనాచేతనములు బ్రహ్మభిన్నములు కాక బ్రహ్మాంశములగుచున్నవి. ఈ రీతిగ చిదచిద్విశిష్టమైన బ్రహ్మమే కారణము, కార్యము అగుటచే (సూక్ష్మచిదచిద్విశిష్ట బ్రహ్మము కారణము- స్థూలచిదచిద్విశిష్ట బ్రహ్మము కార్యము) ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానప్రతిజ్ఞ (కారణపదార్థమును తెలియుటచే కార్యపదార్థమును తెలియుట) సుసంగతమగుచున్నది. కావున విశిష్టమైన బ్రహ్మము దోష రహితము, కల్యాణగుణాకరము (ఉభయలింగము) అని సిద్ధించినది.

8॥ పరాధికరణము 7

పరబ్రహ్మమే అమృతమునకు సేతువు

344 సూ॥ పరమతస్సేతూన్మాన సంబంధ భేదవ్యపదేశేభ్యః 3.2.30

అర్థ : అతః=ఈ పరబ్రహ్మముకంటెను, పరం=వేరైన మరియొక తత్త్వము గలదు. సేతు+ఉన్మాన సంబంధ భేదవ్యపదేశేభ్యః= "సేతువు" అని చతుష్పాత్తు "షోడశకలము" అని చెప్పుటవలనను; ప్రాప్యప్రాపక సంబంధమును చెప్పుటవలనను.

వివ : "అథ య ఆత్మా స సేతుర్విధృతిః" (ఛాం.4.1) "ఎవడు ఆత్మయో అతడు సేతువు, దారకుడు నై యున్నాడు" అని పరమాత్మ

సేతువుగా పేర్కొనబడినాడు. సేతువు దేశాంతరప్రాప్తికి సాధనమే గాని పరమప్రాప్యము కాదు గదా. "చతుష్పాద్బ్రహ్మ" (ఛాం.3.18.2) "బ్రహ్మము నాలుగు పాదములు గలది" అని (ఉన్మాన) పరిచ్ఛేదించి చెప్పుటవలనను; "అమృతస్యైష సేతుః" (ముండ. 2.2 5) "అమృతమునకు (మోక్షమునకు) ఇతడు సేతువు" అనుచు ఈ బ్రహ్మమునకును మోక్షమునకును ప్రాప్యప్రాపక సంబంధమును తెలుపుటవలనను "తేనేదం పూర్ణం పురుషేణ సర్వం...తతో యదుత్తరతరం" (శ్వేతా శ్వే. 3.10) "ఈ ప్రపంచ మంతయు ఆ పురుషునిచే నిండియున్నది. అతనికంటె ఇతరము ఏది కలదో అది నామరూపరహితము" అని బ్రహ్మమునకు ఆ పైనగల తత్త్వమునకు భేదమును తెలుపుటవలనను జగత్కారణముగ ఇంతవరకు వర్ణింపబడిన పరబ్రహ్మముకంటె వేరుగ మరియొక తత్త్వము కలదు అని పూర్వపక్షము.

345 సూ॥ సామాన్యాత్తు 3.2.31

అర్థ: సామాన్యాత్ + తు = సాదృశ్యమునుబట్టి పరబ్రహ్మము సేతువుగా వర్ణింపబడినది.

వివ : పై పూర్వపక్షము సరికాదు. "అథ య ఆత్మా స సేతుర్విధృతిః ఏషాం లోకానాం అసంభేదాయ (ఛాం 8.4.1.) "ఈ లోకములో ఒకదానితో ఒకటి కలసిపోకుండుటకై పరమాత్మ సేతువుగా ఉన్నది." అను శ్రుతి సేతువు నీటిని విభజించి ధరించు రీతిని పరమాత్మ చేతనాఽచేతనములను సాంకర్యము పొందకుండునట్లు ధరించుటను తెలుపుచున్నది. సేతుసాదృశ్యము ఇంతవరకే గాని దేశాంతరప్రాప్తి సాధనము అని తెలుపుటకు గాదు—"అసంభేదాయ" అని సేతుసాదృశ్య

ప్రయోజనమును శ్రుతియే తెల్పుచున్నది కదా. కావున చిదచిద్విశిష్టము, జగజ్జన్మాదికారణము అయిన పరమాత్మకంటె భిన్నము, అధికము, ప్రాప్యము అయిన మరియొక తత్త్వము ఏదియు లేదు.

346 సూ॥ బుద్ధ్యర్థః పాదవత్ 3.2.32

**అర్థ :** పాదవత్=("వాక్ పాదః ప్రాణః పాదః" అని వాక్కును, ప్రాణమును బ్రహ్మమునకు) పాదములుగా చెప్పినరీతిని; బుద్ధి+అర్థః =("చతుష్పాద్బ్రహ్మ" బ్రహ్మము నాలుగు పాదములు గలది అని చెప్పుట) ధ్యాన (సౌకర్య)ముకొరకు అని గ్రహింపవలయును.

**వివ :** "చతుష్పాద్బ్రహ్మ" అను శ్రుతివాక్యము బ్రహ్మము యొక్క ఉన్మానమును (పరిమితిని) బోధింపదు. ఉపాసనా సౌకర్యము నకై బ్రహ్మము నాలుగుపాదములు కలదిగ వర్ణింపబడినది. దాని ప్రయోజనము అంతవరకే కావున పరబ్రహ్మమునకంటె మించినది మరి యొకటి లేదు.

347 సూ॥ స్థానవిశేషాత్ప్రకాశాదివత్ 3.2.33

**అర్థ :** ప్రకాశ+ఆదివత్=వెలుతురు మొదలగువానివలె; స్థాన విశేషాత్=వాగాదివిశేషస్థానములనుబట్టి (అపరిచ్ఛిన్నమైన పర బ్రహ్మము పరిచ్ఛిన్నముగ వర్ణింపబడినది).

**వివ :** అంతట వ్యాపించియుండు వెలుతురు కిటికీనుండి ప్రసరించునపుడు పరిమితముగ ఉన్నట్లు ఎట్లు భాసించునో అట్లే పర బ్రహ్మము వాక్కు, చక్షుస్సు మొదలగు స్థానములయందు భాసించుట చేత "చతుష్కల"మని పరిమితముగ పేర్కొనబడినది. కాన ఇది దోషము కాదు.

348 సూ॥ ఉపపత్తేశ్చ 3.2.34

అర్థ : ఉపపత్తేః + చ = (బ్రహ్మ ప్రాప్తికి బ్రహ్మమే (ఉపాయమనుటకు) (శ్రుత్యుపపత్తి ఉండుట వలనను (బ్రహ్మకంటె అధికమైన తత్త్వము లేదు).

వివః "అమృతస్యైష సేతుః" అనునెడ అమృతము (ప్రాప్తము) వేరు, సేతువు (ప్రాపకము) వేరు కాదు. ప్రాప్యమైన పరబ్రహ్మము ప్రాపకము అగుచున్నది. దీనికి శ్రుతి ప్రమాణము–

"నాఽయమాత్మా ప్రవచనేన లభ్యః
న మేధయా న బహునా శ్రుతేన।
య మేవైష వృణుతే తేన లభ్యః
తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్॥"

"ఈ పరమాత్మ వేదాధ్యయనముచేగాని, బుద్ధిచేగాని, అధికముగ వినుటచేగాని పొందశక్యము కాదు. ఈ పరమాత్మ ఎవనిని (ప్రేమతో) వరించునో అతనిచేతమాత్రమే పొందదగియున్నాడు. అట్టివానికే పరమాత్మ తన స్వరూపమును ప్రకాశింపజేయును" అనుటచేత పరమాత్మను పొందుటకు సాధనము (ఉపాయము) పరమాత్మయే అని స్పష్టమగుచున్నది. కావున "అమృతస్యైష సేతుః" అను నెడ సేతుశబ్దవాచ్యునికంటె అమృతశబ్ద వాచ్యుడు భిన్నుడు కాదని గ్రహింపవలయును.

349 సూ॥ తథాఽన్య ప్రతిషేధాత్ 3 2.35

అర్థ : తథా = అటే ; అన్యప్రతిషేధాత్ = బ్రహ్మముకంటె అధికమైనది ఇంకొకటి లేదని నిషేధము చూపబడుటవలనను (ప్రాప్య ప్రాపకి

ములు రెండును పరబ్రహ్మమే).

వివ : యస్మాత్పరం నాఽపర మస్తి కించిత్
యస్మాన్నాణీయో న జ్యాయోఽస్తి కశ్చిత్।

(శ్వేత-3-9-10), ఏ పరబ్రహ్మముకంటె మించినది "దానికి లోబడినది ఉండదో; ఏ పరబ్రహ్మముకంటె సూక్ష్మమైనది, పెద్దదైనది ఉండదో॥ అని చెప్పుటచే పరబ్రహ్మముకంటె మించిన తత్త్వము లేదని స్పష్ట మగుచున్నది. కావున "తతో యదుత్తరతరం" (శ్వేత 9-8) అను వాక్యమునకు తతః = అందువలన (బ్రహ్మముకంటె శ్రేష్ఠమైనది లేనందు వలన) యత్ ఉత్తరతరం=సర్వశ్రేష్ఠమైనది. ఏ పురుషతత్త్వము గలదో. (దానిచే ఇది అంతయు వ్యాప్తమై ఉన్నది) ఆ తత్త్వము కర్మమూ లకనామరూపరహితము- సుఖదుఃఖరహితము అని అర్థమును గ్రహింపవలయును "య ఏతద్విదురమృతాస్తే భవని." అను తరువాతి వాక్యము "ఈ పరతత్త్వమును ఉపాసించినవారు మోక్షమునందుదురు" అనుచు ఉపక్రమమునగల "తమేతం విదిత్వా అతిమృత్యుమేతి) "ఆయాపరమాత్మను ఉపాసించిన వారు మృత్యువును (సంసారమును" తరింతురు" అను వాక్యముతో సమానార్థకమై ఉపసంహారమును సూచించుచున్నది. ఇట్లు కానిపక్షమున ఉపక్రమోపసంహారములు విరుద్ధము అగును.

350 సూ॥ అనేన సర్వగతత్వ మాయామశబ్దాదిభ్యః
3-2-36

అర్థ: అనేన = ఈ బ్రహ్మముచేత, సర్వగతత్వం=అంతయు వ్యాపింపబడియుండుట, ఆయామశబ్ద + ఆదిభ్యః=వ్యాప్తిని బోధించు శ్రుతిస్మృతి వచనములవలన తెలియుచున్నది.

వివ : "తేనేదం పూర్ణం పురుషేణ సర్వం" (శ్వేత-3 9) "ఆ పరమాత్మచే ఈ ప్రపంచమంతయు వ్యాపింపబడియున్నది." "అంత ర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః"-(తై.నా. 6-11) "ప్రపంచముయొక్క లోపల వెలుపల వ్యాపించి పరమాత్మ నారాయణుడు ఉన్నాడు" ఈ మొదలైన శ్రుతివాక్యములు పరమాత్మ అంతట వ్యాపించి యున్నట్లు తెలుపుటచే జగజ్జన్మాది కారణమైన ఈ తత్త్వముకంటే ఉత్తమమైనది మరి యొకటి ఏదియు లేదని స్పష్టమగుచున్నది.

## 82 ఫలాఽధికరణము 8

### ఐహికాముష్మిక ఫలప్రదాత పరబ్రహ్మమే

**351 సూ॥ ఫలమత ఉపపత్తేః** 3-22-37

**అర్థ :** అతః = ఈ పరమాత్మవలననే; ఫలం=భోగాఽపవర్గరూప ఫలితము (సిద్ధించుచున్నది) ఉపపత్తేః=ఉపపన్నమగుటవలన.

**వివ :** పూర్వ మీమాంసకులు యజ్ఞయాగాదికర్మములే అపూర్వ ముద్వారా ఐహికాముష్మికఫలప్రదములని తలంచుచున్నారు. వీరు ఈశ్వరుని అంగీకరింపరు. కాని ఇట్లు అచేతనము, క్షణధ్వంసి అయిన కర్మ కాలాంతరమున ఫలప్రదము అనుట తగదు. కావున సర్వజ్ఞుడు, సర్వశక్తి మంతుడు, పరమకారుణికుడు, మహోదారుడు, నిగ్రహానుగ్రహసమర్థుడు అయిన సర్వేశ్వరుడే మనము గావించు యాగ ఉపాసనాదులచె ఆరాధితుడై ప్రీతిజెంది, ఫలము నొసంగును అనుటయే ఉపపన్నమగు చున్నది అని సిద్ధాంతము.

352 సూ॥ శ్రుతత్వాచ్చ 3-2-38

అర్థ : శ్రుతత్వాత్ + చ = (సర్వేశ్వరుడే ఫలప్రదుడు అని) శ్రుతులయందు వినబడుటవలనను (ఇదియుక్తము).

వివ : "అన్నాదో వసుదానః" (బృ. 6-4-24) "పరమాత్మ అన్నమును, సంపదను ఇచ్చువాడు" అనియు "ఏష హ్యేవానందయాతి" (తై. ఆ. 7.1) "ఈ పరమాత్మయే జీవులను ఆనందింపజేయుచున్నాడు" అనియు ఈ విధముగ శ్రుతివాక్యములు పరమాత్మయే ఫలప్రదాత అని తెలుపుచున్నవి.

353 సూ॥ ధర్మం జైమినిరత ఏవ 3-2-39

అర్థ : ధర్మం=ధర్మమునే ఫలప్రదముగ, జైమినిః= జైమిని మహర్షి (తలంచుచున్నారు) అతః + ఏవ=ఇదియే ఉపపన్నమగుటవలనను, శ్రుతి సమ్మతమగుటవలనను.

వివ : లోకమున మర్దనాదిక్రియ, కృష్యాదికర్మ మొదలైనవి సాక్షాత్తుగగాని, పరంపరలో గాని ఫలప్రదమగుటను చూచుచున్నాము గదా. శ్రుతికూడ "యజేత స్వర్గకామః" స్వర్గమును పొందగోరువాడు యజ్ఞము గావింపవలయును, "బ్రహ్మవిదాప్నోతి పరమ్" పరబ్రహ్మము నెఱింగినవాడు (ఉపాసించినవారు) పరబ్రహ్మమును పొందుచున్నాడు. అనుచు యజ్ఞ-ఉపాసనాది రూప కర్మములే ఫలప్రదము అని తెలుపుచున్నది. కర్మము క్షణధ్వంసి అయినను అపూర్వముద్వారా కాలాంతరమున స్వర్గమోక్షాది ఫలము నొసంగుచున్నది. అని జైమిని మహర్షి భావించుచున్నారు.

354 సూ॥ పూర్వం తు బాదరాయణో హేతువ్యపదేశాత్
3-2-40

అర్థ॥ పూర్వం తు=తొలుత చెప్పిన "పరమాత్మయే ఫల ప్రదాత" అను వాదమునే; బాదరాయణః=బాదరాయణమహర్షి (అమోదించుచున్నారు). హేతువ్యపదేశాత్=(శ్రుతియందు) హేతువు చెప్పబడుటవలన,

వివ: "వాయవ్యం శ్వేతమాలభేత భూతికామో; వాయుర్వై క్షేపిష్ఠా దేవతా వాయు మేవ స్వేన భాగధేయే నోపధావతి సఏ వైనం భూతిం గమయతి" సంపదను కోరువాడు వాయుదేవతాకమైన శ్వేత పశువును ఆలంభనము (హింసనము) గావింపవలయును. అనగా అట్టి పశువుతో యజ్ఞము గావింపవలయును. వాయువు శీఘ్రగతి గలది కదా. యజమానుడు తన భారముతో వాయువును అనుసరించినచో అతడే ఇతనికి ఐశ్వర్యము నొసపగును" అనుచు శ్రుతి సహేతుకముగ దేవత ఫలప్రదాత" అని తెలుపుచున్నది. యజ్ఞాదులవలన అపూర్వము సిద్ధించు నని శ్రుతి ఎచ్చటను బోధింపలేదు. ఇచట కర్మలను విధించు సందర్భముననే గదా (వాయుం) దేవత ఫలప్రద మని శ్రుతి తెలిపినది. ఇచట వాయువు ఫలప్రదాత అనగా వాయువునందు అంతర్యామిగా నున్న పరమాత్మ ఫలప్రదాత అని గ్రహింపవలయును. వాయ్వాదులకు స్వయముగ ఫలప్రదాన సామర్థ్యములేదు. ఇందుకు శ్రుతి స్మృతి ప్రమాణములను చూడుడు.

శ్రుతి: "ఇష్టాపూర్వం బహుధా జాతం జాయమానం విశ్వం బిభర్తి భువనస్య నాభిః-తదేవాఽగ్నిస్తద్వాయుస్తత్సూర్యస్తదు చంద్రమాః" (తై. నా.6-1-6) "అనేకవిధములు గావింపబడినవి, గావింప

బడుచున్నవి అయిన ఇష్టపూర్వములను ఆ పరమాత్మయే స్వీకరించుచున్నాడు. అతడు ఈ ప్రపంచమునకు నాభి అనగా ఆధారభూతుడు. అతడే వాయువు, అగ్ని, సూర్యుడు, చంద్రుడును. అనగా ఈ వాయ్వాదులయందు అంతర్యామిగా ఉండి వారిని నియమించువాడు" అని భావము. అంతర్యామి బ్రాహ్మణ వాక్యములనుబట్టి ఇట్టి అర్థమునే గ్రహింపవలయును.

స్మృతి : యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి।
తస్యతస్యాఽచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్॥
స తయా శ్రద్ధయా యుక్తః తస్యారాధన మీహతే।
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్॥
(భ) గీ.7.21.22

తా. : ఏయే భక్తుడు ఏయే దేవతామూర్తిని శ్రద్ధతో ఆరాధింపగోరుదునో అట్టివారికి అచంచలమైన అట్టి శ్రద్ధాభక్తులనే కలిగింతును. వారు ఆ శ్రద్ధాభక్తులతో ఆ దేవతను ఆరాధించి నే నొసంగు ఫలముల చేతను కోర్కెలను తీర్చుకొనుచున్నారు.

శ్లో॥ అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ
(భ. గీ. 9-26)

తా॥ "సమస్తయజ్ఞములచే ఆరాధింపబడువాడను, యజ్ఞఫల ప్రదాతను నేనే." కావున మనము ఇంద్రాదులను ఆరాధించినను ఇంద్రాదిశరీరకుడైన పరమాత్మయే సద్వారకముగ ఆరాధింపబడి ఫలము నొసంగుచున్నాడు అని సిద్ధించుచున్నది. ఇట్లు సద్వారకముగ గాక సాక్షాత్తుగ సర్వేశ్వరుని అనన్య ప్రయోజనముగ ఆరాధించినచో పునరా

వృత్తిలేని మోక్షమును ఆ సర్వేశ్వరుడు ఒసంగును అని "యాన్తి మద్యాజినోఽపి మాం" భగీ. 7,25 "దేవాన్ దేవయజో యాన్తి మామపి" గీ. 7-23 అను గీతావాక్యములు స్పష్టము చేయుచున్నవి కావున సకల ఫలప్రదాత సర్వేశ్వరుడే అని సిద్ధాంతము.

తృతీయాధ్యాయ ద్వితీయ పాదార్థ సంగ్రహ శ్లోకః

శ్లో|| పాదే స్వప్నాఽర్థహేతుః తదయ మిహ సుషుప్త్యాధృతి
సుప్తగోప్తా
ముగ్ధోద్బోధాదికర్తా త్వనఘశుభగుణో చిద్భిరంశీ స్వదేహైః।
పారమ్యస్యైకసీమా సకలఫలద ఇత్యుచ్యతే భక్తిభూమ్నే
సత్యేత్యేవం గుణాదా వథ పరభజనే రూపభేదాది చింత్యమ్॥

తా|| తృతీయాధ్యాయ ద్వితీయపాదమునందు సంధ్యాధికరణమున స్వాప్నికపదార్థసృష్టి పరమాత్మకార్య మనియు; తదభావాధికరణమున సుషుప్తిలో జీవుని పరమాత్మ ధరించుననియు; కర్మానుస్మృతి శబ్దవిధ్యధికరణమున సుప్తపురుషుని పరమాత్మ ధరించుననియు; ముగ్ధాధికరణమున మూర్ఛ నందిన వానిని మోహమును తొలగించువాడు పరమ మాత్మ యనియు; ఉభయలింగాఽధికరణమున పరమాత్మ హేయ గుణరహితుడు కళ్యాణగుణాకరుడు ననియు; అహికుండలాఽధికరణమున పరమాత్మ చేతనాఽచేతన శరీరకుడనియు; పరాఽధికరణమున పరమాత్మయే పరాత్పరు డనియు; ఫలాఽధికరణమున సకలఫలప్రదాత పరమాత్మయే అనియు చెప్పబడినది. ఇక పై పాదమున జగత్కారణత్వ అపహత పాప్మత్వాది రూప గుణభేదముచె సద్విద్యా దహరవిద్యాదిరూప ఉపాసనాభేదము చెప్పబడమన్నది. సద్విద్యాదులయందు ఉపాస్యుడు పరమాత్మ. అతని మీద భక్త్యతిశయమును కలిగించుటకు

ఈ పాదమునందు ఇట్లు అతని కళ్యాణగుణములు ప్రస్తుతింపబడినవి. పరమాత్మయొక్క ఈ గుణములు, రూపములు సత్యములై ఉన్నప్పుడే కదా వానినిబట్టి భిన్నభిన్న ఉపాసనలు సిద్ధించునది. కావున పరమాత్మ అనన్తకళ్యాణగుణాకరుడని సిద్ధించినది.

తృతీయాధ్యాయ ద్వితీయపాదము సమాప్తము

---

## తృతీయాధ్యాయ తృతీయపాదము
## గుణోపసంహారపాదము
### 83 సర్వవేదాంత ప్రత్యయాధికరణము 1

ఫలకర్మాదులు సమానములైనపుడు ఆ ఉపాసనలు భిన్నములు కావు.

355 సూ॥ సర్వవేదాంతప్రత్యయం చోదనాద్యవిశేషాత్

3-3-1

అర్థ : చోదనా + ఆది + అవిశేషాత్ = విధించుట మొదలగు విషయములయందు (భేదము) లేనందువలన, సర్వవేదాన్తప్రత్యయం = అన్ని ఉపనిషత్తులయందును విధింపబడిన దహరాది-ఉపాసనములు భిన్నములు కావు.

వివ : ఉపనిషత్తులయందు అనేకవిధములైన ఉపాసనములు విధింపబడియున్నవి. వానిలో ముప్పదిరెండు ఉపాసనములు "ద్వాత్రింశద్బ్రహ్మవిద్యలుగ ప్రసిద్ధి నందియున్నవి. ఇట్టి వీనిలో కొన్ని ఉపాసనలు రెండుమూడు ఉపనిషత్తులయందు ఉపదేశింపబడినవి. ఉదాహరణమునకు దహరవిద్యనందును కఠోపనిషత్తునందును ఛాన్దోగ్యోపనిషత్తు ఉపదేశింపబడినది. ఈ రెండు దహరవిద్యలకును భేదము ఉండవలయును. లేనిచో వేరువేరుగ ఇవి ఎందుకు ఉపదేశింపబడినవి? అని

పూర్వపక్షము. ఇందుకు సమాధానము ఈ సూత్రము. "ఏకం వా సంయోగరూప చోదనాఖ్యావిశేషాత్." (పూర్వమీమాంసా సూ. 244) అను సూత్రము 1. ఫలము 2. కర్మస్వరూపము 3. విధివచనము 4. నామధేయము. ఇవి నాలుగు సమానములైనచో అట్టి కర్మ వేరువేరు ప్రకరణములయందు ఉపదేశింపబడినను ఒకేకర్మగ (అభిన్నముగ) పరిగణింపబడుచున్నది అని బోధించుచున్నది. ఈరీతిగనే దహరవిద్య, వైశ్వానరవిద్య మొదలైనవి రెండు మూడు ఉపనిషత్తులలో విధింపబడినను వాని చోదనా-స్వరూప-ఫల నామధేయములయందు భేదములేనందువలన వివిధోపనిషత్ప్రతిపాదితములైన ఆ దహరవిద్యలు ఆ వైశ్వానరవిద్యలు మొదలైనవి అభిన్నములు అని భావము. 1. "విద్యాత్", "ఉపాసీత" అనురీతిని చోదన (విధి) 2 దహర-వైశ్వానరాదిరూపమైన ఉపాస్యస్వరూపము 3 బ్రహ్మప్రాప్తిరూప ఫలము 4 "దహరవిద్య", "వైశ్వానరవిద్య" అనురీతిని నామధేయము ఇవి అంతట సమానములుగదా.

356 సూ॥ భేదాన్నేతిచే దేకస్యా మపి 3-3-2

అర్థ : భేదాత్ = ఉపదేశభేదమువలన అనగా వేర్వేరు ఉపనిషత్తులయందు ప్రత్యేకముగ ఉపదేశించుటవలన, న + ఇతిచేత్ = ఆ రెండు "దహరవిద్యలు" అభిన్నములు కావు అనుచో, ఏకస్యాం + అపి = ఆ రెండు విద్యలు ఒక్కటియే అయినను (శిష్యభేదమునుబట్టి) ఉపదేశభేదము ఉండవచ్చును.

వివ : ఆచార్యుడు ఒక ప్రకరణమునందు ఒకశిష్యునకు మరియొక ప్రకరణమునందు మరియొక శిష్యునకు ఒకే విధమైన బ్రహ్మవిద్యను ఉపదేశించవచ్చును. అంతమాత్రమున బోధనాదులలోభేదము లేనపుడు ఆ విద్యలను భిన్నములుగ తలంపరాదు.

35॥ సూ॥ స్వాధ్యాయస్య తథాత్వేహి సమాచారేఽధికారాచ్చ
సవవచ్చ తన్నియమః 3_3_3

అర్థ : స్వాధ్యాయస్య = (అథర్వవేదీయులకు చెప్పిన శిరోవ్రతము) అధ్యయమునకు (అంగము) తథాత్వే హి=ఆ శిరోవ్రతము సంస్కారమును కలిగించినపుడే కదా. తత్ + నియమః="శిరోవ్రతము చేసినవారికే ఈ విద్యను ఉపదేశికపవలయును అను ఆ నియమము సఫలమగును. సమాచారే = "సమాచారము" అను గ్రంథమున, అధికారాత్ + చ=శిరోవ్రతము సైతము వేదవ్రతము అని చెప్పుటవలనను, సవవత్ + చ=సప్తసూర్యాది సవహోమములవలెను (ఇవి ఆథర్వణికులకు మాత్రమే సంబంధించినవి) శిరోవ్రతము అథర్వవేదాధ్యయనాంగము అగుచున్నది.

వివ : అథర్వణవేదమునందు "తేషా మే వైతాం బ్రహ్మవిద్యాం వదేత శిరోవ్రతం విధివద్యైస్తు చీర్ణమ్" శిరోవ్రతమును యథావిధిగ అనుష్ఠించినవారికే ఈ బ్రహ్మవిద్యను ఉపదేశింపవలయును అని చెప్పబడియున్నందువలన అథర్వణికమైన ముండకోపనిషత్తునందు ఉపదేశింపబడిన "అక్షరవిద్య" అథర్వణికులకు మాత్రమే సంబంధించినది అగుచున్నది కావున వాజసనేయశాఖకు చెందిన గార్గిబ్రాహ్మణమునందు ఉపదేశింపబడియున్న "అక్షరవిద్య"ఆథర్వణికుల "అక్షరవిద్య" కంటె భిన్నమైనదని అంగీకరింపవలయునుగదా అని పూర్వపక్షము కాని ఇది సరికాదు. శిరోవ్రతము ఆథర్వణవేదాఽధ్యయనాంగమే కాని (అక్షర) విద్యోపాసనాఽంగము కాదు. "బ్రహ్మవిద్య" అనగా ఇచట వేదవిద్య అని యర్థము సమాచారము" అను గ్రంథమునందు "ఇదమపి వేదవ్రతేన వ్యాఖ్యాతం" అని వ్రతము వేదవ్రతముగా పేర్కొనబడినది. కావుననే "నైత దచీర్ణవ్రతోఽధీయీత" (ముండక 3-2-11)

ఈ వేదమును "శిరోవ్రతమును"అనుష్ఠింపనివారు అధ్యయనమొనర్ప రాదు అనిచెప్పబడినదిశిరోవ్రతాఽనుష్ఠానముచేతఅధర్వవేదాధ్యయనము నకు ఒక విశిష్టమైన సంస్కారమేర్పడును. కావున అధర్వవేదాధ్యేత తప్పక ఆ వ్రతమును అనుష్ఠింపవలయును. ఆధర్వణికులు సప్త సూర్యాది నవ-హోమములను ఏకాగ్నియందే చేయవలయును. త్రేతాగ్నులయందు చేయకూడదు అను నియమమువలె ఇదియు ఆధర్వణికులకే పరిమితము. ఈరీతిగ శిరోవ్రతము ఆధర్వణికులకు అధ్యయనాంగము అని సిద్ధించినది. కావున పై"అక్షరవిద్యలు" అభిన్నములు.

358 సూ॥ దర్శయతి చ 3-3-4

అర్థ : దర్శయతి చ = శ్రుతియు విద్యైక్యమును తెలుపుచున్నది.

వివ : ఛాందోగ్యము అపహతపాప్మత్వాది గుణాష్టకవిశిష్టుడైన పరమాత్మను దహరాకాశమునందు ఉపాసింపవలయును అని బోధించినది. చూడుడు. "తస్మిన్ యదంత స్తదన్వేష్టవ్యమ్" (ఛా- 8-1-1) ఈవిషయమునే తైత్తిరీయ నారాయణము సైతము "తస్మిన్ యదన్త స్తదుపాసితవ్యమ్" (తై. నా. 10-23) అనుచు ఉపదేశించినది. ఛాన్దోగ్య-తైత్తిరీయములయందు ఉపదేశింపబడిన "దహర విద్యలు"ఒక్కటేఅగుటచేతతైత్తిరీయమున అపహతపాప్మత్వాదిగుణాష్టక విశిష్టుడైన పరమాత్మనే ఉపాసింపవలయునని సిద్ధించుచున్నది. దీనినే గుణోపసంహారమని యందురు. విద్యైక్యమున్నపుడే ఇది సంభవము.

359 సూ॥ ఉపసంహారోఽర్థాఽభేదా విధిశేషవ త్సమానే చ 3-3-5

అర్థ + అభేదాత్ = ప్రయోజనము సమానమగుటవలన, ఉప సంహారః = (ఒక ఉపనిషత్తునందు చెప్పిన ఉపాసనకు సంబంధించిన విశేషములను, మరియొక్క ఉపనిషత్తునందు పేర్కొనబడు అదే ఉపాసనమునందును) ఉపసంహరించుకొనవలయును(చేర్చుకొనవలయును) సమానే చ =ఆ రెండు ఉపాసనములు సమానములైనపుడే (ఇది సంభవము). విధిశేషవత్ = ఉపాసనావిధికి శేషములుగా (అంగములుగ) విధింపబడిన గుణములవలె.

వివ : అపహతపాప్మత్వాది విశేషగుణములు ఉపాసనాంగములై ఆ ఉపాసనమును శక్తివంతమొనర్చుచున్నవిగదా. ఇట్టితరి అదే ఉపాసనము మరియొక ఉపనిషత్తున ఉపదేశింపబడినపుడు అచ్చట ఇట్టి కొన్ని గుణములను విధింపకున్నను పరిగ్రహింపవలయును. లేనిచో ఆ ఉపాసనము వీర్యవత్తరము కాజాలదుగదా. ఆ రెండు ఉపాసనములు ఫలనామధేయాదులచే సమానములైనపుడే ఈ గుణోపసంహారమును గావింపవలయును.

ఈ సూత్రము శంకరభాష్యమున ఉపసంహారాఽధికరణముగ పేర్కొనబడినది.

## 84 అన్యథాత్వాఽధికరణము 2

ఛాన్దోగ్య బృహదారణ్యకోపనిషత్తులయందు ఉపదేశింపబడిన ఉద్గీథోపాసనలు భిన్నములు.

360 సూ॥ అన్యథాత్వం శబ్దాదితిచేన్నాఽవిశేషాత్ 3-3-6

అర్థ : శబ్దాత్ = శ్రుతివలన, అన్యథాత్వం =(ఛాన్దోగ్య బృహదారణ్యకోపనిషత్తులయందు ఉపదేశింపబడిన "ఉద్గీథ" విద్యలకు) భిన్న

శ్యము (సిద్ధించుచున్నది). ఇతిచేత్ = అనుచో, న = అట్లుకాదు. అవి శేషాత్ = (ఉపక్రమమున) విశేషము (భేదము) లేనందువలన (అవి అభిన్నములు).

వివ : ఛాందోగ్యమునందును బృహదారణ్యకమునందును ఉద్గీథ విద్య ప్రస్తుతింపబడియున్నది. "తద్ధ దేవా ఉద్గీథ మాజహ్రుః, అనేనైనా నభిభవిష్యామః" (ఛా. 1-2-1) "దేవతలు ఆ ఉద్గీథమును సంపాదించిరి. దీనిచే ఈ అసురులను జయింతుము గాత యని" అనుచు ఛాన్దోగ్యము అసురులను జయించుటకై దేవతలు ఉద్గీథమును ఉపాసించినట్లు తెలుపుచున్నది. ఇట్లే బృహదారణ్యకము సైతము "హన్తాఽసురాన్ యజ్ఞ ఉద్గీథేనాఽత్యయామ" (బృ.3.3.1) "యజ్ఞమున ఉద్గీథముతో అసురులను జయింతము అని దేవతలు తలంచిరి" అనుచు అసుర విజయమునకై దేవతలు ఉద్గీథమును ఉపాసించినట్లు తెలుపుచున్నది. అసురవిజయరూపఫలము ఉద్గీథము అను నామధేయము మొదలైనవి సమానములగుటచే ఈ రెండు ఉద్గీథోపాసనములు అభిన్నములు" అని పూర్వపక్షము. కాని స్వరూపభేదము ఉండుటచే ఇవి భిన్నములు అని సిద్ధాంతము. ఎట్లన ఛాన్దోగ్యమున "ఓమ్ త్యే దక్షర ముద్గీథ ముపాసీత" (ఛా.1-1-1) "ఓమ్" అను ఈ ఉద్గీథాఽక్షరమును ఉపాసింపవలయును" అని ప్రారంభించి "అథ హ య ఏవాఽయం ముఖ్యః ప్రాణ స ముద్గీథ ముపాసాంచక్రిరే" (ఛా.1 2.7) ఏ ఈ ముఖ్యప్రాణము గలదో ఆ ముఖ్యప్రాణముగ భావించి ఉద్గీథమును ఉపాసించిరి" అని ఉద్గీథాఽవయవమైన "ఓమ్" అను అక్షరమును ప్రాణదృష్టితో ఉపాసించినట్లు తెలుపబడినది. కాని బృహదారణ్యకమున "అథ హేమ మాసన్యం ప్రాణ మూచుః త్వం న ఉద్గాయేతి తథేతి తేభ్య ఏషప్రాణ

ఉదగాయత్" (బృ- 3-3-7) "పిమ్మట దేవతలు మాకు ఉద్గీథమును గానము చేయుము" అని ముఖ్యప్రాణమును కోరగా వారికై ముఖ్య ప్రాణము ఉద్గీథమును గానమొనర్చినది" అనుటచే ఉద్గీథమును గానము చేయువానిని (ఉద్గాతను) ప్రాణదృష్టితో ఉపాసించినట్లు తెలుపబడినది. ఇచట ప్రాణము ఉద్గీథమును గానమొనర్చినది"అనగా ఉద్గీథమును గానమొనర్చు వానిని ముఖ్యప్రాణముగ భావించవలయు నని భావము. కావున ఛాందోగ్యము ఉద్గీథావయవము ఉపాసింప బడునది అయిన ప్రణవాక్షరమున (ఓమ్) ప్రాణదృష్టిని విధింపగా బృహదారణ్యకము ఉద్గీథమును సమగ్రముగ గానము చేయు ఉద్గాతయందు ప్రాణదృష్టిని విధించుచున్నది. ఇట్లు ఈ రెండింటియందును ఉపాస్యస్వరూపభేదము ఉండుటచే ఈ ఉద్గీథోపాసనములు రెండును భిన్నములు అగుచున్నవి అని సిద్ధాంతము.

"ఉద్గీథేనాఽత్యయామ", (బృ. 3-3-1) "ఉద్గీథ మాజహ్రు రనేనైనా నభిహనిష్యామః" (ఛా. 1-2-1) అను పైరెండు ఉపనిషత్తులు ఉద్గీథమునే ఉపాస్యముగ ఉపక్రమమునందు ప్రస్తుతించుటచేతను ఉభయత్ర ఉపాసనాఫలము అసురులను జయించుటయే యగుట చేతను, "ప్రాణ ఉదగాయత్" అను బృహదారణ్యవాక్యమునందు ఉద్గానకర్తగా పేర్కొనబడిన ప్రాణము ఉపక్రమవిరోధము లేకుండుటకై ఉద్గానకర్మమైన "ఉద్గీథమే" అగుచున్నది. ఉద్గాతకర్మను ఉద్గాతగా పేర్కొనుట ఔపచారికము. కావున పైరెండు ఉద్గీథోపాసనములు అభిన్నములు అను పూర్వపక్షమును ఈ సూత్రము ప్రతిపాదించుచున్నది

361 సూ॥ నవా ప్రకరణభేదాత్పరోవరీయస్త్వాదివత్ 3.3.7

అర్థ : ప్రకరణాభేదాత్ = ఉపక్రమభేదమునుబట్టి, నవా = పై

రెండు ఉద్గీథోపాసనములకు ఐక్యములేదు. పరోవరీయ స్త్వ + అదివత్— పరోవరీయస్త్వము మున్నగు గుణములుగల ఉద్గీథోపాసనమునకువలె:

వివ : ఛాందోగ్యమున ఉద్గీథావయవమైన ప్రణవమును ప్రాణ దృష్టితో ఉపాసింపుమని తెలుపబడినది. బృహదారణ్యకమున ఉద్గీతను ప్రాణదృష్టితో ఉపాసింపుమని తెలువబడినది. ఇట్టి వుపక్రమభేదముమబట్టి ఈ రెండు వుపాసనములు భిన్నములేగాని అభిన్నములు కాజాలవు. ఒకే వుపనిషత్తున పఠింపబడిన ఉపాసనలయందైనను ఇటి పరిస్థితి తటస్థించి నచో భేదము తప్పదు. చూడుడు ఛాందోగ్యపనిషత్తునందు ప్రథమా ధ్యాయమున కొన్ని ఉద్గీథోపాసనములు పేర్కొనబడినవి. వానిలో "అథ య ఏషోఽంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్య శ్మశ్రుర్హిరణ్యకేశ కేశ ఆ ప్రణఖాత్సర్వ ఏవ హిరణ్యః తస్య యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ, తస్యోదితి నామ, స ఏష సర్వేభ్యః వుదితః, వుదేతి హ వై సర్వేభ్యః పాప్మభ్యః య ఏవం వేదతస్యర్క్చ సామ చ గేష్ణౌ—తస్మాదుద్గీథః తస్మాత్త్వే వోద్గాతైతస్య హి గాతా" (ఛా. 1.6.08) "ఆదిత్యునియందు సువర్ణములైన శ్మశ్రువులు మీస ములు) కేశములు కలిగి నఖశిఖపర్యంతము సువర్ణమయుడైన ఏ హిరణ్మయపురుషుడు కలడో, అతనియొక్క నేత్రములు జలాశయము నందలి సద్యోవికసితములైన తామరపూలవంటివి. అతనికి "వుత్" అని పేరు. అతడు పాపములు అంటనివాడుకదా. అతనిని ఇట్లు తెలిసి వుపాసించువాడుమ పాపరహితుడగును. ఆ హిరణ్య పురుషునికి ఋక్కులు సామములు పక్షములు కావున అతడు "వుద్గీథము" అగు చున్నాడు. కావున వుద్గీథస్వరూపియైన అతనిని గానము చేయువాని "వుద్గాత" అనుచున్నారు. అనునెడ వుద్గీథమును పరమాత్మ దృష్టితో

ఉపాసింపుమని ఉపదేశింపబడినది. సందర్భమునుబట్టి ఇచట "ఉద్గీథము" అనగా ఉద్గీథావయవమైన ప్రణవము అని యర్థము. (ఉత్ = పరమాత్మను, గాతా = గానము చేయువాడు. కావున "ఉద్గాత")

ఆపైన "అస్య లోకస్య కా గతి రిత్యాకాశ ఇతి హోవాచ సర్వాణి హ వా ఇమాని భూతా న్యాకాశాదేవ సముత్పద్యంత ఆకాశం ప్రత్యస్తం యన్త్యాకాశో హ్యేవైభ్యో జ్యాయా నాకాశః పరాయణమ్-స ఏష పరో వరీయా నుద్గీథః స ఏషోఽనన్తః పరోవరీ యోహాస్య భవతి, పరో వరీయసో హ లోకాన్ జయతి య ఏత దేవం విద్వాన్ పరోవరీయా స ముద్గీథ ముపాస్తే" (ఛా. 1-9-1-2) "ఈ లోకమునకు గతి. (ఆశ్రయము) ఏది? ఆకాశము, సకలభూతములు ఆకాశమునుండియే జనించుచున్నవి, ఆకాశమునందే లయించుచున్నవి. ఆకాశము వీటికి అన్నింటికంటెను పెద్దది. ఆకాశమే వీటికి పరమగమ్యము. ఇదియే శ్రేష్ఠతమమైన (పరోవరీయాన్ = వరీయస్సా పరః) ఉద్గీథము అగుచున్నది. ఇది అంతము లేనిది. ఇట్లు తెలిసికొని పరోవరీయమగు(శ్రేష్ఠతమమగు) ఉద్గీథమును ఎవడు ఉపాసించునో, అతడు శ్రేష్ఠతమములైన లోకములను జయించి, పరమోత్కృష్టమైన జీవనమును కలిగి యుండును" అనుచు ఉద్గీథమును అట్టి పరమాత్మదృష్టితోనే ఉపాసింపుమని ఉపదేశించినది.

ఈ రెండు ఉపాసనలయందును "ఉద్గీథము"ను పరమాత్మదృష్టితో ఉపాసించుట అను అంశము సమానమే అయినను వీనికి ఐక్యములేదు. ఏలయన వీనిలో మొదటిఉపాసనమునందు హిరణ్మయశరీరకుడు, "ఉత్" అను నామధేయము కలవాడు పుండరీకాక్షుడునైన పరమాత్మనుగా భావించి ఉద్గీథమును ఉపాసింపవలయును. రెండవ

ఉపాసనమునందు జగత్కారణభూతుడు,పరోవరీయుడు అనన్తుడునైన పరమాత్మనుగ భావించి ఉద్గీథమును ఉపాసింపవలయును. కావున ఈ రెంటికిగల భేదము స్పష్టముకదా. ఇట్లే ప్రకృతమునను ఉద్గీథావయవమైన ప్రణవమును ప్రాణదృష్టితో ఉపాసింపుమని ఛాందోగ్యము తెలుపగా, బృహదారణ్యకము సమగ్రమగు ఉద్గీథమును గానము చేయు ఉద్గాతను ప్రాణదృష్టితో ఉపాసింపుమని బోధించుచున్నది. ఈ రీతిని ఇవి పరస్పరము భిన్నములే అగుచున్నవి అని సిద్ధాంతము.

362 సూ॥ సంజ్ఞాతశ్చేకదుక్తమస్తి తు తదపి 3-3-8

అర్థ : సంజ్ఞాతః = "ఉద్గీథవిద్య" అను సంజ్ఞనుబట్టి, తత్ = ఆ రెండు ఉపాసనలకు ఐక్యము, ఉక్తం చేత్= చెప్పబడుచో, తత్+అపి = అట్టి సంజ్ఞైక్యము (ఒకే నామధేయము కలిగియుండుట) అస్తి తు = భిన్న కర్మములకు, భిన్నోపాసనలకును గలదు.

వివ : "ఉద్గీథవిద్య" అను నామసామ్యమునుబట్టి పై రెండు ఉద్గీథోపాసనములు అభిన్నములని తలంపరాదు. ఇట్టి నామసామ్యము (సంజ్ఞైక్యము) భిన్న కర్మలయందును భిన్నోపాసనములయందును చూపట్టుచున్నది. చూడుడు.

"అగ్నిహోత్రము" అను సంజ్ఞ నిత్యాగ్నిహోత్రమునకును అయనాగ్నిహోత్రమునకును గలదు. అంతమాత్రమున అవి రెండును ఒక్కటే అనుట తగదుగదా. ఇట్లే ఛాందోగ్యమునందే "ఉద్గీథము"అను సంజ్ఞతో అనేకోపాసనములు ఉపదేశింపబడియున్నవి. కాని ఇవి పరస్పరము భిన్నములేగదా. కావున ఉద్గీథవిద్య" అను "సంజ్ఞైక్యము" విద్యైక్యమునకును సాధకము కాదు.

363 సూ॥ వ్యాప్తేశ్చ సమంజసమ్. 3-3-9

అర్థ : వ్యాప్తేః + చ=వ్యాప్తినిబట్టియు, సమంజసమ్=(ఉద్గీథావయవమైన ప్రణవమే ఉపాస్యము అనుట) సమీచీనము.

వివ : ఛాందోగ్యమున ప్రారంభమునుండి అనేకస్థలములలో ఉద్గీథావయమైన ఉపాస్యముగ ఉపదేశింపబడినది. కావున మధ్య వచ్చిన "ఉద్గీథ ముపాసాంచక్రిరే" (ఛా. 1-2-7) అను వాక్యము నందలి ఉద్గీథ శబ్దమునకును ఉద్గీథావయమైన ప్రణవమనియే అర్థము వస్త్రముయొక్క కొన తగులబడుచున్నను వస్త్రము తగులబడుచున్నది. అని వస్త్రావయమును "వస్త్రము" అను శబ్దముచే పేర్కొనునట్లు ఉదీథావయవమును ఉదీథశబ్దముచే పేర్కొనుటయు సమంజసమే యగుచున్నది. ఇట్లు ఛాందోగ్యము ఉద్గీథావయవమును ఉపాస్యముగ ఉపదేశింపగా బృహదారణ్యకము సమగ్రోదీథ గానమొనర్చు ఉద్గాతమును ఉపాస్యముగ ఉపదేశించుచున్నది. కావున ఇవి రెండును భిన్నములు, ఈ సూత్రము శంకరభాష్యమున వ్యాప్త్యధికరణముగ వ్యాఖ్యాతమైనది.

## 85 సర్వాऽభేదాऽధికరణము 3

### వివిధోపనిషత్తులలో ఉపదేశింపబడిన ప్రాణోపాసనములు అభిన్నములు.

364 సూ॥ సర్వాऽభేదా దన్యత్రేమే 3-3-10

అర్థ : ఇమే = ఈ వసిష్ఠత్వాది గుణములు, అన్యత్ర = కౌషీతక్యుపనిషత్తున ఉపదేశింపబడిన ప్రాణవిద్యయందును ఉపాస్యములు సర్వ + అభేదాత్ = ప్రాణగతములైనజ్యేష్ఠత్వశ్రేష్ఠత్వాదులు అన్నియు అభిన్నములగుటవలన.

వివ : ప్రాణోపాసనము ఛాందోగ్యము బృహదారణ్యకము కౌషీతకి అను మూడు ఉపనిషత్తులయందు ప్రతిపాదింపబడినది. ఛాందోగ్య బృహదారణ్యకోపనిషత్తులయందు ప్రతిపాదింపబడిన ప్రాణోపాసనములలో భేదముచూపట్టదు. కాని కౌషీతకియందలి ప్రాణోపాసనమున కొంచెము భేదము చూపట్టుచున్నది. ఎట్లన— "యోహ వై జ్యేష్ఠం చ శ్రేష్ఠం చ వేద, జ్యేష్ఠశ్చ వై శ్రేష్ఠశ్చ భవతి. ప్రాణోవావ జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ" (ఛా. 5-1-1) "ఎవడు జ్యేష్ఠము (వయస్సుచేత) శ్రేష్ఠము (గుణములచేత) అయినదానిని తెలిసికొనునో, అతడు జ్యేష్ఠుడు శ్రేష్ఠుడు నగుచున్నాడు. జ్యేష్ఠము శ్రేష్ఠము అయినది ప్రాణముకదా అనుచు ఛాందోగ్యమున ఉపదేశింపబడిన ప్రాణగత జ్యేష్ఠత్వ శ్రేష్ఠత్వములు తక్కిన రెండు ఉపనిషత్తులయందును ప్రతిపాదింపబడినవి. ఇట్లే వాక్ చక్షున్ శ్రోత మనస్సులకుగల వసిష్ఠత్వ ప్రతిష్ఠాత్వ సంపత్తి ఆయతనత్వములు అనుగుణములు ప్రాణాధీనములు కావుననే ప్రాణము జ్యేష్ఠము అనియు చెప్పబడినది. కాని వాగాదీంద్రియముల వసిష్ఠత్వాది గుణములు ప్రాణమునకు సంబంధించినవే ("అథ హైనం వాగువాచ, య దహం వసిష్ఠాస్మిత్వం తద్వసిష్ఠోఽసి" పిమ్మట ప్రాణమునుగూర్చి వాక్కు పలికినది. నాలోగల వసిష్ఠత్వములు నీలోనిదే) అని ఛాందోగ్య బృహదారణ్యకములయందు స్పష్టముగ ప్రతిపాదింపబడియుండగా కౌషతకియందు అట్లు ప్రతిపాదింపబడలేదు.. అయినను వాగాదుల వసిష్ఠత్వాది గుణములు ప్రాణాధీనములని చెప్పియుండుటచేత ప్రాణమే ఆ వసిష్ఠత్వాదిగుణములకు హేతువని కౌషీతకియు బోధించుచున్నదని గ్రహింపవలెను. కావున ఛాందోగ్య బృహదారణ్యకములయందువలె కౌషీతకియందును జ్యేష్ఠత్వ శ్రేష్ఠత్వ వసిష్ఠత్వాది గుణములు గల ప్రాణమే ఉపాస్యమగుచుండుటచేత ఈ మూడు ఉపనిషత్తులయందు ఉపదేశింపబడిన ప్రాణోపాసనములు అభిన్నములు.

## 86 ఆనందాద్యధికరణము 4

### అన్ని ఉపాసనలయందును ఆనందాదిగుణవిశిష్టమైన బ్రహ్మమునే ఉపాసింపవలయును.

365 సూ॥ ఆనందాదయః ప్రధానస్య 3-3-11

అర్థ : ప్రధానస్య =(అన్ని ఉపాసనలయందును ఉపాస్య మగుటచే) ప్రధానమైన బ్రహ్మముయొక్క, అభేదాత్ = అభేదమువలన ఆనంద + ఆదయః =ఆనందాది గుణములు అనుసంధింపబడవలయును.

వివ : అన్ని ఉపాసనలయందును ఉపాస్యతత్త్వముబ్రహ్మమే అగుచున్నది. కాని ఆయా ఉపాసనలయందు ఉపాసింపబడు బ్రహ్మము యొక్క రూపగుణాదులభేదమునుబట్టి ఆయా ఉపాసనలు భిన్నములు అగుచున్నవి. అయినను ఉపాసనలయందు కళ్యాణగుణాశ్రయమైన బ్రహ్మమే ఉపాస్యమగుటచేత బ్రహ్మస్వరూప నిరూపకములైన జ్ఞాన ఆనంద అమలత్వ అనంతత్వాది కళ్యాణగుణములతోకూడిన బ్రహ్మమునే ఉపాసింపవలయును. జ్ఞానానందాదిగుణములను ప్రత్యేకించి చెప కున్నను ఇవి బ్రహ్మస్వరూపనిరూపకగుణములగుటచే వీనిని ఉపేక్షించ రాదు. ఏతాదృశగుణవిశిష్టమైన బ్రహ్మమునే ఉపాసింపవలయునని భావము.

366 సూ॥ ప్రియశిరస్త్వా ద్యప్రాప్తి రుపచయాఽపచయౌ హి భేదే. 3-3-12

అర్థ : ప్రియశిరస్వ + ఆది + అప్రాప్తిః = ప్రియమును శిరముగ గలిగియుండుట ఈ మొదలైనవానికి ప్రాప్తియుండదు. భేదే = బ్రహ్మమునకు శిరః పక్షాది భేదమును కల్పించువక్షమున, ఉప చయ + అపచయౌ హి = వృద్ధిక్షయములు కలుగునుగదా.

వివ : బ్రహ్మస్వరూప నిరూపకములగు జ్ఞానానందాదిగుణము లను బ్రహ్మోపాసనలయందు అన్నింటియందును అనుసంధింపవల యును అని చెప్పినంతమాత్రమున తైత్తిరీయోపనిషత్ప్రతితములైన ప్రియశిరస్త్వాదిగుణములను సైతము అనుసంధింపవలయును అని తలంపరాదు. "తస్య ప్రియమేవ శిరః. మోదోదక్షిణః పక్షః. ప్రమోద ఉత్తరః. పక్షః. అనంద ఆత్మాబ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠాః" ఆఆనందమయ పురుషునికి ప్రియమేశిరస్సు, మోదమే దక్షిణపక్షముప్రమోదమే ఉత్తర పక్షము ఆనందముఆత్మ(మధ్యశరీరము)బ్రహ్మపుచ్ఛముప్రతిష్ఠ ఆధారం (తై. ఆనందవల్లి 5-2) (ఇష్టమైన వస్తువును చూచుటవలన కలుగు సుఖము ప్రియము. ఆ వస్తువును పొందుటవలన కలుగు సుఖము మోదము. దానిని అనుభవించుటవలన కలుగు సుఖము ప్రమోదము) అని చెప్పుట కేవల పురుష సాదృశ్య నిరూపణమునకు మాత్రమేగదా! వాస్తవమున ఈ ప్రియ శిరస్త్వాదులు బ్రహ్మస్వరూపగుణములుకావు. బ్రహ్మమునందు శిరఃపక్షాదిభేదమును అంగీకరించినచో బ్రహ్మము వృద్ధి క్షయములను పొందునది కావలసివచ్చును. ఇది "సత్యం, జ్ఞాన మన న్తం బ్రహ్మ" ఇత్యాది శ్రుతివిరుద్ధము. కావున ప్రియశిరస్త్వాదులను అనుసంధింప నవసరములేదు.

367 సూ॥ ఇతరే త్వర్థసామాన్యాత్ 3-3-13

అర్థ : ఇతరే తు = ఆనందాది గుణములన్ననో, అర్థసామా న్యాత్= ఉపాస్యమగు బ్రహ్మస్వరూపముతో సమానములగుటవలన (అనుసంధింపదగియున్నవి.)

వివ : ప్రియమోదాదులకంటె వేరైన ఆనందాది గుణములు

బ్రహ్మస్వరూప నిరూపకములగుటవలన బ్రహ్మముతోబాటు వానినికూడ అనుసంధింపవలయును. జ్ఞానానందాది గుణవిశిష్టమైన బ్రహ్మమును ఉపాసింపవలయునని భావము.

368 ఆధ్యానాయ ప్రయోజనాఽభావాత్ 3–3–14

అర్థ : ఆధ్యానాయ = (ప్రియశిరస్త్వాదులను ఉపదేశించుట) ఉపాసనా సౌకర్యముకొరకు, ప్రయోజన + అభావాత్ = అంతకు మించిన ప్రయోజనము లేనందువలన.

వివ : ప్రియశిరస్త్వాదులు బ్రహ్మస్వరూప గుణములు కానిచో వానిని ఉపదేశించుట ఎందులకు? అని శంకింపరాదు. ఉపాసనా సౌలభ్యమునకై అట్లు ఉపదేశింపబడినది దానికి అంతకు మించినప్రయోజనమేదియులేదు.

369 సూ॥ ఆత్మశబ్దాచ్చ 3-3-15

అర్థ : ఆత్మశబ్దాత్+చ="అన్యోఽన్తర ఆత్మాఽఽనన్దమయః" అను శ్రుతివాక్యమున "ఆత్మ" శబ్దమును ప్రయోగించుటవలనను (ప్రియశిరస్త్వాదులు బ్రహ్మస్వరూప ధర్మములుకావు.)

వివ : "అన్యోఽన్తర ఆత్మాఽఽనన్దమయః" (తై.ఆ. 2-5-21) అను శ్రుతివాక్యము ఆనన్దమయుని ఆత్మశబ్దముచే నిర్దేశించుచున్నది. శిరః పుచ్ఛపక్షాదులు ఉండవుకదా. కావున ప్రియశిరస్త్వాది కల్పనము ఉపాసనా సౌలభ్యముకొరకే అనితలంపవలయును.

370 సూ॥ ఆత్మగృహీతి రితరవ దుత్తరాత్ 3-3-16

అర్థ : ఇతరవత్ = "ఆత్మా వా ఇద ఏష ఏవాఽగ్ర ఆసీత్" (ఐతరేయ 1-1-1) అను వాక్యమునగల "ఆత్మ" శబ్దమువలెనే, ఆత్మగృహీతిః = (ఇచటి ఆత్మశబ్దమునకును) "పరమాత్మ" అను

అర్థమును గ్రహించుటయే (యుక్తము) ఉత్తరాత్ = తరువాతి వాక్యమువలన.

వివ : "అన్యోఽన్తర ఆత్మానన్దమయః (తై. ఆ. 2-5-2) అను వాక్యమునగల ఆత్మశబ్దము పరమాత్మవాచకము జీవవాచకము కాదు. "సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి" (తై.ఆ. 2-6-2) అను తరువాతి వాక్యమున ఆ ఆత్మశబ్దవాచ్యుడు తాను బహురూపములు నందవలయునని సంకల్పించినట్లు తెలుపబడినదికదా. ఇట్టి బహుభవన రూప సంకల్పము పరమాత్మయందే గాని జీవాత్మయందు ఉపపన్నము కాదు. "ఆత్మా వా ఇదమేక ఏవాఽగ్ర ఆసీత్" మున్నగు వాక్యముల యందు "ఆత్మ"శబ్దము పరమాత్మను బోధించుచున్నది గదా.

371 సూ॥ అన్వయాదితిచేత్స్యాదవధారణాత్ 3-3-17

అర్థ : అన్వయాత్ =(ఆత్మశబ్దము ప్రాణమయాదులతోను) అన్వయించుట, (పరమాత్మవాచకముకాజాలదు) ఇతిచేత్=అనుచో వలన అవధారణాత్ = "ఆత్మన ఆకాశస్సంభూతః" (తై ఆ. 2-1-2) అను వాక్యమున ప్రస్తుతమైన ఆత్మయే ప్రాణమయాదులయందును ఆత్మగా "ఆత్మ"శబ్దముచే నిర్ధారింపబడుటవలన, స్యాత్="అన్యోఽన్తర ఆత్మానందమయః" అను వాక్యమునగల "ఆత్మ"శబ్దము పరమాత్మవాచకము అను నిర్ణయము కలుగవచ్చును.

వివ : "ఆత్మన ఆకాశస్సంభూతః" (ఆత్మనుండి ఆకాశము పుట్టినది) అనువాక్యమునందు ప్రస్తావింపబడిన పరమాత్మయే, ప్రాణ మయాదులకు ఆత్మగా వర్ణింపబడినాడు. కావున "అన్యోఽంతర ఆత్మా నందమయః" అను వాక్యమునగల "ఆత్మ"శబ్దము పరమాత్మవాచకమే అగుటచే ప్రియశిరస్త్వాదులు ఆతనికి సంభవింపవు. జ్ఞానానందాదులు

పరమాత్మ స్వరూపనిరూపకధర్మములగుటచే వానిని అన్ని ఉపా సనలయందును భావింపవలయును. ప్రియశిరస్త్వాదులు అనాత్మ ధర్మములగుటచే వానిని భావింప నవసరములేదని సారాంశము.

శంకరభాష్యమునందు ఈ 16, 17 సూత్రములు ఆత్మగృహీ త్యధికరణముగ వ్యాఖ్యాతములు.

87 కార్యాఖ్యానా ధికరణము 5

ప్రాణోపాసనమున ఆచమనోదకము ప్రాణమునకు వస్త్రము అగుచున్నది.

372 సూ॥ కార్యాఖ్యానా దపూర్వమ్ 3-3-8

అర్థ : కార్య + ఆఖ్యానాత్ = కార్యమును చెప్పుటవలన॥ అనగా ఇదివరకు చెప్పని దానిని చెప్పుటయే శాస్త్రవరిపాటియగుట వలన, అపూర్వం = ఆచమనీయోదకములకు ముందు చెప్పబడని ప్రాణవసనత్వము విధింపబడుచున్నది.

వివ : "యోహ వై జ్యేష్ఠం చ శ్రేష్ఠం చ వేద" "ఎవడు జ్యేష్ఠము శ్రేష్ఠము అయిన ప్రాణమును ఉపాసించునో" అనుచు ప్రాణ విద్యను చెప్పి, ఆప్రాణమునకు ఉదకములు, వస్త్రములు (కిం మేవాసో భవిష్యతీతి, ప్రాణ ఇతిహోచుః) అని తెలిపి "తస్మా దేవంవిత్ అశిష్య న్నాచమేత్ అశిత్వాచమేత్" కావున ఈ విషయము నెరిగినవాడే భోజనమునకు ముందు భోజనమునకు పిదప ఆచమనము గావింప గావింపవలయును అనియు, "ఏతమేవ తదచ్చ మనగ్నం కురుతే" ఇట్టి ఆచమనము ఆ ప్రాణమును నగ్నము కాకుండునట్లు చేయును. అనగా ఆ ప్రాణమునకు వస్త్రము (రక్షకము) అగును అనియు చెప్ప

బడియున్నది. ఇచట విధింపబడిన ఈ అచమనము ప్రతి కార్యమునకు ప్రారంభమున చేయబడుస్మృతి విహితమైన అచమనమా? లేక ప్రాణమునకు అనగ్నత్వమును (అదుష్టత్వమును) కలిగించుటకుగా వాసోరూపమున ప్రత్యేకముగా విధింపబడుచున్న అచమనమా? అను సందేహమునకు ఈ సూత్రము సమాధానము. "అప్రాప్తే హి శాస్త్ర మర్థవత్" అను న్యాయానుసారముగ స్మృతివిహితమైన అచమనమును మరల ఇచట విధింపనవసరము లేనందువలన స్మృతిప్రాప్తమైన ఆ అచమనమునకు శాస్త్రాంతరప్రాప్తము కాని ప్రాణవాసస్త్వము ఇచట విధింపబడుచున్నదని సిద్ధాన్తము.

88 సమానాఽధికరణము 6

అగ్నిరహస్యమునందును, బృహదారణ్యకము నందును పేర్కొనబడిన శాండిల్యవిద్యలు అభిన్నములు

373 సూ॥ సమాన ఏవం చాఽభేదాత్ 3-3-19

అర్థ : సమానే = (మనోమయత్వాది గుణములు) సమానము లగునపుడు, ఏవం = (అగ్నిరహస్య బృహదారణ్యకోపనిషత్తులయందలి శాండిల్యవిద్యలకు) ఇట్లు ఏకత్వము సిద్ధించుచున్నది. అభేదాత్ + చ = వశిత్వాదులకు సత్యసంకల్పత్వాదులతోగల అభేదమునుబట్టియు (ఇది సంభవమే.)

వివ : "స ఆత్మాన ముపాసీత మనోమయం ప్రాణశరీరం భారూపం. సత్యసంకల్పం ఆకాశాత్మానం" (అగ్నిరహస్య) మనోమయము,ప్రాణశరీరము, ప్రకాశస్వరూపము,సత్యసంకల్పము, సర్వవ్యాపకము అయిన పరబ్రహ్మమును ఉపాసింపవలయును. "మనో

మయోఽయం పురుషో భా స్సత్యం తస్మిన్నంతర్హృదయే యథా వ్రీహిర్వా య వోవా స ఏష సర్వస్య వశీ సర్వస్యేశానః సర్వ స్యా ధిపతిః సర్వ మిదం ప్రశాస్తి" (బృ. 7-6-1) ఉపాసకునియొక్క హృదయమునందు మనోమయుడైన పురుషుడు కాంతిమయుఁడు, సత్య స్వరూపుడునై వరి గోధుమల గింజవలె భాసించుచున్నాడు. ఇతడు సర్వమును తన వశమున నుంచుకొనియున్నాడు. సర్వమునకు శాసకుడు. సర్వమునకు అధిపతి. సర్వమునకు ఈశ్వరుడు. ఇతనిని ఉపాసింపవలయును. పైరెండు ఉపనిషత్తులయందును చెప్పబడిన ఈరెండు ఉపాసలకును "శాండిల్యవిద్య" అని ఒకే నామముగలదు. ఈ రెంటియందును ఉపాసింపదగిన మనోమయత్వాది గుణములును సమానములే. కావున పైరెండు శాణ్డిల్యవిద్యలు అభిన్నములు. బృహ దారణ్యక శాండిల్య విద్యయందు చూపట్టు వశిత్వాది గుణములును సత్యసంకల్పత్వముయొక్క అవాంతరభేదములేగదా.

## 89 సంబన్ధాఽధికరణము 7
## బృహదారణ్యకమున గల ఆదిత్యవిద్య – అక్షివిద్యలు భిన్నములు.

**374 సూ॥** సంబన్ధా దేవ మన్యత్రాఽపి **3_3_20**

**అర్థ :** ఏవం = ఈ శాండిల్యవిద్యయందువలె, **అన్యత్ర +** **అపి**=మరియొక విద్య (సత్యవిద్య)యందును సంబన్ధాత్ = సత్యబ్రహ్మ సంబన్ధమునుబట్టి (విద్యైక్యమును భావింపవలయును.)

**వివ :** బృహదారణ్యకమున "య ఏష ఏతస్మిన్ మండలే పురుషః యశ్చాఽయం దక్షిణేఽక్షిన్" (బృ. 7.5.1) "ఏ పరమ పురు షుడు సూర్యమండలమునందును, ఉపాసకుని కుడికంటియందును

ఉన్నాడో ఆ సత్యబ్రహ్మము నుపాసింపుము అని ప్రారంభించి "తస్యో పనిషత్ అహ మిత్యధ్యాత్మం" (బృ. 7-5-3) ఆదిత్యమండలమున నుపాసింపబడు పురుషునకు "అహః" అని రహస్యనామము. ఆనామముతో అతనిని ఉపాసింపవలయును. ఇది అధిదైవతము అనియు "తస్యో పనిషత్ అహ మిత్యధ్యాత్మం" దక్షిణనేత్రమున ఉపాసింపబడు పురుషునకు "అహం" అని రహస్యనామము. ఆ నామముతో అతనిని ఉపాసింపవలయును. ఇది అధ్యాత్మము అనియు వివరింపబడినది. ఈ రెంటియందును సత్యబ్రహ్మమే ఉపాసనా విషయమగుటవలన ఇవి అభిన్నములు. "అహః", "అహం" అనుపదములకు పాపములను హరించునది అనియే అర్థము గాన ఈ నామధేయము విద్యైక్యమునకు ప్రతిబన్ధకము కాదు అని పూర్వపక్షము.

375 సూ॥ న వా విశేషాత్ 3-3-21

అర్థ : విశేషాత్ = స్థానమునుబట్టి, న వా = సత్యవిద్యలు రెండును అభిన్నములు కాజాలవు.

వివ : మొదటి ఉపాసనమున ఆదిత్యునియందు సత్యబ్రహ్మను "అహః" అని ఉపాసింపవలయును. రెండవదానియందు ఉపాసకుని దక్షిణనేత్రమున "అహం" అని ఆ సత్యబ్రహ్మము ఉపాసింపవలయును ఇట్లు స్థానములభేదమునుబట్టి ఈ రెండు సత్యవిద్యలు భిన్నములు. కావున "అహః", "అహం" అను నామములు అవియుతములు అనియు అనరాదు. ఆదిత్యునియందు "అహః" అనియే ఉపాసింపవలయును. అక్షియందు "అహం" అనియే ఉపాసింపవలయును అని సిద్ధాంతము.

376 సూ॥ దర్శయతి చ 3-3-22

అర్థ : దర్శయతి చ = ఈ విషయమును శ్రుతియు చెప్పు చున్నది.

వివ : "తస్యైతస్య తదేవరూపం యదముష్యరూపం" ఆదిత్యపురుషునియొక్క హిరణ్యకేశ ఈ ఆదిత్యపురుషుని రూపమే అక్షి పురుషుని రూపము అనుచు శ్రుతిత్వాదిరూపమునే అక్షిపురుషునియందు అతిదేశించి చెప్పుచున్నది. ప్రకృతిసత్యవిద్యలు రెండును భిన్నములు అగుటవలననేగదా ఇట్లు చెప్పవలసి వచ్చినది. కావున ఈసత్యవిద్యలు భిన్నములు.

## 90 సంభృత్యధికరణము 8

### వ్యాప్తిమత్త్వాది గుణములు అన్ని ఉపాసనలయందును అన్వయింపవు.

377 సూ॥ సంభృతి ద్యువ్యాప్త్యపి చాఽతః 3-3-23

అర్థ : సంభృతి ద్యువ్యాప్తి + అపిచ = శ్రేష్ఠగుణ పరిపూర్ణత సర్వత్ర వ్యాప్తి ఈమొదలైన గుణములును, అతః = స్థానవిశేషమును (ఆయా స్థానములయందు మాత్రమే ఉపాసింపదగినవి.)

వివ : "బ్రహ్మజ్యేష్ఠా వీర్యాసంభృతాని. బ్రహ్మాఽగ్రే జ్యేష్ఠం దివ మాతతాన" (సామవేద ఖిలమంత్రము) బ్రహ్మమునందు శ్రేష్ఠము లైన వీర్యాదిగుణములు నిండియున్నవి. సర్వోత్కృష్టమైన ఆ బ్రహ్మము ద్యులోకమును ఆక్రమించినది అని చెప్పబడిన గుణసంభృతి, ద్యువ్యాప్తి అనుగుణములను అన్నిఉపాసనలయందుమభావింపః వచ్చునుగదాః అని సందేహము. కాని అట్లు భావింపరాదు. హృదయాది అల్పస్థానములయందు ద్యువ్యాప్తిని ఎట్లు భావింపగలము ఇట్లే వీర్యాది గుణసంభృతిని కూడా అంతట భావింపలేము. కావున

ఈ గుణములు ఆయా ఉపాసనలయందు మాత్రమే భావింపదగి యున్నవి.

### 91 పురుష విద్యాధికరణము 9

### తైత్తిరీయ ఛాన్దోగ్యములయందు గల పురుషవిద్యలు భిన్నములు.

378 సూ॥ పురుషవిద్యాయా మపి చేతరేషా మనామ్నానాత్
3-3-24

అర్థ : పురుషవిద్యాయాం + అపి చ = ఛాన్దోగ్య తైత్తిరీయ కములయందు చెప్పబడిన పురుషవిద్య (ల) యందును (విద్యాభేదము గలదు). ఇతరేషాం = ఒకరి శాఖలో చెప్పబడిన విశేషములు మరి యొకరిశాఖలో, అనామ్నానాత్ = చెప్పబడకపోవుటవలన.

వివ : "తస్యైవం విదుషో యజ్ఞస్యాత్మా యజమాన శ్రద్ధా పత్నీ శరీరం" (తై. నా. 6-5-2) ఇట్లు తెలిసికొనిన ఉపాసకుని ఆత్మ యజమానుడు, శ్రద్ధ (ఆస్తిక్యబుద్ధి) పత్ని. శరీరము ఇధ్మము అని రూపకల్పనచేయబడినది. తైత్తిరీయకమున, ఛాన్దోగ్యమునందున్నవో "పురుషోవావ యజ్ఞః తస్య యాని చతుర్వింశతి వర్షాణి"(ఛా.3-16-1) "పురుషుడే యజ్ఞము. మూడు విభాగములుగల అతని ఆయుర్దాయము ప్రాతర్మధ్యం దిన సాయంసవనములు" అని మరియొకరీతిని రూప కల్పన చేయబడినది. ఇట్లే తైత్తిరీయపురుషవిద్యకు బ్రహ్మప్రాప్తి ఫలముకాగా ఛాన్దోగ్య పురుషవిద్యకు శతషవర్షజీవనము ఫలముగా చెప్పబడినది. కావున "పురుషవిద్య' అను నామైక్యమున్నను స్వరూప భేద ఫలభేదములనుబట్టి ఇవి భిన్నములు.

"పురుష విద్యాయా మివ" అని శాంకరపాఠము.

92 వేధాద్యధికరణమ్ 10

శాంతిపాఠమంత్రములు ఉపాసనాఽంగములు కావు.

379 సూ॥ వేధాద్యర్థభేదాత్ 3-3-25

అర్థ : వేధ + ఆది + అర్థభేదాత్ = శత్రుహృదయ వేధాది అర్థ భేదమునుబట్టి ("శుక్రం ప్రవిధ్య" ఇత్యాది మంత్రములు అభిచారిక కర్మలకు) అంగములగు రీతిని "శంనో మిత్రశ్శం వరుణః" ఇత్యాది శాంతిపాఠమంత్రములు అధ్యయనాఽంగములేగాని బ్రహ్మవిద్యాఽంగ ములు కావు.)

వివ : "శంనో మిత్రశ్శం వరుణః" (తై.శిక్షావల్లీ) "సహ నావవతు" (ఆనన్దవల్లీ) ఇత్యాది మంత్రములు బ్రహ్మవిద్యా సన్నిధిని పఠింపబడినను, బ్రహ్మవిద్యాఽంగములుకావు. "తేజస్వి నా వధీతమస్తు" "మన అధ్యయనము తేజోవంతమగుగాక" అని తెలుపుటచే అవి అధ్యయనాఽంగములు. అర్థసామర్థ్యమునుబట్టిగదా "శుక్రం ప్రవిధ్య" ఇత్యాది మంత్రములు అభిచారికకర్మాంగములని నిరూపించుచున్నాము.

93 హాన్యధికరణమ్ 11

బ్రహ్మవేత్త పరిత్యజించిన పుణ్యపాపములు వాని మిత్రులను శత్రువులను చేరును.

380 సూ॥ హానౌ తూపాయన శబ్దశేషత్వా త్కుశాచ్ఛన్దస్స్తు త్యుప గానవ త్తదుక్తమ్. 3-3-26

అర్థ : హానౌ తు = పుణ్యపాప విమోచనము చెప్పబడినపుడు (అన్యత్ర వాని ప్రవేశమునుకూడ గ్రహింపవలయును.) ఉపాయన

శబ్దశేషత్వాత్ = అన్యత్ర పుణ్యపాప ప్రవేశమును తెలుపునట్టి వాక్యము పుణ్యపాపవిమోచనమును తెలుపునట్టి వాక్యమునకు శేషముగుటవలన, కుశాః+ఛన్దః-స్తుతి + ఉపగానవత్ = కుశలవలె ఛన్దస్సువలె, స్తుతివలె గానమువలె (వాక్యాన్తర సాపేక్షము) తత్ = ఆ విషయము ఉక్తమ్= (పూర్వమీమాంసా శాస్త్రమునందు) చెప్పబడినది, హాని=పరిత్యాగము, ఉపాయనము = ప్రవేశము.

వివ : (1) "తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్య ముపైతి" (ముండక -1-3) "శరీరావసానసమయమున పరబ్రహ్మను పొందనున్న బ్రహ్మవేత్త తన పుణ్యపాపములను తొలగించుకొని నిర్దుష్టుడై, పరమాత్మతో పరమ సామ్యాపత్తిని పొందుచున్నాడు" అను వాక్యము కేవల పుణ్యపాప విమోచనమును తెలుపుచున్నది. (2) "తస్య పుత్రాః దాయ ముపయాన్తి. సుహృద సాధుకృత్యాం, ద్విషన్తః పాపకృత్యాం" "బ్రహ్మవేత్త పరబ్రహ్మమును ప్రాప్తించు సమయమున, అతని పుత్రులు అతని సంపదను పొందుదురు స్నేహితులు అతని పుణ్యమును. శత్రువులు అతని పాపమును పొందుదురు అనువాక్యము బ్రహ్మవేత్తయొక్క పుణ్యపాపములు ఎచట ప్రవేశించునది తెలుపుచున్నది. (3) తత్సుకృతీ దుష్కృతీ ధూనుతే తస్యప్రియాః జ్ఞాతయస్సు కృత ముపయన్తి. అప్రియా దుష్కృతం" బ్రహ్మవేత్త బ్రహ్మప్రాప్తి సమయమున తన సుకృత "దుష్కృతము లను వదిలించుకొనును. అతనికి ప్రియమైనవారు అతని సుకృతమును అతనికి అప్రియమైనవారు అతని దుష్కృతమును పొందుదురు" అను వాక్యము పుణ్యపాపవిమోచనమును, అవి చేరునట్టి స్థానమును తెలుపుచున్నది.

ఈ మూడు పక్షములలో ఏది పరిగ్రాహ్యము అను సందేహము నకు ఈసూత్రము సమాధానము. పుణ్యపాపవిమోచనమును మాత్రము చెప్పినను పుణ్యపాపములు మిత్రాఽమిత్రులను చేరును అని చెప్పినను "బ్రహ్మవేత్తచే పుణ్యపాపములు పరిత్యజింపబడి అతని మిత్రాఽమిత్రులను చేరును" అను అర్థమును గ్రహింపవలయును. పుణ్యపాపవిమోచనమును తెలుపునట్టి వాక్యమునకు "అవి అతని మిత్రాఽమిత్రులను చేరును" అని తెలుపునట్టి వాక్యము శేషము (వివరణము పూరణమును) గదా.

పైఉపనిషద్వాక్యములు భిన్నభిన్న స్థలములయందు పఠింపబడినవి గదా. అట్టివానికి శేషశేషిభావము ఎట్లు సంభవము? అని సందేహింపరాదు. అర్థసాపేక్షతనుబట్టి ఇది సంభవమే ఎట్లన ? కుశలు అనగా యజ్ఞపాత్రలు "వానస్పత్యాః కుశాః" (యజు. 6 కాం. ౦ ప్ర. 11 అను) "పువ్వులు లేకయే కాయలను కాయు వృక్షముల కొయ్యతో ఈ పాత్రలను తయారుచేయవలయును" అను వాక్యము కుశలను కొంత వివరించినది. "ఔదుంబర్యః కుశాః" "మేడిచెట్టు కొయ్యతో యజ్ఞపాత్రలు తయారు చేయవలయును" అనువాక్యము మరింత స్పష్టము ఈ అంశమును వివరించినది. కావున "వానస్పత్యాః కుశాః" "ఔదుంబర్యః కుశాః అనువాక్యముల శేషశేషిభావమును పురస్కరించుకొని; కుశయనగా మేడికొయ్యతో తయారుచేసిన యజ్ఞపాత్ర అని అర్థము సిద్ధించుచున్నది.

(2) ఇట్లే "దేవాఽసురాణాం ఛన్దోభిః", "దేవాఽసురుల ఛందస్సులతో" అను వాక్యమునకు "దేవఛన్దాంసి పూర్వం" దైవఛన్దస్సులను ముందు" అను వాక్యము వివరణమై శేషమగుచున్నది.

(3) ఇట్లే "హారిద్యేన షోడశినః స్తోత్రం ముపాకరోంతి అను వాక్యమునకు "సమయ విషితే షోడశినఃస్తోత్ర ముపాకరోతి" సూర్యుడు ఉదయించుచుండగా "షోడశి" అను సామమును గానము చేయవలయును అను వాక్యము శేషమై సమయమును బోధించుచున్నది.

(4) ఇట్లే "ఋత్విజః ఉపగాయన్తి" "ఋత్విక్కులు గానము చేయుదురు" అను వాక్యమును "నాఽధ్వర్యు రుపగాయేత్" "అధ్వర్యువు గానము చేయరాదు" అను వాక్యము సవరించుచు శేషమగుచున్నది.

కావున పుణ్యపాపవిమోచనమును, వాని మిత్రాఽమిత్ర ప్రాప్తిని ఉపాసకుడు ధ్యానింపవలయునని భావము. ఇట్టి సమన్వయమును "అపితు వాక్యశేషఃస్యాత్, అన్యాయ్యత్వా ద్వికల్పస్య" (పూ.మీం. సూ. 18-8) అను సూత్రము విశదీకరించుచున్నది.

94 సామ్పరాయాఽధికరణము 12

బ్రహ్మవేత్త పుణ్యపాపములను పరిత్యజించు సమయము

381 సూ॥ సామ్పరాయే కర్తవ్యాఽభావాత్తథాహ్యనే 3-3-27

అర్థ : సామ్పరాయే = ఉత్క్రమణ సమయముననే (పుణ్యపాప విమోచనమును ధ్యానింపవలయును.) కర్తవ్య + అభావాత్ = (బ్రహ్మవేత్త మరణాఽనన్తరము పుణ్యపాపములద్వారా) అనుభవింపవలసిన భోగములు లేనందువలన, అన్యే = ఇతర శాఖీయులు, తథాహి = అట్లేగదా చెప్పుచున్నారు.

వివ : "అశ్వ ఇవ రోమాణి విధూయ పాపం" (ఛా. 8-13-1) "గుఱ్ఱము జూలును విదలించు రీతిగా (పుణ్యపాపములను) విదలించు

కొని" అనువాక్యము ప్రాణోత్క్రమణ సమయముననే పుణ్యపాపములు తొలగునట్లు తెలుపుచున్నది "స ఆగచ్ఛతి విరజాం నదీం తత్సుకృత దుష్కృతా ధూనుతే" (కౌషీత 8-1-4) ఆ బ్రహ్మవేత్త విరజానది యొద్దకు వచ్చును. అచట పుణ్యపాపములను విదలించుకొనును" అను వాక్యము విరజానదీ తీరమున పుణ్యపాపములను తొలగించుకొనునట్లు తెలుపుచున్నది. ఈ రెండుపక్షములలో ఏది వాస్తవము? అను ప్రశ్నకు ఈ సూత్రము సమాధానము. దేహవియోగానన్తరము బ్రహ్మవేత్తకు అనుభవింపదగిన సుఖదుఃఖభోగములు లేనందువలన పుణ్యపాపములతో అవసరములేదు కావున ప్రాణోత్క్రమణ సమయముననే పుణ్యపాపములను అతడు తొలగించుకొనును. "తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే" (ఛా. 6-14-2) "బ్రహ్మవేత్త దేహవియోగమును పొందుటయే తడవుగా బ్రహ్మమును పొందును" అను వాక్యము స్పష్టముగ మొదటి పక్షమునే సమర్థించుచున్నదిగదా.

### 382 సూ॥ ఛన్దత ఉభయాఽవిరోధాత్ 3-3-28

అర్థ : ఉభయ + అవిరోధాత్ = "అశ్వ ఇవ రోమాణి విధూయ పాపం" అనువాక్యమునకును, "తస్య తావదేవ చిరం" అను వాక్యమునకును అవిరుద్ధముగ, ఛన్దతః = అభిమత అర్థక్రమాఽను సారము "సుకృత దుష్కృతేధూనుతే" అను కౌషితకీ వాక్యమును "ఏతం దేవయానం పంథానమాపద్యతే" (కౌషీత 1-3) అనువాక్యమునకు ముందే చేర్చి "సుకృత దుష్కృతములను తొలగించుకొని బ్రహ్మవేత్త అర్చిరాదిమార్గమున ప్రవేశించును" అని అర్థమును చెప్పికొనవలయును. పాఠక్రమముకంటే అర్థక్రమము బలీయమైనదికదా.

383 సూ॥ గతేరర్థవత్త్వ ముభయథాఽన్యథా హి విరోధః 3-3-29

అర్థ : గతేః = అర్చిరాదిగతికి, అర్థవత్త్వం = సార్థకత, ఉభయథా = రెండు విధములుగను అర్థమును చెప్పిననే సిద్ధించును. అన్యథా = అట్లుకానిచో, విరోధః + హి = విరోధము ఏర్పడునుగదా.

వివ : బ్రహ్మవేత్తకు ప్రాణోత్క్రమణసమయమున కొంత పుణ్యపాప క్షయము కలుగును. విరజానదీతీరమున తక్కిన పుణ్య పాపములు క్షయించును అని చెప్పుటయే యుక్తము. ప్రాణోత్క్రమణ సమయముననే పుణ్యపాపములు పూర్తిగా నశించినచో సూక్ష్మశరీర ముతో అర్చిరాది మార్గమున ప్రయాణించుటకు కావలసిన కర్మము ఉండదుగదా. కర్మశేషములేనిచో సూక్ష్మశరీరము ఎట్లేర్పడును? అని పూర్వపక్షము.

384 సూ॥ ఉపపన్న స్తల్లక్షణార్థోపలబ్ధే ర్లోకవత్ 3-3-30

అర్థ : ఉపపన్నః = ప్రాణోత్క్రమణ సమయముననే సర్వ కర్మములు క్షయించినను అర్చిరాదిగతి సంభవమే. తత్ + లక్షణ + అర్థ + ఉపలబ్ధేః = ముక్తునకు కర్మతో సంబన్ధములేని కామచారాదులు చూపట్టుచున్నందువలన లోకవత్ = లోకమునందువలె.

వివ : బ్రహ్మవేత్త ప్రాణోత్క్రమణ సమయముననే పూర్తిగ పుణ్యపాపములను తొలగించుకొనును. అతని అర్చిరాదిగతికి కర్మ శేషముతో అవసరములేదు. అతడు ముక్తుడైన పిదప కర్మనిరపేక్షము లైన కామచారాదులను అతనికి శ్రుతి చెప్పుచున్నదికదా. మరియు మహోదారుడైన రాజును ఆశ్రయించిన సామాన్య పురుషులను అనన్య సాధ్యములైన మహత్తర కార్యములను చేయగలుగుచుండుటను

లోకమున చూచుచున్నాము. ఇట్లే సత్యసంకల్పుడైన పరమపురుషుని ఆశ్రయించిన వారికి అకర్మవశ్యములైన దేహాదులుండుటలో ఆశ్చర్యమేమి?

385 సూ॥ యావ దధికారమవస్థితి రాధికారికాణామ్ 3-3-31

అర్థ : ఆధికారికాణాం = అధికార పురుషులైన వసిష్ఠాదులకు, యావత్ + అధికారం = వారి అధికారసమయము పూర్తి యగునంత వరకు, అవస్థితిః = సంసారమండలముననే ఉండుట సంభవించుచున్నది.

వివ : బ్రహ్మవేత్త శరీరావసాన సమయమున సంపూర్ణముగ కర్మక్షయమును పొంది, అర్చిరాది మార్గమున పరబ్రహ్మమును చేరును అనుపక్షమున వసిష్ఠాది బ్రహ్మవేత్తలును అట్లే పరబ్రహ్మమును చేరియుండవలయునుగదా. కాని వారు ఆ విధముగ బ్రహ్మమును చేరినట్లు తెలియుటలేదే? అనినచో వసిష్ఠాదులు బ్రహ్మచే సప్తర్షిత్వాదిఅధికారమున నియమింపబడినారు. కావున వారు ఆధికారికపురుషులు. వారి ఆ అధికారసమయము పూర్తియగునంతవరకును వారిని వారి కర్మము అనువర్తించుచుండును. ఇందుచే వారికి ప్రాణోత్క్రమణసమయమున పూర్తి కర్మక్షయము కలుగుటలేదు. కావున వారు దేహాంతరములను పొందుచున్నారు. ఇట్లే జ్ఞానులును ప్రారబ్ధ కర్మమును పూర్తిగ అనుభవించినగాని అది నశింపదని భావము.

95 అనియమాధికరణము 13

బ్రహ్మోపాసకులందరు అర్చిరాది గతిచిన్తనము గావింపవలయును.

386 సూ॥ అనియమ స్సర్వేషా మవిరోధ శ్శబ్దానుమానాభ్యామ్. 3-3-32

అర్థ : అనియమః=(అర్చిరాదిగతి బ్రహ్మవేత్తలలో కొందరికే అను) నియమములేదు. సర్వేషాం = బ్రహ్మవేత్తలకు అందరకు (అర్చిరాది గతికలదు.) శబ్ద+అనుమానాభ్యాం=శ్రుతిస్మృతిప్రమాణములతో, అవిరోధః=విరోధములేకుండుట (ఇట్లు చెప్పిననేసంభవము)

వివ : అర్చిరాదిగతి అన్ని బ్రహ్మవిద్యలయందును) వర్ణింపబడలేదు. "ఉపకోసలవిద్య"వంటి కొన్నింటియందు మాత్రమే వర్ణింపబడినది. ఇట్టియెడ అర్చిరాదిగతిచిన్తనము అది వర్ణింపబడిన ఉపకోసలాది విద్యానిష్ఠులకు మాత్రమే పరిమితముగదా! అనినచో అట్లుకాదు. బ్రహ్మోపాసకులందరు తప్పక అర్చిరాదిగతి చిన్తనము గావింపవలయును. "యే చేమేఽరణ్యే శ్రద్ధాం సత్య ముపాసతే, తేఽర్చిష మభిసంభవంతి" (ఛా. 5-10-1) అను శ్రుతివాక్యము పంచాఽగ్ని విద్యానిష్ఠులను (ప్రకృతి విలక్షణుడైన జీవుని బ్రహ్మాంతర్యామికునిగా ఉపాసించువారిని) శ్రద్ధాపూర్వకముగ సత్యవాచ్యబ్రహ్మము నుపాసించు సద్విద్యా దహరవిద్యానిష్ఠులకును అనువదించి "తేఽర్చిష మభిసంభవన్తి" వారు (అందరు) అర్చిరాదిమార్గమును ప్రవేశింతురు అని బ్రహ్మోపాసకులందరకు అర్చిరాదిగతిని బోధించుచున్నది.

శ్లో॥ అగ్నిర్జ్యోతి రహశ్శుక్ల షణ్మాసా ఉత్తరాయణమ్।
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః॥

(భగ. 13-24 శ్లో.)

అగ్ని, జ్యోతిస్సు, అహస్సు,శుక్లపక్షము, ఉత్తరాయణము, ఆరు మాసములు, ఇందు మరణించిన బ్రహ్మవేత్తలు బ్రహ్మమును పొందుదురు అని స్మృతియు అర్చిరాదిగతిని బ్రహ్మోపాసకులకు అందరకును

నిర్దేశించినది. కావున బ్రహ్మోపాసకులందరు అర్చిరాదిగతి చిన్తనమును గావింపవలయును.

## 96 అక్షరధ్యధికరణమ్ 14

అక్షర బ్రహ్మవిద్యయందు చెప్పబడిన అస్థూలత్వాదిగుణములు బ్రహ్మవిద్య లన్నింటియందును గ్రాహ్యములు.

387 సూ॥ అక్షరధియాం త్వవరోధ స్సామాన్య తద్భావాభ్యా మౌపసదవ త్తదుక్తమ్ 3-3-33

అర్థ : అక్షరధియాం = అక్షర బ్రహ్మకు సంబధించిన అస్థూలత్వాది గుణములకు ఔపసదవత్ = ఉపస ద్యాగాఙ్గ మంత్రములకు వలె, అవరోధః = (అన్ని బ్రహ్మవిద్యలయందును) పరిగ్రహముగలదు సామాన్యతద్భావాభ్యాం = బ్రహ్మోపాసనము అన్నింటియందును బ్రహ్మము సమానముగ ఉపాస్యమైనందునను, అట్టి ఆ బ్రహ్మమునందు అస్థూలత్వాది గుణములు అంతర్భూతములై ఉన్నందువలనను, తత్= ఆ విషయము, ఉక్తం=(పూర్వమీమాంసయందు) చెప్పబడినది.

వివ : "ఏతద్వైతదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదన్తి అస్థూల మనణు అహ్రస్వం" (బృ. 5-88) "ఓగార్గి! ఆ అక్షరబ్రహ్మమును బ్రాహ్మణులు స్థూలముకానిది, అణువుకానిది, హ్రస్వముకానిది అని వర్ణింతురు" అనియు, అథ పరా, యయా తదక్షర మధిగమ్యతే యత్త దద్రేశ్య మగ్రాహ్యం" (ముండక. 1-1-6) ఇక పరవిద్య ప్రస్తుత మగుచున్నది. జ్ఞానేంద్రియములచేత గాని కర్మేంద్రియములచేతగాని గ్రహింపశక్యము కాని ఆ అక్షరపరబ్రహ్మము. దేనిచే పొందబడుచున్నదో అనియు చెప్పబడిన అస్థూలత్వాది గుణములను అక్షరబ్రహ్మవిద్యా

విష్టులు మాత్రమే ఉపాసింపవలయునా? అన్ని బ్రహ్మోపాసనల యందును అస్థూలత్వాది గుణవిశిష్టముగ బ్రహ్మమును ఉపాసింప వలయునా? అను ప్రశ్నకు సమాధానము ఇది. ఆనన్దాదులవలె అస్థూలత్వాది గుణములు బ్రహ్మస్వరూప సంబద్ధము అగుటవలన అన్ని బ్రహ్మవిద్యలయందును ఈ గుణములను అనుసన్ధింపవలయును. అస్థూలత్వాది గుణములులేనిదే కేవలానన్దాదులు బ్రహ్మస్వరూపములు నిరూపింపజాలవు. అవి జీవాత్మపరమాత్మ సాధారణములుగదా. గుణిని అనుసరించి యుండుటయే గుణముల స్వభావము. "ఉపసత్తు" అను యాగము యజుర్వేదమున విధింపబడినది.

ఇందు "అగ్నిర్హోత్రం వేతు" అను సామ మంత్రమును యజు ర్వేది యజుర్వేదీయ ఉపాంశుస్వరముతోనే పఠించునుగాని సామ స్వరముతో పఠింపడు. ఇచట "ఉపసత్తు" ప్రధానము. సామమంత్రము దానికి గుణము. "గుణముఖ్య వ్యతిక్రమే తదర్థత్వాత్ ముఖ్యేన వేద సంయోగః" (పూ. మీమాంస 3-27-9) అనుసూత్రము ఈ అంశము లను వివరించుచున్నది. గుణము అనగా అంగము గుణి అనగా అంగి. వీనిని మీఱవలసి వచ్చునపుడు అంగమును వదలి అంగిని అనుసరించి కర్మానుష్ఠానము గావింప వలయునని భావము.

ఇట్లే అస్థూలత్వాది గుణములు బ్రహ్మస్వరూపానుబద్ధములగుట వలన బ్రహ్మోపాసనలన్నింటియందును ఆ గుణములను ఉపాసింప వలయును.

388 సూ॥ ఇయ దామననాత్ 3-3-34

అర్థ : ఇయత్ = అస్థూలత్వాది విశిష్టములైన ఆనన్దాది గుణ

ములను మాత్రమే అన్ని ఉపాసనలయందును భావింపవలయును ఆమననాత్ = (అభిముఖ్యేన మననాత్) ఇంతమాత్రముచే బ్రహ్మ స్వరూపానుసంధానము సిద్ధించుటవలన.

వివ : అస్థూలత్వాదిగుణములచే బ్రహ్మముయొక్క హేయ గుణరాహిత్యము బోధింపబడుచున్నది. కావున గుణములను తప్పక అను సంధింపవలయును. సర్వకర్మత్వ సర్వగన్ధత్వాది గుణములను ఆయా ఉపాసనలయందు మాత్రమే భావించిన చాలును. సత్యత్వ, జ్ఞానత్వ అనన్తత్వ, ఆనన్దత్వ, అమలత్వ, శ్రియఃపతిత్వములు పరస్వరూప నిరూ పకములు. సర్వకర్మత్వ సర్వగంధత్వాది గుణములు నిరూపితపర స్వరూప విశేషణములు అని గ్రహింపవలయును. శంకరభాష్యమున ఈసూత్రము ఇయదధికరణమున వ్యాఖ్యాతము.

97 అన్తరత్వాధికరణము 15

ఉషస్త కహోళుల ఆత్మవిషయక ప్రశ్నలు పరమాత్మ విషయకములే.

389 సూ॥ అన్తరా భూత గ్రామవ త్స్వాత్మనోఽన్యథా భేదా నుపపత్తి రితిచే న్నోపదేశవత్ 3-3-35

అర్థ : అన్తరా = "య ఆత్మా సర్వాన్తరః (బృ. 5-4-1) అను ఉషస్తుని ప్రశ్న, భూతగ్రామవత్ స్వ + ఆత్మనః = పంచభూత పరిణామమైన శరీరముగల జీవాత్మను ఉద్దేశించినదని తలంపవల యును అన్యథా = అట్లుకానిచో, ప్రతివచనభేద + అనుపపత్తిః + ఇతి చేత్ = సమాధానమునభేదము ఉండుట అనుపపన్నమగును అనినచో, న = అట్లుకాదు, ఉపదేశవత్ = సద్విద్యోపదేశమునందువలె (ఒకేప్రశ్నకు విభిన్న సమాధానములుండవచ్చును.)

వివ : ఉషస్తుడు (ఉషస్తి), కహోళుడు యాజ్ఞవల్క్యుని శిష్యులు. వారు"యస్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ, య ఆత్మా సర్వాంతరః తం మే వాచక్ష్వ" (బృ.5-4-1) "ఎవడు అపరోక్ష బ్రహ్మమో, ఎవడు సర్వాంతర్యామియో అతనినిగూర్చి నాకు వివరింపుము:" అని గురువు గారిని ప్రార్థించిరి. అపుడు యాజ్ఞవల్క్యుడు ఉషస్తునికి"ఏష త ఆత్మా సర్వాంతరః కతమో యాజ్ఞవల్క్య సర్వాంతరః యః ప్రాణేన ప్రాణితి సత ఆత్మా సర్వాంతరః యోఽపానేనాఽపానితి స త ఆత్మా" (బృ. 5-4-1) ఎవడు ప్రాణముతో జీవించుచున్నాడో, ఎవడు అపానముతో అపానమును విసర్జించుచున్నాడో అతడు నీకు ఆత్మ. అతడు అంతట ఉన్నాడు" అని ఉపదేశించినాడు. కహోళునికి "యోఽశనాయా పిపాసే శోకంమోహం జరాం మృత్యుమృత్యేతి ఏతం హ్యేవాత్మానం విదిత్వా" (బృ. 5-4-3) ఎవడు ఆకలి, దప్పిక, శోకము, మోహము జర, మృత్యువు వీటికి అతీతుడై యుండునో అట్టి ఈఆత్మను తెలిసికొనినచో ఈషణాత్రయ నిర్ముక్తుడగును) అని ఉపదేశించినాడు.

ఇచట ఉపస్త కహోళుల ప్రశ్నలు ఒకే విధముగ నున్నను యాజ్ఞవల్క్యుని సమాధానములు భిన్నములుగ నున్నందువలన ఉషస్తుడు జీవాత్మనుగురించి ప్రశ్నించెననియు, కహోళుడు పరమాత్మను గురించి ప్రశ్నించెననియు భావింపవలసియున్నది. ఉషస్తునకు ఇచ్చిన సమాధానమున "ప్రాణముతో ప్రాణించు ఆత్మ జీవాత్మయేగదా అని పూర్వపక్షము. ఉభయుల ప్రశ్న పరమాత్మను గూర్చియే- యాజ్ఞవల్క్యుని సమాధానములును పరమాత్మనుగూర్చియే"అని సిద్ధాంతము "యః ప్రాణేన ప్రాణితి" అనగా "ఎవడు ప్రాణవాయువుచే జీవింపచేయుచున్నాడో" అని అర్థము. జీవింపజేయుట పరమాత్మ కార్యమే

గదా. కావుననే "కో హ్యేవాఽన్యాత్కః ప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనన్దో న స్యాత్" (తై. ఆన. 7-1) అంతట వ్యాపించి ఆనందమయుడైయున్న ఈ పరమాత్మ లేనిచో ఎవడు జీవించును. అను శ్రుతి ఈ విషయమును స్పష్టముగ ప్రతిపాదించినది. మరి ఒకే ప్రశ్నకు రెండు విధముల సమాధానము లేల? అని శంకింప నవసరములేదు సద్విద్యోపదేశసందర్భమున శిష్యుడు "భూయ ఏవ మా భగవా న్విజ్ఞాప యతు" అని పలుమార్లు ప్రశ్నింపగా, ఆచార్యుడును పలురీతుల సమాధానమొసంగుచు సత్త్వమును విశదముగబోధించినాడుగదా. భిన్నరీతుల సమాధానము నిచ్చుట శిష్యబుద్ధి వైశద్యార్థమని గ్రహింపవలయును.

390 సూ॥ వ్యతీహారో విశింషన్తి హీతరవత్ 2-3-36

అర్థ : వ్యతీహారః=పరస్పర వినిమయము(కర్తవ్యము), ఇతరవత్ = సద్విద్యయందువలె, విశింషన్తి హి = (రెండువిధములైన సమాధానములయందలి విశేషణములను సర్వాంతర్యామియైన పరమాత్మనే) విశేషించుచున్నవి గదా.

వివ : యాజ్ఞవల్క్యుని సమాధానములయందు గల సర్వప్రాణనత్వ అశనాయా పిపాసాదిరహితత్వాది పరమాత్మ గుణములను ఉషస్త కహోళులు పరస్పరము సమన్వయించుకొని అనుసంధించుకొనవలయును. అన్ని విశేషణములును సద్విద్యయందువలె ఆ సర్వాన్తర్యామి పరమాత్మకే చెందినవిగదా. ఉషస్త కహోళవిద్యలయందు పరమాత్మను సర్వప్రాణనత్వ అశనాయాపిపాసాది రహితత్వాదిగుణములతోకూడిన వానినిగా ధ్యానింపవలయునని భావము. ఈసూత్రము శంకరభాష్యమున వ్యతీహారాధికరణముగ పేర్కొనబడినది.

391 సూ॥ సైవ హి సత్యాదయః 3-3-37

అర్థ : సా + ఏవ హి = అపరదేవతయేగదా (శ్వేతకేతుని ప్రశ్న యందు ప్రశ్న విషయము) సత్య + ఆదయః = (సమాధానముల యందలి) సత్యాదిగుణములును (ఆ పరదేవతకు చెందినవే గదా.)

వివ : ప్రశ్నభేదముగాని, సమాధానభేదముగాని, ప్రష్టృభేదము గాని విషయైక్యమును బాధింపజాలదు. ఉషస్త కహోళులు వేర్వేరుగ అడిగిన ప్రశ్నలకు ఆచార్యుడు ఇచ్చిన సమాధానములు వేర్వేరుగ నున్నను అవి పరమాత్మను ఉద్దేశించినవే. ఇట్లే శ్వేతకేతువు జగత్సృష్టి సంకల్పించిన సచ్ఛబ్దవాచ్యమైన ఆ పరదేవతనుగూర్చి పలుమార్లు ప్రశ్నించినను" ఐతదాత్మ్య మిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వ మసి" అని సమాధానము ఒకేవిధముగ ఈయబడినది గదా.

## 98 కామాద్యధికరణము 16

### ఛాన్దోగ్య బృహదారణ్యకములయందు ప్రస్తుతములైన దహరవిద్యలు అభిన్నములు

392 సూ॥ కామదీతరత్ర తత్ర చాయతనాధిభ్యః 3-3-38

అర్థ : ఇతరత్ర తత్రచ= ఛాన్దోగ్య బృహదారణ్యకములయందు ఉపదేశింపబడిన దహరవిద్యలయందు కామ + ఆది = సత్యకామత్వాది గుణములు, అపహతపాప్మత్వాదిగుణములును అనుసంధేయములు. ఆయతన+ఆదిభ్యః = హృదయస్థానాదిసామ్యమునుబట్టి.

వివ : "అథ యదిద మస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ, దహరోఽస్మిన్నన్తరఆకాశః తస్మిన్ య దంత స్తదన్వేష్టవ్యం" (ఛా. 8-1-1) ఈశరీరమునందు చిన్ని కమలమువంటి స్థానముగలదు. అందు అతిసూక్ష్మమైన ఆకాశముగలదు. దానియందు ఏదికలదో దానిని

అన్వేషించి తెలిసికొనవలయును." అని ఛాన్దోగ్యమునను "య ఏషో౽న్తర్హృదయ ఆకాశ తస్మిన్‌శేతే సర్వస్య వశీ సర్వస్యేశానః" (బృ. 6-4-2)ఎవడు హృదయమునందలి ఆకాశమునశయనించియున్నాడో, ఎవడు సర్వస్వమును తన వశమున నుంచికొనినవాడై సర్వమును నియమించుచున్నాడో" అని బృహదారణ్యకమునను దహరోపాసనము ప్రస్తుతమైనది. వీనిలో ఒకదానియందు పరమాత్మ "ఆకాశ"శబ్దముచే పేర్కొనబడగా, రెండవదానియందు ఆకాశమున శయనించినవాడుగా ప్రస్తుతింపబడినాడు. కావున ఈ రెండు దహరవిద్యలు భిన్నములని పూర్వపక్షము. భిన్నములని సిద్ధాన్తము. ఈరెండు ఉపాసనలయందు హృదయాయతనత్వ సత్యసంకల్పత్వ సత్యకామత్వఅపహతపాప్మత్వాది గుణవిశిష్టుడైన పరమాత్మయేగదా ఉపాసనవస్తువు. బృహదారణ్యకమున చెప్పబడిన వశిత్వాదులు సత్యసంకల్పత్వాది విశేషములేగానిభిన్నములు గావు. కావున ఈ దహరవిద్యలు అభిన్నములు. ఛాన్దోగ్యమున గల "ఆకాశ" శబ్దము పరమాత్మవాచకము. బృహదారణ్యకమున గల (ఆకాశ స్తస్మిన్‌శేతే) ఆకాశశబ్దము హృదయ పుండరీకాన్తర్వర్తియైన ఆకాశమునకు వాచకము. కావున విరోధములేదు.

393 సూ: ఆదరా దలోపః 3-3-39

అర్థ : ఆదరాత్ = (వశిత్వాది గుణములను చెప్పునపుడు గల) ఆదరమునుబట్టి, అలోపః = (అవశిత్వాది (పరమాత్మ) గుణములకు "నేహ నానా౽స్తి కి చన" (బృ 6-4-19) ఇత్యాదివాక్యములచే) లోపము కలుగదు.

వివ : "నేహ నానా౽స్తికించన" (బృ 6-4-19) ఈబ్రహ్మము నందు విభిన్నములైనవి ఏవియులేవు ఇత్యాది వాక్యములు వశిత్వ ఈశానత్వాది గుణములను ప్రతిషేధించుచున్నవి గదా. అట్టియెడ వశిత్వాది గుణవిశిష్టముగ బ్రహ్మను ఉపాసించుట ఎట్లుపొసగును? అని తలంపరాదు. ప్రమాణాంతరముచే తెలిసికొనుటకు వీలుకానివి శ్రుతి వాక్యములచేత మాత్రమే ప్రతిపాదింపబడినవి. అయితన వశిత్వ ఈశానత్వ అపహతపాప్మత్వాది పరమాత్మ గుణములను ఆ శ్రుతియే ఏల ఖండించును? ఆ కళ్యాణగుణములను ప్రతిపాదింపనేల? తానే మరల

వానిని ఖండింపనేల? కావున "నేహ నానాఽస్తి కించన" ఇత్యాది నిషేధ వాక్యములు శ్రుతిచే సాదరముగ ప్రతిపాదింపబడిన పరమాత్మయొక్క కళ్యాణగుణములను నిషేధింపజాలవు. చేతనాఽచేతనాత్మకమైన వస్తుజాతమంతయు బ్రహ్మాత్మకము. అనగా బ్రహ్మను అంతర్యామిగా కలిగియున్నది. ఇట్లుగానిది అనగా అబ్రహ్మాత్మకమైనది ఏదియు లేదని మాత్రమే "నేహ నానాఽస్తి కించన" ఇత్యాది నిషేధవాక్యములకు అర్థము.కాన సత్యసంకల్పత్వాదిగుణవిశిష్టమైన బ్రహ్మమే ఉపాస్యము.

394 సూ॥ ఉపస్థితేఽత స్తద్వచనాత్ 3-3-40

అర్థ : ఉపస్థితే = (బ్రహ్మవేత్త బ్రహ్మమును) పొందినంతనే, అతః=(అట్లు బ్రహ్మను) పొందుటవలన, తత్ + వచనాత్ = పితృలోకాది ప్రాప్తిని చెప్పుటవలన (ఆ పితృలోక ప్రాప్త్యాదికము మోక్షఫలమే కాని సాంసారికఫలము కాదు.)

వివ : "స స్వరాట్ భవతి. తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి."(ఛా.7-25-2) ఆ ముక్తపురుషుడు అకర్మవశ్యుడగును. అతడు అన్నిలోకములయందును యథేష్టముగ సంచరించును. ఇత్యాదివాక్యములు స్వస్వరూపముతో ఆవిర్భవించిన ముక్తపురుషుడు కర్మవశ్యత లేనందువలన తాను కోరిన భోగములను అనుభవించుచు, తన మనోరథాఽనుసారము పితృలోకాదులయందు సంచరించును అని అతనికి కామచారాదులను తెలుపుచున్నవి ఈకామచారాదులు సాంసారిక ఫలము అని భ్రమ కలుగవచ్చును. కాని అది మోక్షఫలమే అని భావము.

### 99 తన్నిర్ధారణాధికరణము 17

ప్రత్యంగముగ ఉద్గీథోపాసన కావింపవలయునను నియమములేదు

395 సూ॥ తన్నిర్ధారణాఽనియమ స్తద్దృష్టేః పృథగ్ఘ్య ప్రతిబన్ధః ఫలమ్ 3-3-41

అర్థ : తత్ + నిర్ధారణ + అనియమః=(ప్రత్యంగముగ) ఉద్గీథోపాసనము గావింపవలయునను నియమములేదు. తత్ + దృష్టేః= అట్లు శ్రుతియందు చూపట్టుటవలన, ఫలం = (ఉద్గీథోపాసనమునకు) ఫలము, పృథక్ హి = వేరైనదిగదా, అప్రతిబన్ధః = ప్రతిబన్ధకములు లేకుండుటయే (ఉద్గీథోపాసనమునకు) ఫలము.

వివ : "ఓమిత్యేత దక్షర ముద్గీథ ముపాసీత" (ఛా. 1-1-1)

"ఓమ్" అను ఉద్గీథాక్షరమును ఉపాసించవలయును. అని క్రత్వంగ ముగ ఉద్గీథోపాసనము విధింపబడినది. కాని దీనిని తప్పక గావింప వలయునను నియమములేదు. "తేనోభౌ కురుతః. యశ్చైతదేవం వేదయశ్చ న వేద,(ఛా.1-1-10) ఉద్గీథోపాసనము గావించువాడును, కావింపనివాడును క్రతువును అనుష్ఠింపవచ్చును"అనియున్నందువలన. ఉద్గీథోపాసనము గావించినచో ప్రతిబన్ధకములు నశించి క్రతువు శీఘ్ర ఫలప్రదము కాగలదు. లేనిచో ఫలసిద్ధి ఆలస్యము కావచ్చును. "యదేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరం భవతి" (ఛా.1-1-10) ఉపాసనా పూర్వకముగ క్రతువు నాచరించిననే అది శీఘ్రఫల ప్రదము కాగలదు" అని శ్రుతి చెప్పుచున్నది గదా. (నిర్ధారణము = నిశ్చయేనచేతసః అవధారణం = ఉపాసనము)

100 ప్రదానాధికరణము 18

బ్రహ్మమును ఆయా గుణములతో ప్రత్యేక ప్రత్యేకముగ ఉపాసింపవలయును.

396 సూ॥ ప్రదానవదేవ తదుక్తమ్ 3-3-42

అర్థ : ప్రదానవత్ + ఏవ = హవిఃప్రదాన సమయమునందు వలె (బ్రహ్మమును తత్తద్గుణవిశిష్టముగ ఉపాసింపవలయును.) తత్+ ఉక్తం = ఆ విషయము సూత్రకారునిచే చెప్పబడినది.

వివ : దహరవిద్యయందు బ్రహ్మమును అపహతపాప్మత్వాది గుణవిశిష్టముగ ఉపాసించునపుడు బ్రహ్మమును ఒక్కొక్కగుణముతోను ప్రత్యేక ప్రత్యేకముగ భావింపవలయును. "ఇంద్రాయ రాజ్ఞే పురోడాశ మేకాదశ కపాలం నిర్వపేత్. ఇంద్రాయాఽధిరాజాయ ఇంద్రాయ స్వరాజ్ఞే" (యజు-2 కాం-3 ప్ర. 6 అను) అను వాక్యమునుబట్టి "ఇంద్రాయ రాజ్ఞే స్వాహా, ఇంద్రాయ అధిరాజాస్వాహా, ఇంద్రాయ స్వరాజ్ఞే స్వాహా" అనుచు ఇంద్రుడు ఒక్కడే అయినను హవిఃప్రదాన సమయమున "ఇంద్ర" పదమును ప్రతిఃర్యాయము ప్రత్యేక ప్రత్యేక ముగ ఉచ్చరింతుముగదా. "నానా వా దేవతా పృథక్త్వాత్" (సంకర్షణ కాణ్డ) రాజత్వ అధిరాజత్వాది గుణములు భిన్నములగుటవలన విశేష్యమైన దేవతయు భిన్న భిన్నముగ నిర్దేశింపబడవలయును

అనుసంకర్షణ సూత్రము ఇందులకు ప్రమాణము. కావున బ్రహ్మ మును ఒక్కొక్క గుణముతోను ప్రత్యేక ప్రత్యేకముగ ఉపాసింప వలయునని భావము.

101 లిఙ్గభూయస్త్వాధికరణము 19
సర్వ పరవిద్యోపాస్యుడు నారాయణుడే

397 లిఙ్గ భూయస్త్వా త్తద్ధి బలీయ స్తదపి 3-3-43

అర్థ : లింగభూయస్త్వాత్ = (శ్రీమన్నారాయణుడే సర్వపర విద్యోపాస్యుడు అనుటకు) చిహ్నములైన (గుర్తించగల) వాక్యములు అనేకములు ఉండుటవలన (అన్ని బ్రహ్మవిద్యలయందును అతడే ఉపాస్యుడు) తత్ = ఆ వాక్యము, బలీయః + హి = ప్రకరణము కంటెను బలవత్తరమైనదికదా. తత్ + అపి = ఆ విషయము (పూర్వ మీమాంసయందు చెప్పబడినది.)

వివ : "సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువం-విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదమ్" (తై. నా. 13 అను) అని ప్రాకంభించి "సోఽక్షరం పరమస్స్వరాట్" అనునంతవరకును హృదయ పుండరీకాక్షాన్తర్వర్తి యైన పరమాత్మను వర్ణించుచు అతడు "నారాయ ణుడు" అని నారాయణానువాక్యము స్పష్టమొనర్చుచున్నది. "ఇది దహరవిద్యకు శేషమగుటచే ఈదహరవిద్యయందుమాత్రమే నారాయణ రూపమున పరమాత్మను ఉపాసింపవలయును అను పూర్వపక్షమునకు ఈసూత్రము సమాధానము పరవిద్యాప్రకరణములయందు పరమాత్మ పరబ్రహ్మ పరతత్త్వ పరంజ్యోతిః పరమాత్మా అక్షర శివ శంభు ఇత్యాది శబ్దములచే పేర్కొనబడియున్నాడు. కాని ఈ నారాయణానువాకము నందు అపరబ్రహ్మాది శబ్దవాచ్యులను అనువదించి "విశ్వం నారాయణం దేవం నారాయణం పరబ్రహ్మతత్త్వం నారాయణః పరః నారాయణ పరోజ్యోతి, ఆత్మానారాయణః పర స బ్రహ్మ స శివ స్సేంద్ర సోఽ క్షరః పరమస్స్వరాట్" ఇత్యాది వాక్యములచే ఆ పరబ్రహ్మాది శబ్ద

వాచ్యుడు నారాయణుడే అని వారియందు నారాయణత్వము విధింప బడినది. కావున బ్రహ్మవిద్యలన్నింటియందును శ్రీమన్నారాయణుడే ఉపాస్యుడు అని సిద్ధాంతము. "విశ్వం నారాయణం దేవం" ఇత్యాది వాక్యములు దహరవిద్య ప్రకరణమున పఠింపబడినను వాక్యములగుటచే ఇవి ప్రకరణములకంటెను బలవత్తరములు. ఈవిషయమును పూర్వ మీమాంస శ్రుతిలింగ వాక్యప్రకరణ వ్యాకరణ స్థాన సమాఖ్యలు ఉత్త రోత్తరములు బలహీనములని తెలిపినది.

## తృతీయాధ్యాయ తృతీయపాదము

### 102 పూర్వవికల్పాధికరణము 20
### మనశ్చితాదులు ఉపాసనాంగములు

398 సూ॥ పూర్వవికల్పః ప్రకరణాత్ స్యాత్క్రియా మానసవత్
3-3-41

అర్థ : ప్రకరణాత్ = క్రియామయ క్రతు క్రమమునుబట్టి, పూర్వవికల్పః = మనశ్చితాదికము పూర్వోక్త క్రియామయాగ్నియొక్క ప్రకారాంతము, మానసవత్ = ద్వాదశాహక్రతువునందు దశమదినమున చేయబడు మానసగ్రహమువలె, క్రియాస్యాత్ = క్రియా శేషము కావచ్చును.

వివ : వాజసనేయులు అగ్నిరహస్యమునందు "మనశ్చితో వాక్చితః ప్రాణచితః చక్షుశ్చితః" అనుచు మనశ్చితాది (మనోనిర్మి తము) అగ్నులను పేర్కొనియున్నారు. ఇవి క్రియామయ క్రత్వంగ ములా? విద్యామయ క్రత్వంగములా? అనిసందేహము. విద్యామయ

క్రతువిధి లేనందువలన, వీనికి ప్రత్యేక ఫలమును చెప్పనందు వలనను, పూర్వము ఇష్టకచితాఽగ్ని ప్రస్తుతమై నందువలనను, ఇష్టకచితాఽగ్ని ఫలమునే మనశ్చితాదులకును ఫలముగ చెప్పుట వలనను, ఇష్టక చితాఽగ్నులతోబాటు మనశ్చితా ద్యగ్నులును క్రియా మయ క్రత్వంగములే కావలసియున్నది. ఎట్లనగా- ద్వాదశాహ క్రతువునందు దశమదినమున మానస గ్రహ విశేష (పాత్రవిశేష) విధానముగలదు. ఇందు ప్రజాపతి నుద్దేశించి పృథివీరూప పాత్రమున సముద్రాత్మక సోమరసముయొక్క గ్రహణ–ఆసాదన స్తోత్ర శస్త్ర ప్రత్యాహరణ భక్షణములు మనస్సునందు భావింపబడును. ఇది మానసికమే అయినను కర్మాంగ మగుచున్నది. ఇట్లే మనశ్చితా ద్యగ్నులును మానసికములే అయినను కర్మాంగములు కాగలవని పూర్వపక్షి ఆశయము.

399 సూ॥ అతిదేశాచ్చ 3-3-45

అర్థ : అతిదేశాత్ + చ = (ఇష్టక చితాఽగ్ని) సామర్థ్యమును మనశ్చితాఽగ్నులయందు) అతిదేశించుటవలనను (మనశ్చితాఽదులు క్రత్వంగములు.)

వివ : "తేషాం ఏకైకః ఏవతావాన్, యావాన్ అసౌ పూర్వః" (శా. 1-1-10) "ఆ ముప్పదియారువేల అగ్నులలో ప్రతి ఒక్కటి తన పూర్వాగ్నుల సామర్థ్యము గలది" అని చెప్పుటచేత మనశ్చితాదు లును క్రత్వంగములు కావలసియున్నది. అట్లుకానిచో ఆ అగ్నులవలన కలుగు ఫలము వీనివలన ఎట్లు కలుగును? కావున మనశ్చితాదులు క్రత్వంగములని పూర్వపక్షము.

400 సూ|| విద్యైవ తు నిర్ధారణాద్దర్శనాచ్చ 3_3_46

అర్థ : విద్యా+ఏవ తు=(మనశ్చితాదులు) ఉపాసనారూప క్రత్వంగములే. నిర్ధారణాత్=("తే హైతే విద్యాచిత ఏవ "ఈ మనశ్చి తాదులు విద్యాచితములే" అని నిర్ధారించి చెప్పుటవలన, దర్శనాత్+చ= ("మనసైషు గ్రహా అగృహ్యన్త" మనశ్చితాదులయందు గ్రహ స్తోత్ర శస్త్రాదులు మనస్సు చేతనే కల్పింపదగినవి" అను) శ్రుతి వల నను (మనశ్చితాదులు విద్యామయ క్రత్వంగములని స్పష్టమగుచున్నది. కావున మనశ్చితాదులు క్రియామయ క్రత్వంగములు కావని సిద్ధాన్తము)

401 సూ|| శ్రుత్యాది బలీయస్త్వాచ్చ న బాధః 3_3_47

అర్థ : శ్రుతి+ఆది బలీయస్త్వాత్+చ=ప్రకరణముకంటెను శ్రుతి లింగ వాక్యములు బలీయములు అగుటవలన; న బాధః=(మన శ్చితాదులు) ఉపాసనారూప క్రత్వంగములు అగుటకు ఇష్టక చితాంగక మైన ఈ క్రతురూప ప్రకరణము వలన) బాధ కలుగదు.

వివ : ఇది క్రతువును ప్రవచించు ప్రకరణమే అయినను ఈ ప్రకరణమునుబట్టి మనశ్చితాదులు క్రత్వంగములు కావలయునను నిర్బంధము లేదు. ఈ ప్రకరణము కంటెను "తే హైతే విద్యాచిత ఏవ" (ఈ మనశ్చితాదులు విద్యా చితములే) అను శ్రుతి బలవత్తరముగదా• దీనినే "విద్యయా హైవైత ఏవం విదశ్చితా భవన్తి" "వాఙ్మనశ్చక్షురాది వ్యాపారములయందు అగ్నిత్వమును భావించు ఉపాసకునకు ఆ ఉపా సనాబలముచేతనే మనశ్చితాద్యగులు సిద్ధించును". అను శ్రుతి విశదీ కరించుచున్నది. కావున మనశ్చితాదులు విద్యామయ క్రత్వంగములే.

402 సూ॥ అనుబన్ధాదిభ్యః ప్రజ్ఞాన్తర పృథక్త్వవ ద్దృష్టశ్చ తదుక్తమ్. 3-3-48

అర్థ : ప్రజ్ఞాన్తర పృథక్త్వవత్ = ఇతరములైన దహరాద్యుపాసనములు (కర్మాత్మక క్రతువుకంటె) భిన్నములైనట్లు; అనుబన్ధ+ఆదిభ్యః = స్తుత శస్త్రాద్యనుబన్ధములను బట్టియు, శ్రుత్యాదులను బట్టియు శ్రుత్యాదులనుబట్టియు (విద్యామయ క్రతువిధి కల్పింపబడుచున్నది) దృష్టః + చ = (విధివాచక పదము లేకున్నను విధికల్పనము) చూపట్టుచున్నది. తత్ + ఉక్తం=ఆ విషయము (పూర్వమీమాంసయందు) చెప్పబడినది.

తా॥ ఇచట విద్యామయక్రతు విధి లేనందువలన ఈ మనశ్చితాదులు విద్యామయక్రత్వంగము కాజాలవనియు అనరాదు. "తే హైతే విద్యాచిత ఏవ" ఇత్యాది శ్రుతివాక్యములవలన విద్యామయ క్రతుథవిధిని కల్పింపవలయును, "యదేవ విద్యయా కరో- తి తదేవ వీర్యవత్తరం భవతి" (ఛా-1-1-10) ఇత్యాది వాక్యములయందు విశిష్ట క్రతువిధి కల్పింపబడుచున్నదిగదా. ఈ విషయమును "వచనాని త్వపూర్వత్వాత్" (పూ. మీ. 3-5-21) అను సూత్రము విశదీకరించుచున్నది.

403 సూ॥ న సామాన్యా దప్యుపలబ్ధే ర్మృత్యువ న్నహి లోకాపత్తిః 3-3-49

అర్థ : న = ఫలాఽతిదేశముచేత మనశ్చితాదులు క్రత్వంగము అని తలంపరాదు; సామాన్యాత్ + అపి=(ఏదో ఒక) సామాన్య ధర్మము చేతను ఫలాతిదేశము సిద్ధించును. ఉపలబ్ధేః=అట్లు చూపట్టుటవలన,

మృత్యువత్="సఏష ఏవ మృత్యుః; య ఏష ఏతస్మిన్ మండలే పురుషః" (అగ్నిరహస్య) "ఈ ఆదిత్యమండలమునందలి పురుషుడే మృత్యువు" అను వాక్యమున ఆదిత్యమండలపురుషుని మృత్యువుగా చెప్పినరీతిని, నహి లోక + ఆపత్తిః = ఆదిత్యమండల పురుషునికి (మృత్యుసామ్యముచే సంహర్తృత్వమువలె) మృత్యులోక వాసము కూడ భాసింపదు గదా. ఇట్లే ఇష్టక చితాగ్నులకు క్రియామయ క్రతువుద్వార ఎట్టి ఫలము కలుగునో అట్టిఫలమే మనశ్చితా ద్యగ్నులకును ఉపాసనాత్మక క్రతువు ద్వారా కలుగు నను భావము మాత్రమే ఇచట గ్రహింపవలయును.

404 సూ॥ పరేణ చ శబ్దస్య తాద్విధ్యం భూయస్త్వా త్త్వనుబన్ధః 3-3-50

అర్థ: పరేణ చ=తరువాత నుండు బ్రాహ్మణ వాక్యముచేతను, శబ్దస్య = మనశ్చితాది శబ్దమునకు; తాద్విధ్యం = విద్యామయ క్రతువ ప్రతిపాదకత్వము (బోధింపబడుచున్నది.) భూయస్త్వాత్ + తు = అగ్న్యంగముల బాహుళ్యమునుబట్టి; అనుబన్ధః=అవి ఈ క్రియామయ ప్రకరణమున చేర్చబడినవి.

వివ: "అయం వావ లోకః య ఏషోఽగ్నిచితః" (అగ్నిరహస్యం) "ఈ అగ్నిచితునకు ఈ భూలోకమే లోకము" అను బ్రాహ్మణవాక్యము చేతను మనశ్చితాదులు విద్యామయ క్రత్వంగము లని తెలియుచున్నది. అట్లయిన క్రియామయ క్రతు ప్రకరణమున వీనిని ఏల పఠించిరి?. అనినచో మనశ్చితాదులయందు అగ్న్యంగములను అనేకములను ఆరోపించి చెప్పవలసియున్నందువలన ఇచట చెప

బడినవి అని గ్రహింపవలయును. కావున మనశ్చితాదులు విద్యామయ క్రత్వంగములే.

103 శరీరేభావాధికరణము 21

ఉపాసకుడు స్వస్వరూపమును అపహతపాప్మత్వాది గుణవిశిష్టముగ ఉపాసింపవలయును

405 సూ॥ ఏక ఆత్మనశ్శరీరే భావాత్ 3-3-51

అర్థ: శరీరే=శరీరమునందు ఉండు; ఆత్మనః=(ఉపాసకుడైన) జీవునియొక్క భావాత్=కర్తృత్వాది విశిష్టతనుబట్టి (కర్తృత్వాది విశిష్టమైన ఆత్మస్వరూపమే భావింపదగినది అని) ఏకే=కొందరు (తలంచుచున్నారు)

వివ: తనకు అంతరాత్మగా పరమాత్మను ఉపాసించునపుడు ఉపాసకుడు తన (జీవ) స్వరూపమును ఎట్లు ధ్యానింపవలయును? శరీరమునందు ఉండుటచేత కర్తృత్వభోక్తృత్వాదివిశిష్టముగ ధ్యానింపవలయునా? లేక మోక్షదశయందలి అపహతపాప్మత్వాది గుణ విశిష్టముగ ధ్యానింపవలయునా? అని సందేహము. శరీరమునందు ఉండుటచే కర్తృత్వభోక్తృత్వాదిగుణవిశిష్టమైన స్వరూపమునే ధ్యానింపవలయునని కొందరి తలంపు. ఇది పూర్వపక్షము.

401 సూ॥ వ్యతిరేకస్తద్భావభావిత్వాన్న తూపలబ్ధివత్ 3-3-59

అర్థ: నతు=కర్తృత్వాది విశిష్ట (జీవ) స్వరూపము ధ్యేయము కాదు. వ్యతిరేకః=సాంసారిక దశకు వ్యతిరేకముగ మోక్షదశయందలి

అపహత పాప్మత్వాది గుణవిశిష్ట స్వరూపమే ధ్యేయము. తత్ + భావ భావిత్వాత్=అపహత పాప్మత్వాది గుణవిశిష్ట స్వరూపమునే గదా ఇతడు పొందబోవుచున్నాడు. ఉపలబ్ధివత్ = బ్రహ్మస్వరూపోపలబ్ధివలెనే.

వివ : సంసార దశయందలి కర్తృత్వభోక్తృత్వాది గుణ విశిష్టమైన స్వరూపముతో జీవాత్మను ధ్యానింపరాదు. మోక్షదశయందు సంభవించు అపహతపాప్మత్వాది గుణ విశిష్టమైన జీవ స్వరూపమునే ధ్యానింపవలయును "యథా క్రతు రస్మిన్ లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి" (ఛా. 3-14-1) "ఉపాసకుడు ఇచట గావింప ఉపాసనమునుబట్టి ఫలము సిద్ధించును" అను శ్రుతి వాక్యము ననుసరించి అపహతపాప్మత్వాది గుణ విశిష్టమైన జీవస్వరూపమున ఉపాసించిననే గదా మోక్షదశయందు అట్టి స్వరూపము సిద్ధించినది. పరమాత్మను సైతము అతని యథావస్థితరూపములో ఉపాసించిన గదా మోక్షదశయందు అతనిని ఆ రూపమున పొందగలుగుచున్నాము. కావున ఉపాసనా దశలో జీవాత్మను కర్తృత్వాది గుణ విశిష్టునిగ కా జ్ఞానానన్దాది గుణ విశిష్టునిగ భావింపవలయును.

## 104 అఙ్గావబద్ధాధికరణము 22

క్రత్వంగముగ చెప్పబడిన ఉద్గీథాదయుపాసనములు
ఉద్గీథోపాసన అన్నింటియందును వర్తిగ్రాహ్యములు

407 సూ|| అఙ్గావబద్ధాస్తు న శాఖా సు హి ప్రతి వేదమ్ 3.3.

అర్థ : అంగ + అవబద్ధాః తు = క్రత్వంగములుగ చెప్పబడిన ఉద్గీథాది ఉపాసనములు, శాఖాసు=(అవి చెప్పబడిన) శాఖలయం

మాత్రమే (ఉపాసింపదగినవి అను నియమము) న=లేదు. ప్రతి వేదం హి=అన్ని శాఖలయందలి ఉపాసనములలో ఇవి పరిగ్రాహ్యము లు గదా.

వివ : "ఓమిత్యేత దక్షర ముద్గీథ ముపాసీత" (ఛా. 1-1-1) "ఓమ్" అను ఈ అక్షరమును ఉద్గీథముగ ఉపాసింపవలయును" అనుచు శ్రుతి క్రత్వంగముగ ఉద్గీథావయవోపాసనములను విధించు చున్నది. ఈ ఉద్గీథావయవోపాసనములు ఉద్గీథోపాసనము అన్నింటి యందును పరిగ్రాహ్యములు స్వరాది భేదముల చే ఉద్గీథములు భిన్న భిన్నములైనను "ఉద్గీథము" అను సామాన్యసంజ్ఞను బట్టి అవి ఏకే వర్గమునకు చెందిన వగుటవలన ఉద్గీథావయవములను అంతట గ్రహింపవలయు నని భావము.

408 సూ|| మన్త్రాదివద్వాఽవిరోధః 3-3-54

అర్థ : మంత్ర + ఆదివత్ వా=మంత్రాదులకు వలె అవిరోధః= విరోధము లేదు.

వివ : క్రత్వంగముగ ఒక శాఖయందు పఠింపబడిన మంత్ర ములు, ద్రవ్యములును అంగిరైన క్రతువు ఒక్కటే యగుటవలన శాఖా న్తరములయందును అనువర్తించు రీతిని ఉద్గీథావయవోపాసనము లను అన్ని శాఖలయందును పరిగ్రహింపుటలో ఎట్టి విరధము కలుగదు.

105 భూమజ్యాయస్త్వాధికరణము 23

వైశ్వానర విద్యయందు పరమాత్మను త్రైలోక్య శరీరకునిగనే ధ్యానింపవలయును

409 సూ॥ భూమ్నః క్రతువ జ్జ్యాయ స్త్వం తథాహి దర్శయతి 3–3–53

అర్థ: భూమ్నః=సమగ్రోపాసనమునకే; క్రతువత్+జ్యాయ స్త్వం=ప్రామాణికత్వము (సిద్ధించుచున్నది). తథాహి = అట్లే గదా, (బ్రహ్మానుభవమును ఫలముగా) దరయతి = శ్రుతి చెప్పుచున్నది.

వివ: "ఆత్మానం వైశ్వానరం సంప్రత్యధ్యేషితమేవ నో బ్రూహి" (ఛా. 5–2–2) నీవు ప్రస్తుతము ఉపాసించుచున్న వైశ్వానరపురుషుని గూర్చి మాకు ఉపదేశింపుము–అను ప్రశ్నకు సమాధానముగా "ఆ వైశ్వానరపురుషునికి ద్యులోకము శిరస్సు; ఆదిత్యుడు చక్షుస్సు; వాయువు ప్రాణము; ఆకాశము నడుము; పృథివి పాదము" అనుచు వైశ్వానరపురుషుని విశ్వరూపమును వర్ణించి "యస్త్వేత మేవంప్రాదేశమాత్రం అభివిమానం ఆత్మానం వైశ్వానర ముపాస్తే" (ఛా. 5–18–1) ఎవడు ఇట్లు ద్యులోకాదులను అవయవములుగ కలవాడును, సర్వజ్ఞుడును అయిన వైశ్వానరపురుషుని ఉపాసించుచున్నాడో అను ఉపసంహారవాక్యముచే త్రైలోక్యశరీరకుడు, పరమాత్మయు అయిన వైశ్వానరపురుషుని ఉపాసనమును విధించి "సర్వేష్వాత్మ స్వన్నమత్తి" (ఛా. 5 18-1) అతడు సర్వాత్మలయందును అన్నమును తినుచున్నాడు, "అస్యసర్వే పాప్మానః ప్రదూయన్తే" (ఛా.5–24–3) ఈ ఉపాసకుని సకలపాపములు నశించును అని వైశ్వానరోపాసనమునకు పరబ్రహ్మానుభవము, తద్విరోధిపాపనిరసనము ఫలమని తెల్పుటచే త్రైలోక్య శరీరక వైశ్వానర పురుషోపాసనమే కర్తవ్యము అని స్పష్టమగుచున్నది. కావున ప్రత్యేకముగ మూర్ధాద్యవయవోపాసనము చేయరాదు. ప్రత్యేకావయవోపాసనాబోధకములైన

వాక్యములు ప్రశంసాపరములు మాత్రమే. ఎట్లనగా—"వైశ్వానరం ద్వాదశకపాలం నిర్వపేత్ పుత్రే జాతే" (యజు. 2–2–5) పుత్రుడు జన్మించగనే వైశ్వానరదేవతాకమైన ద్వాదశకపాలయాగమును చేయవలయును అని విధించి, "య దష్టాకపాలో భవతి" అనుచు అష్టాకపాలాదులను చెప్పుట ద్వాదశ కపాల ప్రశంసార్థమే గదా?

### 106 శబ్దాది భేదాధికరణము 24

పరబ్రహ్మప్రాపకములైన ఉపాసనములు భిన్నభిన్నములు

**410 సూ॥ నానా శబ్దాది భేదాత్ 3–3–56**

**అర్థ:** శబ్ద+ఆదిభేదాత్=ఆయా ఉపాసనల నామములు, స్వరూపము మొదలైనవాని భేదమువలన, నానా=సద్విద్య, భూమ విద్య, దహరవిద్య మున్నగు ఉపాసనలు పరస్పరము భిన్నములు.

**వివ:** అన్ని ఉపాసనలయందును పరబ్రహ్మమే ఉపాస్యమైనందువలనను, పరబ్రహ్మ ప్రాప్తియే అన్ని ఉపాసలకు ఫల మగుట వలనను సద్విద్య, దహరవిద్య మున్నగు ఉపాసనలు పరస్పరము భిన్నములు కావు అని పూర్వపక్షము. సత్-భూమ-దహర ఇత్యాది నామ భేదమును బట్టియు, ఉపాస్యబ్రహ్మ స్వరూపభేదమును బట్టియు ఈ ఉపాసనలు పరస్పరము భిన్నములే అని సిద్ధాంతము.

ఇట నొక విశేషము: బ్రహ్మోపాసన అన్నింటిలోను న్యాస విద్య ఉత్తమమైనది. దీనినే శరణాగతి ప్రపత్తి యందురు. "తస్మా న్న్యాస మేషాం తపసా మతిరిక్త మాహుః" అనుచు శ్రుతియే ఈ విషయమును తెలిపినది—"బ్రహ్మణే త్వా మహస ఓమిత్యాత్మానం యుం

జీత" అను శ్రుతి ననుసరించి ఇందు మన రక్షణభారమంతయు ఆ పరబ్రహ్మమీదనే ఉంచబడుచున్నది, మరియు ఈ న్యాసవిద్యలో ఉపాయము, ఉపేయము కూడ ఆ పరబ్రహ్మమే అగుచున్నది. కావున మన పూర్వాచార్యులందరు ఈ న్యాసవిద్యనే ఆదరించి, అనుష్ఠించినారు.

కావున ఈ సూత్రమునకు అర్థము నిట్లను అనుసంధించవలయును.

శబ్ద + ఆది భేదాత్=న్యాసము, ఉపాసనము అను శబ్దభేదమును కించన భత స్వకర్తృత్వ–అపహతపాప్మత్వాది బ్రహ్మస్వరూప భేదమును ప్రారబ్ధకర్మ నివృత్తి పూర్వక బ్రహ్మప్రాప్తిరూపఫల భేదమును పురస్కరించుకొని; నానా = సకృదావృత్త న్యాసవిద్య, అసకృదావృత్తి గల ఇతరోపాసనల కంటె భిన్నమైనది.

107 వికల్పాధికరణము 25

బ్రహ్మ విద్యలలో ఏదియో ఒక్కదానిని అనుష్ఠించిన చాలును

411 సూ|| వికల్పోఽవిశిష్ట ఫలత్వాత్ 3–3–57

అర్థ : అవిశిష్ట ఫలత్వాత్=ఫలాంశమునందు భేదము లేనందువలన, వికల్పః = (ఉపాసనలకు) వికల్పము సిద్ధించుచున్నది.

వివ : ఉపనిషత్తులయందు పరబ్రహ్మప్రాప్తికై సద్విద్య, భూమవిద్య, దహరవిద్య మున్నగు అనేక విద్యలు ఉపదేశింపబడి యున్నవి. పరబ్రహ్మప్రాప్తికాముడైన ఉపాసకుడు ఈ విద్యలను అన్నింటిని ఉపాసింపవలయునా? అని సందేహము కలుగవచ్చును.

అట్లు అనుష్ఠింప నవసరములేదు. ఉపాసనలకు అన్నింటికిని నిరతిశయానన్ద పరబ్రహ్మానుభవమే గదా ఫలము. అట్టి ఫలము ఏదో ఒక బ్రహ్మవిద్యను అనుష్ఠించినను కలుగుచుండుటచేత అనేక బ్రహ్మవిద్యలను అనుష్ఠింప నవసరము లేదు అని సారాంశము.

412 సూ|| కామ్యాస్తు యథాకామం సముచ్చీయేర న్నవా పూర్వహేత్వభావాత్ 3_3_58

అర్థ : కామ్యాః + తు = కామ్యోపాసనలు; యథాకామం = కోరికనుబట్టి; సముచ్చీయేరన్=అనేకములు కలిపి ఉపాసింపబడవచ్చును; నవా = ఒక్క దానినే అయినను ఉపాసింపవచ్చును. పూర్వహేతు+అభావాత్=పూర్వము చెప్పిన హేతువు (ఇచట) లేనందువలన.

వివ : నామవిద్య, ప్రాణవిద్య మున్నగు విద్యలు కామ్యములు. వీనివలన కలుగు ఫలము పరిమితము. కావున ఫలాతిశయమును కోరువారు వీనిలో రెండు మూడు విద్యలను కలిపియు ఉపాసింపవచ్చును. అపుడు ఒకే విద్యను ఉపాసించినదానికంటె అధికమైన ఫలము సిద్ధింప గలదు. బ్రహ్మవిద్యలకు ఫలము అపరిమితబ్రహ్మానుభవమే అగుటవలన రెండు మూడు విద్యలను కలిపి ఉపాసింప నవసరము లేదు. ఏదో ఒక్కదానిని ఉపాసించిన చాలును.

108 యథాశ్రయభావాధికరణము 26

ఉద్గీథోపాసన క్రత్వంగము కాదు

413 సూ|| అఙ్గేషు యథాశ్రయభావః 3.3_59

అర్థ : అంగేషు=క్రత్వంగములైన ఉద్గీథాది సామములయందలి ఉపాసనలకు; యథా + ఆశ్రయభావః=తమకు (ఉపాసనలకు)

ఆశ్రయములైన ఉద్గీథాది సామములకు వలెనే క్రత్వంగము సంభ
వించును.

వివ : ఉద్గీథాది సామములు క్రత్వంగములైన విధముగ
వానిని ఆశ్రయించియున్న ఉపాసనములును క్రత్వంగములే కాగలవు
అనుచు క్రమముగ నాల్గు సూత్రములలో పూర్వపక్షము వివరింపబడు
చున్నది. ఇచట ఉపాసనము అనగా జ్ఞానము అని అర్థము.

414 సూ|| శిష్టేశ్చ 3-3-60

అర్థ: శిష్టేః + చ = విధినిబట్టియు (ఉద్గీథాద్యుపాసనము క్రత్వంగమే)

వివ: "ఉద్గీథ ముపాసీత" ఉద్గీథమును ఉపాసింపవలయును
అను విధి వాక్యమునుబట్టియు ఉపాసనము క్రత్వంగమే అగుచున్నది.
"యదేవ విద్యయా కరోతి; తదేవ వీర్యవత్తరం భవతి" అను వాక్య
మున గల "కరోతి", "భవతి" అను వర్తమాన నిర్దేశముచే తెలియబడు
వీర్యవత్తరత్వ రూప ఫలసంబన్ధమునకు ముందే ఉపాసనకు గల
ఉద్గీథ సంబన్ధము తెలియవచ్చుటచేతను ఉపాసనము క్రత్వంగమే
అని భావము,

415 సూ|| సమాహారాత్ 3-3-61

అర్థ : సమాహారాత్=సమాహార నియమమునుబట్టియు (ఉపా
సనము క్రత్వంగమే)

వివ : "హోతృ షదనాద్ధైవాఽపి దురుద్గీథ మనుసమాహరతి"
ఉపాసనారాహిత్యముచే భ్రష్టమైన ఉద్గీథమును ఉద్గాత హోతృ

శంపనము ద్వారా సరిజేసికొనుచున్నాడు అను శ్రుతి ఉపాసనమువల్ల హాని ఏర్పడినపుడు దానిని మరియొకదానిద్వారా సరిజేసికొన మని తెలుపుటచేత ఉద్గీథముతోబాటు ఉపాసనమును కూడ క్రత్వంగముగ అవశ్యము అనుష్ఠింపవలయు నని స్పష్ట మగుచున్నది గదా.

416 సూ॥ గుణ సాధారణ్య శ్రుతేశ్చ 3-3-62

అర్థ: గుణ సాధారణ్య శ్రుతేః + చ = ప్రణవమునకు గుణభూత మైన ఉపాసనముయొక్క సాధారణ్యమును తెలుపు శ్రుతినిబట్టియు (ఉపాసనము క్రత్వంగమే).

వివ: "తేనేయం త్రయీ విద్యా వర్తతే. ఓమి త్యాశ్రావయతి ఓమితి శంసతి. ఓమి త్యుద్గాయతి" (ఛా. 1-1-9) అను వాక్యమున "తేన" అను సర్వనామము ఉపాసనా సహితమైన ప్రకృత ప్రణవ మును పరామర్శించుచున్నది. కావున యజ్ఞాంగములైన ఆశ్రవణ-శంసన-ఉద్గానములయందు ఉపాసనా సహిత ప్రణవమే అనువర్తించును. దీనిని బట్టియు ఉపాసనము క్రత్వంగమే అగుచున్నది అనుచు ఈ నాలుగు సూత్రములచేతను పూర్వపక్షము వర్ణింపబడినది.

417 సూ॥ నవా తత్సహ భావాఽశ్రుతేః 3-3-63

అర్థ: తత్ + సహభావ + అశ్రుతేః - ఉపాసనమునకు క్రత్వంగత్వమును బోధించు శ్రుతి వాక్యము లేనందువలన, నవా = ఉపాసనమునకు క్రత్వంగత్వము సిద్ధింపదు.

వివ: ఉద్గీథము క్రత్వంగమైన రీతిని ఉద్గీథోపాసనము కూడ క్రత్వంగము కావలయునను నియమము లేదు. క్రత్వంగముగ ఉద్గీ

థోపాసనమును విధింప లేదు గదా. "యదేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరం భవతి" అను శ్రుతినిబట్టి ఉపాసనాపూర్వకముగ (చక్కగ తెలిసి) చేయబడు కర్మము ఫలసాధనమున మరింత శక్తివంత మగును అని తెలియుచున్నది. కావున ఫలాన్తరసాధనమైన ఉద్గీథోపాసనము క్రత్వంగము కాజాలదు అని సిద్ధాన్తము.

418 సూ: దర్శనాచ్చ 3-3-64

అర్థ : దర్శనాత్ + చ = శ్రుతి వాక్యము వలనను ఈ విషయము స్పష్టమగుచున్నది.

వివ: "ఏవంవి ద్ధవ బ్రహ్మా యజ్ఞం యజమానం సర్వాంశ్చ ఋత్విజః అభిరక్షతి" (ఛా, 5-17-10) ఈ విధముగ సర్వము చక్కగా తెలిసిన బ్రహ్మయే యజ్ఞమును, యజమానిని ఋత్విక్కులందరిని రక్షించుచున్నాడు" అను శ్రుతి బ్రహ్మయొక్క వేదనముచే సర్వము రక్షింపబడుచున్నట్లు తెలుపుటచే ఇతరులకు వేదనా (ఉపాసనా) వశ్యకత లేదని తెలియుచున్నది. కావున ఉద్గాతయొక్క ఉద్గీథోపాసనము (జ్ఞానము) క్రత్వంగము కాజాలదు.

తృతీయాధ్యాయ తృతీయ పాదము సమాప్తము

## తృతీయాధ్యాయ తృతీయ పాదార్థ సంగ్రహ శ్లోకములు

||శ్లో|| విద్యైక్యోద్గీథ విద్యాద్వితయ విభజన ప్రాణవిద్యైక్యభావాః
సర్వాప్యానన్దతాదే ర్గుణవ దనుగతిః ప్రాణపానన్య దృష్టిః|
శాణ్డిల్యైక్యం విభజ్య స్థితిరహ రహయో స్సంభృతే స్థాన సీమా
పుంవిద్యాయా విభేదోఽధ్యయననియతతా శన్న ఇజ్యా
దికానామ్ ॥

||శ్లో|| హానా ద్యన్యోఽన్య యోగ స్తదుచిత
సమయో దేవయానాది సామ్యం
సర్వాన్యస్థూలతాది వ్యతిహరణ మిహాఽనేక శిష్యశ్రితానాం|
దహ్రోపాస్త్యైక్యభావో గుణ ఫలవిధి రుద్గీథ మాశ్రిత్య దృష్టౌ
గుణ్యావృత్తి గ్గుణార్థం నిఖిల వరతరోపాస్తి వేద్యాఽవసాయః||

||శ్లో|| విద్యారూపా మనశ్చిత్ప్రభృతయ ఉచిత జ్ఞానరూపక్రతుస్థాః
క్షేత్రీ శుద్ధోఽముచిన్త్యః క్రతు గుణ సకలోద్గీథ పూర్వేషు దృష్టిః|
సామాన్యేనైవ వైశ్వానర భజన మథాఽనేక విద్యోపపత్తిః
మోక్షార్థానాం వికల్పః పున రనియతి రుద్గీథదృష్టే రిహోక్తాః||

||తా|| సర్వవేదాన్త ప్రత్యయాధికరణమున వేర్వేరు శాఖల యందు పఠింపబడిన వైశ్వానర విద్యలు, దహరవిద్యలు మున్నగునవి అభిన్నములని; అన్యథాత్వాధికరణమున ఒకే శాఖయందు పఠింపబడి నను ఉద్గీథ విద్యలు భిన్నములని; సర్వాఽభేదాధికరణమున భిన్న శాఖాపఠితము లైన ప్రాణ విద్యలకు ఐక్యమని; ఆనన్దాద్యధికరణమున ఆనన్దాది స్వరూప నిరూపకధర్మషట్కము గుణిరైన బ్రహ్మముతో కాటు అన్ని బ్రహ్మవిద్యలయందును అనువర్తించుననిః కార్యాఖ్యానాధి

కరణమున అవమనతీర్థమునందు ప్రాణవాసస్త్వ దృష్టి భావ్యమని; సమానాధికరణమునభిన్నశాఖాపఠితములైన శాణ్డిల్యవిద్యలు అభిన్నము అని, సంబన్ధాధికరణమున "అహః", "అహం"అను రహస్యనామములభేదమునుబట్టి ఆదిత్య, అక్షివిద్యలు భిన్నములు అని, సంభృత్యధికరణమున సంభృతి, ద్యువ్యాప్తి మున్నగు గుణములు ఆయా ఉపాసనలయందు మాత్రమే నియతములని, పురుషవిద్యాధికరణమున తైత్తిరీయక ఛాన్దోగ్యములయందు పురుషవిద్యలుభిన్నములు అనియు; వేధాద్యధికరణమున "శన్నోమిత్రః" ఇత్యాది శాంతి పాఠమంత్రములు అధ్యయనాంగములే గాని ఉపాసనాంగములు కావని, హాన్యధికరణమున బ్రహ్మవేత్త పుణ్యపాపములను తొలగించుకొనును అని చెప్పినను ఆ పుణ్యపాపములు అతని మిత్రులను, శత్రువులను చేరునని గ్రహింపవలెననియు సామ్పరాయాధికరణమున బ్రహ్మవేత్తయొక్క పుణ్యపాపములు అతనిని వీడి అతని మిత్రులును శత్రువులను చేరు సమయమును, అనియమాఽధికరణమున అర్చిరాదిగతి సర్వబ్రహ్మవిద్యాసాధారణమనియు, అక్షరధ్యధికరణమున అన్ని ఉపాసనలయందును ఆనన్దగుణములతోబాటు అస్థూలత్వాదిగుణములను కూడ అనుసంధింపవలయు ననియు, అన్తరత్వాఽధికరణమున యాజ్ఞవల్క్యుడు ఉషస్తకహోళులకు ఉపదేశించిన బ్రహ్మవిద్యలు అభిన్నము లనియు, కామాద్యధికరణమున ఛాన్దోగ్య బృహదారణ్యములయందు ఉపదిష్టములైన దహరోపాసనములు అభిన్నములు అనియు, తన్నిర్ధారణాఽనియమాధికరణమున క్రతువులయందు ఉద్గీథోపాసనము క్రతువునకు వీర్యవత్తరత్వ సంపాదకమగుటచే ఐచ్ఛికమనియు, ప్రదానాఽధికరణమున అపహత పాప్మత్వాది గుణోపాసనమునకై గుణియైన బ్రహ్మమునకు ఆవృత్తియు, లింగభూయస్త్వాధికరణమున

సర్వబ్రహ్మవిద్యోపాస్యుడు శ్రీమన్నారాయణుడే అనియు, పూర్వ వికల్పాఽధికరణమున విద్యారూపములైన మనశ్చితాదులకు క్రత్వంగత్వము సంభవమనియు, శరీరేభావాఽధికరణమున బ్రహ్మవిద్యోపాసనమున జీవాత్మను పరిశుద్ధస్వరూపునిగ ధ్యానింపవలయుననియు అంగాఽవబద్ధాఽధికరణమున క్రత్వంగములైన ఉద్గీథాఽవయవోపాసనములు సర్వశాఖలయందలి ఉద్గీథములతో సంబంధించునవనియు, భూమజ్యాయస్త్వాధికరణమునందు త్రైలోక్యశరీరుడైన వైశ్వానరశబ్దవాచ్యపరమాత్మయే ఉపాస్యుడనియు, శబ్దాదిభేదాధికరణమున సద్విద్యా దహర విద్యాది ద్వాత్రింశద్బ్రహ్మవిద్యలు పరస్పరము భిన్నములు అనియు, వికల్పాధికరణమున బ్రహ్మప్రాప్తికాముడు ఏదియో బ్రహ్మవిద్యను అనుష్ఠించిన చాలును అనియు యథాశ్రయభావాధికరణమున ఉద్గీథాద్యుపాసనములు క్రత్వనియతములలయు ఈ గుణోపసంహారపాదమునందు వివరింపబడినవి.

—:0:—

## తృతీయాధ్యాయ చతుర్థపాదము
## అంగపాదము

### 109. పురుషార్థాధికరణము 1
### మోక్షపురుషార్థము ఉపాసనవలననే సిద్ధించును

**419 సూ॥** పురుషార్థోఽతశ్శబ్దా దితి బాదరాయణః 3-4-1

అర్థ : పురుషార్థః = బ్రహ్మప్రాప్తి రూప పురుషార్థము (ఫలము) అతః=ఈ ఉపాసనమువలననే (సిద్ధించుచున్నది) శబ్దాత్= శ్రుతివలన ఇతి = అని, బాదరాయణః = బాదరాయణమహర్షి తలంచుచున్నారు.

వివ : "బ్రహ్మవి దాప్నోతి పరం" (తై.బ్ర వ. 1) బ్రహ్మమును ఉపాసించినవాడు ఆ పరబ్రహ్మప్రాప్తి రూప మోక్షమును పొందుచున్నాడు అను శ్రుతివలన మోక్షపురుషార్థము పరబ్రహ్మోపాసనము వలన సిద్ధించునని బాదరాయణమహర్షి తలంచుచున్నారు.

**420 సూ॥** శేషత్వా త్పురుషార్థవాదో యథాఽన్యే ష్వితి జైమినిః 3-4-2

అర్థ : శేషత్వాత్ = ఉపాసనము కర్మశేషమగుటవలన, పురుషార్థవాదః = (అది) మోక్షరూపఫలము నొనంగును అను వాదము అన్యేషు యథా = ద్రవ్యసంస్కారాదులయందువలె, (అర్థవాదః = గౌణము) ఇతి = అని, జైమినిః = జైమిని మహర్షి (భావించుచున్నారు)

వివ : యజ్ఞాచరణమునకు వశ వ్రీహ్యాదులవలె కర్తయొక్క స్వరూపజ్ఞానము సైతము ఆవశ్యకమైయున్నది. "తత్త్వమసి"ఇత్యాది వేదాన్తవాక్యములు బ్రహ్మమే కర్తగా వ్యవహరింపబడుచున్నదని

తెలుపుటచేత బ్రహ్మోపాసనము ఆత్మస్వరూపశోధక మగుచున్నది కావున ఉపాసనము కర్మాంగమనుటయే యుక్తము. మరి బ్రహ్మో-పాసనమువలన పురుషార్థప్రాప్తికలుగుచున్నది అనుట ఎట్లు? అనినచో అది కేవలము అర్థవాదము (స్తుతి) మాత్రమే అని భావింపవలయును. కర్మాంగముల విషయమున అర్థవాదములుగలవు గదా. చూడుడు. "యదాక్తే, చక్షురేవ భ్రాతృవ్యస్యవృంక్తే" యజమాని కంటికి కాటుక పెట్టుకొనుటచే అతని శత్రువుయొక్క దృష్టిని అది హరించుచున్నది. ఇత్యాదులు అర్థవాదములేగదా. కావున పురుషార్థప్రాప్తికర్మమువలననే గాని బ్రహ్మోపాసనవలనకాదు. బ్రహ్మోపావన ఆత్మస్వరూపశోధక మగుచు కర్మాంగమగుచున్నది అని జైమినిమహర్షి మతము.

421 సూ॥ ఆచార దర్శనాత్ 3-4-3

అర్థ : ఆచార దర్శనాత్ = బ్రహ్మవేత్తలయందు కర్మాచరణ చూపట్టుచున్నందువలనను (ఉపాసనము కర్మాంగమే)

వివ : "అశ్వపతిః కేకయః బ్రహ్మవి దగ్రేసరః యక్ష్యమాణో హవై భగవన్తోఽహ మస్మి" (ఛా- 5-11-5) కేకయ దేశములకు అధిపతియైన అశ్వపతి బ్రహ్మవేత్తలలో అగ్రేసరుడు. అతడు యజ్ఞము చేయ సంకల్పించి ఓ పూజ్యులారా! ఇదిగో సిద్ధముగ నున్నాను- ఇత్యాది శ్రుతివాక్యములు బ్రహ్మవేత్తలలో యజ్ఞములను అనుష్ఠించు ఆచారము ఉన్నట్లు తెలుపుటవలన- "కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః" (భ. గీ. ?-20) జనకాదులు కర్మానుష్ఠానము చేతనే పురుషార్థ సిద్ధిని పొందిరి అను భగవద్గీతావచనము సైతము పైవిషయమునే వివరించుటవలనను ఉపాసనము కర్మాంగము అను విషయము సిద్ధించుచున్నది.

422 సూ॥ తచ్ఛ్రుతేః 3-4-4

అర్థ : తత్ + శ్రుతేః = విద్యకు కర్మాంగత్వమును తెలుపు నట్టి శ్రుతి యున్నందువలనను (ఉపాసనము కర్మాంగమే)

వివ : "యదేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరం భవతి" జ్ఞానముద్వారా (చక్కగ తెలిసి) చేయబడు కర్మ ఫలప్రదానమునందు అధికశక్తి కలిగియుండును అను శ్రుతి కర్మ ఫలప్రదానమని, ఉపాసనము దానికి అంగమని స్పష్టముగ ప్రతిపాదించుచున్నది. విద్య, ఉపాసనము, జ్ఞానము-ఇవి ఇచట పర్యాయపదములు.

423 సూ॥ సమన్వారమ్భణాత్ 3-4-5

అర్థ: సం + అను + ఆరంభణాత్ = విద్యాకర్మలు కలిసి యుండునవైనందువలనను (విద్య కర్మాంగము).

వివ: "తం విద్యాకర్మణీ సమన్వారభేతే" (బృ. 6.4.2) శరీరమునుండి ఉత్క్రమించు జీవుని విద్య, కర్మ రెండును అనుసరించుచున్నది అని అనుటవలన కర్మకు విద్య అంగమని తెలియుచున్నది. "విద్యాకర్మణీ" అనునెడ కర్మపద సాహచర్యముచే విద్యా శబ్దము మోక్ష హేతువైన విద్యను బోధింపజాలదు. కావున కర్మాంగమైన విద్య అనియే అర్థము.

424 సూ॥ తద్వతో విధానాత్ 3-4-6

అర్థ : తద్వతః = వేదార్థజ్ఞానము గలవానికి, విధానాత్-కర్మలను విధించుటవలనను (విద్య కర్మాంగమే).

వివ : "ఆచార్యకులాత్ వేద మధీత్య యథావిధానం గురోః కర్మాऽతిశేషేణ అభిసమావృత్య కుటుంబే శుచౌ దేశే" గురుకులమున వేదాధ్యయనము గావించి, యథావిధిగా గురూపదేశము పూర్తిఅయి నంతనే అచటినుండి వచ్చి కుటుంబమున పవిత్రమైన ప్రదేశమున– అనుచు వేదాధ్యయనము గావించినవానికి కర్మల నుపదేశించుట వలనను విద్య కర్మాంగమని తెలియుచున్నది. వేదాధ్యయన మనగా అర్థజ్ఞానముతో కూడిన వేదాక్షరరాశి గ్రహణ మని అర్థము.

425 సూ|| నియమాత్ 3–4–7

అర్థ : నియమాత్=(కర్మల నాచరింప వలయు నను) నియమమునుబట్టియు (విద్య కర్మాంగము).

వివ : "కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతం సమాః" (ఈశ–2) కర్మలను ఆచరించుచునే నూరు సంవత్సరములు ఈ లోకమున జీవింపవలయును అను శ్రుతి జీవితాంతము కర్మలను ఆచరింపవలయు నని నియమించుచున్నందు వలనను విద్య కర్మాంగమే అని జైమిని మతము.

426 సూ|| అధికోపదేశాత్తు బాదరాయణ స్యైవం తద్దర్శనాత్ 3.4.8.

అర్థ : అధిక + ఉపదేశాత్+తు = జీవాత్మకంటె అధికముగ (వేరుగ) పరమాత్మను శ్రుతులు పేర్కొంటవలన; బాదరాయణస్య=బాదరాయణ మహర్షియొక్క (మతము) ఏవం=విద్యవలననే పురుషార్థము (విద్యకర్మాంగము కాదు) (అని సిద్ధించుచున్నది). తత్+దర్శనాత్=

ఆ పరబ్రహ్మనుగూర్చియు, అతని ఉపాసనమును గూర్చియు శ్రుతుల యందు చూపట్టుటవలన.

వివ: మోక్షపురుషార్థము కర్మవలన సిద్ధింపదు. విద్య కర్మాంగమును కాదు. కర్మల ననుష్ఠించు జీవునికంటె వేరుగ పరమాత్మను శ్రుతులు ఉపదేశించుచున్నవి. "స కారణం కరణాధిపాధిపః" (శ్వే-6-19) ఆ పరమాత్మ జగత్కారణము. ఇంద్రియములను నియమించు జీవాత్మకును అతడు అధిపతి—ఇత్యాది శ్రుతి వాక్యములు ఇందులకు ప్రమాణము. కావున కర్మలను అంగములుగ గల పరమాత్మోపాసనమే మోక్షరూప పురుషార్థప్రద మని బాదరాయణ మహర్షి సిద్ధాన్తము. ఇట్లే బ్రహ్మోపాసనము జీవాత్మస్వరూప శోధకమును కాదు. సంకల్ప మాత్రమున జగత్సృష్టి స్థితి సంహారాదులను గావించువాడును, చేతనాచేతనములకు అధిపతియు, తనను ఉపాసించినవారికి మోక్షప్రదాతయు అయిన పరమాత్మ జీవాత్మకంటె అత్యంతము విలక్షణుడై నందువలన జీవాత్మ పరమాత్మలకు ఐక్యము ఎట్టి దశలోను సిద్ధింపదు గదా.

427 సూ|| తుల్యం తు దర్శనమ్ 3-4-9

అర్థ: దర్శనం తు—ఆచార దర్శనము, అన్నోన్యతుల్యం—సమానము.

వివ కేకయ మహారాజు, జనకచక్రవర్తి మొదలైన బ్రహ్మవేత్తలు కర్మాచరణ పరాయణులైన విధముగనే కర్మలను ఆచరింపని బ్రహ్మవేత్తలును గలరు. "ఋషయః కావషేయాః కిమర్థా వయ మధ్యేష్యామహే; కిమర్థా వయం యక్ష్యామహే" (ఛా. 1-1-10) కావషేయులు అనబడు ఋషులు "మనమెందులకు అధ్యయన మొనర్ప వలయును? ఎందులకు యజ్ఞములను అనుష్ఠింపవలయును?" (అని

చరిప్ంచి కర్మలను త్యజించిరి) ఇత్యాది శ్రుతులు కర్మల నాచరింపని బ్రహ్మవేత్తలను గూర్చి తెలుపుచున్నవి గదా. కావున కర్మలను అచరించుట అనగా ఫలాభిసంధి రహితముగ ఆచరించుట అనియు, కర్మలను ఆచరింవకుండుట అనగా ఫలాపేక్షతో కర్మలను ఆచరింపకుండుట అనియు అర్థము–ఫలాభిసన్ధిరహిత కర్మాచరణము బ్రహ్మవిద్యకు అంగము అగుచున్నది. ఈ రీతిని కర్మాంగకమైన బ్రహ్మోపాసనము మోక్ష పురుషార్థప్రదాయకము అని భావము.

428 సూ॥ అసార్వత్రికీ 3-4-10

అర్థ : అసార్వత్రికీ=("యదేవ విద్యయా కరోతి" అను శ్రుతి) సర్వ విద్యా విషయము కాదు.

వివ : "యదేవ విద్యయా కరోతి" (ఛా 1-1-10) అను వాక్యమునందు గల "విద్యా" శబ్దము ఉదీథ విద్యను మాత్రమే బోధించును గాని బ్రహ్మవిద్యల నన్నింటిని బోధింపజాలదు. "ఉద్గీథవిద్యతో కలిపి చేయబడిన కర్మమే శీఘ్రముగ ఫలప్రదానశక్త మగును" అని గదా పై ఉపనిషద్వాక్యమునకు అర్థము. కావున బ్రహ్మవిద్య కర్మాంగము కాదు.

429 సూ|| విభాగ శ్శతవత్ 3-4-11

అర్థ : శతవత్=శతసంఖ్యయందు వలెనే, విభాగః=విద్యాకర్మల విభాగమును (భావింపవలయును)

వివ: వంద వంద రూపాయల విలువ గల రెండు వస్తువులను కొని, అమ్మినవానికి రెండు వందల రూపాయల నిచ్చినచో ఆ మొత్తము ఆ రెండు వస్తువులకు వంద వందగా ఎట్లు విభజింపబడునో అట్లే,

"తం విద్యాకర్మణీ సమన్వారభేతే" (బృ. 6-4-2) శరీరమునుండి ఉత్క్రమించు జీవాత్మను విద్యాకర్మలు రెండును అనుసరించుచున్న అనువాక్యమున "విద్యాకర్మలు తమతమ ఫలములను ఒసంగుటకుగాను అనుసరించుచున్నవి" అని అర్థమేగాని "ఆ రెండును కలిసి ఒకే ఫలమును ఒసంగుటకుగాను అనుసరించుచున్నవి" అని అర్థము కాదు. కావున విద్య కర్మాంగముకాజాలదు.

430 సూ॥ అధ్యయన మాత్రవతః 3-4-12

అర్థ : అధ్యయనమాత్రవతః = కేవలము వేదాధ్యయనమును మాత్రమే చేసిన వానికి (కర్మలను విధించుటవలనను విద్యకర్మాంగము కాదు.)

వివ : "ఆచార్యకులాత్ వేద మధీత్య" (ఛా. 8-15-1) అను వాక్యమున వేదాధ్యయనము మాత్రము చేసిన వానికి కర్మలు విధింపబడినవి. "అధీత్య" అనుపదము అక్షరరాశిని గ్రహణమును మాత్రమే బోధించునుగాని అర్థగ్రహణమునుబోధింపదు. "అగ్నీన్ ఆదధీత" అను అగ్న్యాధానవిధి అగ్నిహోత్ర మాత్రబోధకమే గాని అగ్నిష్టోమాది పర్యన్తబోధకముకాదుగదా "అధ్యయనము" అనగా అర్థజ్ఞానముతో గూడిన అధ్యయనము అనియే అర్థము అని భావించినను వేదార్థ జ్ఞానముకంటె (బ్రహ్మస్వరూప జ్ఞానముకంటె) ధ్యానోపాసనాది శబ్ద వాచ్యమై బ్రహ్మప్రాప్తి సాధనమైన "విద్య" భిన్నమైనది. అది కర్మాంగముకాదు.

431 సూ॥ నాఽవిశేషాత్ 3-4-13

అర్థ : అవిశేషాత్ = విశేష హేతువు చెప్పబడినందువలన, న = కర్మానుష్ఠాన నియమము ఫలసాధన కర్మవిషయముకాదు.

వివ : "జీవన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతం సమాః (ఈశా-2) కర్మల నాచరించుచునే ఈ లోకమున నూరు సంవత్సరములు జీవింపవలయును అనువాక్యము ఫలసాధనములైన కర్మలను బ్రహ్మో పాసకుడు అనుష్ఠింపవలయును అని తెలుపజాలదు. అట్టి పదమేదియు అందులేదుగదా. ఫలాభిసన్ధి రహిత కర్మలను విద్యాంగముగ బ్రహ్మో పాసకుడు అనుష్ఠింపవలయునని బోధించును అనుచో బాధలేదు. కావున విద్య కర్మాంగముకాదు.

432 సూ॥ స్తుతయేఽనుమతి ర్వా. 3-4-14

అర్థ : స్తుతయే వా = బ్రహ్మవిద్యా మాహాత్మ్యమును స్తుతించుటకొరకే, అనుమతిః = కర్మానుష్ఠానమును అనుమతించుట.

వివ : బ్రహ్మోపాసకుడు కర్మల నాచరించినను అవి అతనికి అంటవు. "న కర్మణా లిప్యతే నరః" అనుతరువాతి వాక్యముఈ విషయమును స్పష్టముగ తెలుపుచున్నదిగదా. కావున బ్రహ్మోపాసకునకు విద్యాంగముగ ఫలాభిసన్ధిరహిత కర్మానుష్ఠానము అనుమతింపబడుచున్నది.

43 సూ కామకారేణ చైకే 3-4-15

అర్థ : ఏకే = కొందఱు, కామకారేణ చ = స్వేచ్ఛచే (ఇచ్ఛానుసారము గార్హస్థ్య కర్మత్యాగమును చెప్పుచున్నారు.)

వివ : "కిం ప్రజయా కరిష్యామః, యేషాం నః అయం ఆత్మా" (బృ. 6-4-22) మాకు అంతయు పరమాత్మయే. సంతతితో ఏమి ప్రయోజనము?" అనుచు కొన్ని శాఖలవారు కర్మత్యాగమును

బోధించుచున్నారు. కావున కర్మ బ్రహ్మవిద్యాంగమేగాని విద్య కర్మాంగముకాదు.

434 సూ॥ ఉపమర్దం చ 3-4-16

అర్థ : ఉపమర్దం చ = కర్మవినాశమును శ్రుతిచెప్పుచున్నది.

వివ : "క్షీయన్తే చాఽస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" (ముండక. 2-2-8) "ఆ పరబ్రహ్మ దర్శనమైనంతనే ఈ ఉపాసకుని యొక్క కర్మలు అన్నియు నశించును" అనుచు శ్రుతి విద్యా మాహాత్మ్యముచేత సర్వకర్మలు నశించునని తెలుపుచున్నది. విద్య తనచే నశించు కర్మలకు తాను ఎట్లు అంగము అగును? కావున విద్య కర్మాంగముకాదు.

435 సూ॥ ఊర్ధ్వరేతస్సు చ శబ్దే హి 3-4.17

అర్థ : ఊర్ధ్వరేతస్సు చ = ఊర్ధ్వరేతస్కములైన ఆశ్రమముల యందును (బ్రహ్మోపాసనకు అవకాశముగలదు) శబ్దే హి = వేదము నందు (ఇట్టి ఆశ్రమములు ప్రసిద్ధములేగదా.)

వివ : స్త్రీ సంబంధములేని బ్రహ్మచర్య వానప్రస్థ సన్యాశ్రమములవారికిని బ్రహ్మవిద్యాధికారముగలదు. వీరికి అగ్నిహోత్రాది కర్మాధికారములేదు. ఇట్టియెడ వీరి విద్య కర్మాంగమెట్లగును? కావున విద్య కర్మాంగముకాజాలదు. "త్రయో ధర్మస్కన్ధాః" (ఛా. 2-23-1) ధర్మమూలములైన ఆశ్రమములు మూడు–అనియు. "యే చేమే అరణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే" ఎవరు అరణ్యమున శ్రద్ధతో తపస్సు అనబడు బ్రహ్మను ఉపాసించుచుందురో" అనియు, "ఏత మేవ ప్రవాజినో లోక

మిచ్ఛంతః ప్రవజన్తి" ఈ (బ్రహ్మ) లోకమును పొందగోరి వైరాగ్య-వంతులు సన్న్యసించుచున్నారు — అని యీ శ్రుతులు వానప్రస్థాది ఆశ్రమములను ప్రస్తుతించుచున్నవి. "యావజ్జీవం అగ్నిహోత్రంజుహోతి" అను శ్రుతి వానప్రస్థాది ఆశ్రమములను అనుమతించుటలేదు గదా అని సందేహింపరాదు. వైరాగ్యము లేనివారు యావజ్జీవము అగ్నిహోత్రములను ఉపాసింపవలయును. వైరాగ్యముగలవారు వానప్రస్థాది ఆశ్రమములను స్వీకరించి బ్రహ్మోపాసన గావింపవలయునని సిద్ధాన్తము.

436 సూ॥ పరామర్శం జైమిని రచోదనా చ్చాఽప వదతి హి
3–4–18

అర్థ : అచోదనాత్ = విధివాచకము లేనందువలన; పరామర్శం = (వానప్రస్థాది ఆశ్రమముల ప్రస్తావన) అనువాదముమాత్రమే అని, జైమినిః = జైమినిమహర్షి (తలంచుచున్నారు,) అపవదతి హి = (శ్రుతి ఇట్టి ఆశ్రయములను) నిషేధించుచున్నదిగదా.

వివ : "త్రయో ధర్మస్కన్ధాః" ఇత్యాదివాక్యములయందు వానప్రస్థాద్యాశ్రమములను స్వీకరించి తీరవలయును అని విధించు పదము లేనందువలన కేవలము ఉపాసనా ప్రాశస్త్యమును తెలుపుటకై వానప్రస్థాద్యాశ్రమములు ప్రస్తావింపబడినవని తలంపవలయును. కావున ఆ ఆశ్రమములకుగాని అచట విద్యకుగాని ప్రాముఖ్యములేదు అని జైమిని ఆశయము శ్రుతికూడా. "వీరహా వా ఏష దేవానాం, యోఽగ్ని ముద్వాసయతే" (యజు. 1 కాం–5 ప్ర. 2 అను) అగ్నిహోత్రములకు ఉద్వాసనము పలికినవాడు వీరహత్య చేసినవాడే అనుచు అగ్నిహోత్ర పరిత్యాగము మహాపాతకమని బోధించుచున్నది.

కావున అగ్నిహోత్రమును త్యజించిన పిదప స్వీకరించు వానప్రస్థాది ఆశ్రమములు అశాస్త్రీయములేకాగలవు అని పూర్వపక్షము.

437 సూ॥ అనుష్ఠేయం బాదరాయణ స్సామ్య శ్రుతేః 3-4-19

అర్థ : సామ్యశ్రుతేః = నాల్గుఆశ్రమములను తెలుపునట్టి శ్రుతి వలన, అనుష్ఠేయం = వానప్రస్థా ద్యాశ్రమములును అనుష్ఠేయములే అని, బాదరాయణః = బాదరాయణ మహర్షి తలంచుచున్నారు.

వివ : "త్రయో ధర్మస్కన్ధాః" (ఛా.2-23-1) ధర్మమూలము లైన ఆశ్రమములు మూడు అని ఆశ్రమములను సమానముగా పేర్కొనుటచే గృహస్థాశ్రమమువలె ఇతరాశ్రమములును అనుష్ఠేయములే అని బాదరాయణమహర్షి సిద్ధాన్తము.

438 సూ॥ విధిర్వా ధారణవత్ 4-3-20

అర్థ : ధారణవత్ = ఉపరిధారణ వాక్యమువలె, విధిః + వా = త్రయో ధర్మస్కన్ధాః అనువాక్యము విధిపరమే.

వివ : మృతాఽగ్నిహోత్రమున పితృదేవతాకమైన హవ్యమును స్రుక్కునందు తీసికొని హోమముచేయుటకు గార్హపత్యాగ్నినుండి ఆహవనీయాగ్నియొద్దకు వెళ్ళవలయును. అపుడు సమిధను స్రుక్కునకు క్రింద ఉంచుకొనవలయును, ఇదియే దైవసంబంధమైన కార్యము నందైనచో సమిధను స్రుక్కునకు పైన ఉంచుకొనవలయును. ఈ విషయమును అధస్సాత్ సమిధం ధారయన్ అనుద్రవేత్. ఉపరి హి దేవేభ్యో ధారయతి" (పూ. మీ 3-4-5) అను వాక్యము తెలుపుచున్నది. ఈవాక్యము "ధారయతి" అని అనువాదరూపమున నున్నను "ఉపరిధారణ" విధి బోధకమేగదా. ఇట్లే "త్రయో ధర్మస్కన్ధాః"

అనువాక్యము సైతము అప్రాప్తార్థ బోధకమగుటచే వానప్రస్థాద్యాశ్రమ విధాయకమే అని గ్రహింపవలయును.

### 110 స్తుతిమాత్రాధికరణము 2

రసతమత్వ దృష్టితో ఉద్గీథమును ఉపాసింపవలయును.

439 సూ॥ స్తుతి మాత్ర ముపాదానా దితిచే న్నాపూర్వత్వాత్
3-4-21

అర్థ : ఉపాదానాత్ = కర్మాంగములగు ఉద్గీథాదులను పేర్కొనుటవలన, స్తుతి మాత్రం = ఆ ఉద్గీథాదులయందు రసతత మత్వ వర్ణనము ప్రశంస మాత్రమే, ఇతిచేత్ = అనుచో, న = కాదు, అపూర్వత్వాత్ = ఉద్గీథాదులు ఇవటి విధింపబడనందువలనను, వాని యందురసతమత్వాదులు అప్రాప్తములగుటవలనను (ఇది రసతమత్వ దృష్టివిధియే అగుచున్నది.)

వివ : "ఓమిత్యేత దక్షర ముద్గీథ ముపాసీత ఓమిత్యుద్గాయతి తస్యోపవ్యాఖ్యానం. ఏషాం భూతానాం పృథివీ రసః. పృథివ్యాః ఆపో రసః. అపా మోషధయః రసః ఓషధీనాం పురుషోరసః. పురుషస్య వాక్ రసః. వాచః ఉద్గీథః రసః. స ఏష రసానాం పరమః పరార్థ్యః అష్టమః య దుద్గీథః" (ఛా. 1-1-3) ఈ భూతములు(కు)లో పృథివి రసము (సారభూతము) 2 పృథివిలో నీరు 3 నీటిలో ఓషధులు 4 ఓషధులలో పురుషుడు 5 పురుషునిలో వాక్కు 6 వాక్కున ఋక్కు, 7 ఋక్కున సామ్యము, సామ్యమున ఉద్గీథము రసములు అనగా సారభూతములు, కావున ఈ ఎనిమిదవదైన ఉద్గీథము రసములన్నింటి లోను శ్రేష్ఠమై "రసతమము" అనబడుచున్నది. అను శ్రుతివాక్యము

ఉద్గీథమును రసదృష్టితో ఉపాసింపవలయుననిబోధించుచున్నది. కాని కొందఱు "ఇయ మేవ జుహూః, స్వర్గోలోకః" ఆవహనీయం జుహూవు ఈ భూమియే.ఆహవనీయము స్వర్గలోకమే-అనునెడజుహ్వాదులయందు పృథివీత్వాద్యారోహణము ఎట్లు కేవల ప్రశంసార్థమో, అట్లే ఉద్గీథమును రసతమముగ చెప్పుటయు ప్రశంసార్థమే అనితలంచుచున్నారు. కాని ఇది సరికాదు. రసతమత్వాదులు ప్రమాణాన్తర అప్రాప్తము లగుటవలన ఉద్గీథమును రసతమ దృష్టితో ఉపాసింపవలయునను విధియేఇది అని సిద్ధాన్తము.

440 సూ॥ భావశబ్దాచ్చ 3-4-22

అర్థ : భావశబ్దాత్ + చ = "ఉద్గీథం ఉపాసీత" అనునెడ గల విధి ప్రత్యయమువలనను (ఉద్గీథమునందు రసతమ దృష్టిని వర్ణించుట ప్రశంసార్థముకాదు. ఉపాసనార్థమే.)

వివ : "ఓ మిత్యేత దక్షర ముద్గీథ ముపాసీత" అనుచు ఉద్గీథోపాసనము విధింపబడినదిగదా. ఈ ఉపాసనము ఫలము నిచ్చుటలో అతిశయిత శక్తివంతము కావలయునన్నచో ఉద్గీథమును రసతమ దృష్టితో ఉపాసింపవలయును. కావున ఉద్గీథాదులయందును రస తమత్వ దృష్టి ప్రశంసార్థముకాదు. ఉపాసనార్థమే అని భావము.

### 111 పారిప్లవాధికరణము 3

ఉపనిషత్తులలోని ఆఖ్యాయికలు ఉపాసనార్థము చెప్పబడినవి.

441 సూ॥ పారిప్లవార్థా ఇతిచేన్న విశేషితత్వాత్ 3-4-23

అర్థ : పారిప్లవార్థాః = (ప్రతర్దనాదుల వృత్తాంతములు)

ప్రశంసార్థములు, ఇతిచేత్ = అనుచో, న = కాదు, విశేషితత్వాత్ = ప్రత్యేకించి చెప్పబడినందువలన.

వివ : “ప్రతర్దనో హవై దైవోదాసిః ఇంద్రస్య ప్రియంధామ ఉపజగామ” (కౌష. 3–1) దివోదాసుని కుమారుడు ప్రతర్దనుడు ఇంద్రుని ప్రియమైన ధామమును చేరెను” అనుచు కొన్ని ఉపాఖ్యానములు ఉపనిషతులయందు చూపట్టుచున్నవి. ఇవి పారిప్లవార్థములు అని కొందరు తలంచుచున్నారు. “పారిప్లవము” అనగా యజ్ఞమునందు ఋత్విక్కులు కావించు కథాస్తుతి అని యర్థము. దీనికి “ఆఖ్యానాని శంసన్తి” అని విధిగలదు. “మను ర్వైవస్వతో రాజా” ఇత్యాదిగ కొన్ని ఆఖ్యాకలు ఈ సందర్భమున ప్రత్యేకించి కర్మకాండలో చెప్పబడినవి కాని ప్రతర్దనాదుల వృత్తాంతములు ఉపాసనార్థముగ ఉపనిషత్తులలో వర్ణింపబడినవి. కావున ఇవి పారిప్లవార్థములు అనుట తగదు.

442 సూ॥ తథా చైక వాక్యోపబన్ధాత్ 3-4-24

అర్థ ॥ ఏకవాక్య + ఉపబన్ధాత్ + చ = ఏకవాక్యముగ నిబ్ధించుటవలనను, తథా=(ప్రతర్దనాది వృత్తాంతములు) ఉపాసనార్థములు.

వివ ॥ “తం మా మాయు రమృతం ఇత్యుపాస్వ” అ నన్ను ఆయావు అమృతము అని ఉపాసింపుము. ఇత్యాది విధివాక్యముతో ఏకవాక్యముగ చేరియున్నందువలన ప్రతర్దనాద్యాఖ్యాయికలు ఉపాసనార్థములే. కర్మకాండయందును “సోఽరోదీత్ య దరోదీత్ తత్ రుద్రస్య రుద్రత్వం” (యజు. 1-5-1) ఆ అగ్ని ఏడ్చెను. అట్లు ఏడ్చుటవలన అగ్ని రుద్రుడైనాడు. (రోదనాత్‌రుద్రః) ఇత్యాద్యాఖ్యానములు కర్మ విధ్యర్థములుగ చూపట్టుచున్నవిగదా.

వెండికథ : దేవతలు అసురులమీదికి దండెత్తిపోవుచు తమ సంపదను అగ్నికి స్వాధీనపరచిరి. వారు విజయమును సాధించి తిరిగి వచ్చునంతలో అగ్ని ఆ సంపదను తీసికొని పారిపోయెను. దేవతలు అగ్నిని ఎట్లో వెదకి పట్టుకొనిరి. అంత అగ్ని ఏడ్చినాడు. కావుననే అతనికి రుద్రుడు (ఏడ్చినవాడు) అనునామము ఏర్పడినది. ఇట్లే అతని కంటినుండి స్రవించిన కన్నీరు వెండియైనది. కావున వెండిని యజ్ఞాది శుభకార్యములయందు ఒసంగరాదు. (తస్మాత్ బర్హిషి రజతం న దేయం) అను ఆచారమేర్పడినది. నేటికిని వెండినాణెమును ఇచ్చునపుడు దానితోబాటు రాగి కాసునికూడ ఇచ్చు ఆచారముగలదు.

### 112 అగ్నీన్ధనాద్యధికరణము 4

బ్రహ్మచారి వానప్రస్థ సన్న్యాస్యులకు అగ్న్యాధానాది కర్మలు లేకున్నను వారు బ్రహ్మమును ఉపాసింపవచ్చును.

443 సూ॥ అత ఏవ చాగ్నీన్ధనా ద్యనపేక్షా. 3-4-25

అర్థ : అతః + ఏవ = ఊర్ధ్వ రేతోస్కులకును విద్యాధికారము గలదని తెలుపు శ్రుతివలననే, అగ్ని + ఇన్ధన + అనపేక్షా చ = వారికి అగ్న్యాధానాదుల ఆవశ్యకత లేకపోవుటయు సిద్ధించుచున్నది.

వివ : స్త్రీ సంబంధములేని బ్రహ్మచర్య వానప్రస్థ సన్న్యాసాశ్రమములవారును "యు దిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి" (కఠ) ఏ పరతత్త్వమును పొందగోరి బ్రహ్మచర్యమును చరింతురో "ఏతమేవ ప్రవ్రాజినో లోకమిచ్ఛన్తః ప్రవ్రజన్తి" ఈ పరబ్రహ్మమును పొందగోరి వీతరాగులు సన్యసించుచున్నారు. ఇత్యాది శ్రుతివాక్యము బ్రహ్మవిద్యార్హులని బోధించుచున్నవి. కావున ఈ ఆశ్రమముల వారు అగ్న్యాధానాదికర్మలను అనుష్ఠింపనవసరములేదు. ఆయాఆశ్రయముల

యందు విహితములైన కర్మలను అనుష్ఠించుచు పరబ్రహ్మము నుపాసించవచ్చును.

### 113 సర్వాపేక్షాధికరణము 5

ఉపాసకులు బ్రహ్మవిద్యాంగముగ ఆయా ఆశ్రమ కర్మలను అనుష్ఠించవలయును.

**444 సూ॥ సర్వాపేక్షా చ యజ్ఞాది శ్రుతే రశ్వవత్ 3–4–26**

**అర్థ :** యజ్ఞ + ఆదిశ్రుతేః = "యజ్ఞేన దానేన" ఇత్యాది శ్రుతిని బట్టి, సర్వ + అపేక్షా + చ = ఆయా ఆశ్రమ కర్మలనన్నింటిని అపేక్షించునట్టిది (బ్రహ్మవిద్య), అశ్వవత్ = గుఱ్ఱమువలెనే

వివ : ప్రయాణసాధనమైన అశ్వమునకు కళ్ళెము మొదలైన ఉపకరణములు ఎట్లు ఆవశ్యకములో అట్లే బ్రహ్మవిద్యకు ఆయా ఆశ్రమకర్మలు అవశ్యకములైయున్నవి.

### 114 శమదమాద్యధికరణము 6

బ్రహ్మోపాసకుడు శమదమాదిగుణములు కలిగియుండవలయును

**445 సూ॥ శమదమా ద్యుపేత స్స్యా త్తథాఽపితు తద్విధే స్త దఙ్గతయా తేషామ ప్యవశ్యానుష్ఠేయత్వాత్ 3–4–27**

**అర్థ :** తథాపి తు = గృహస్థుడు కర్మలను అచరించుచున్నను శమదమ + ఆది + ఉపేతః = శమ దమాది గుణములు కలవాడుగ, స్యాత్ = కావలయును తత్ + విధేః = ఆ శమదమాదులను బ్రహ్మవిద్యాంగముగ విధింపబడినందువలన, తేషాం + అపి = ఆ శమదమాదు

అను (అకును), అవశ్య + అనుష్టేయత్వాత్ = అవశ్యము అనుష్టింప వలసియున్నందువలన

వివ : గృహస్థుడు కర్మలనాచరించుచు శమదమాదిగుణము లనుకూడ కలిగియుండవలయును. "శాన్తోదాన్త ఉపరత స్తితిక్షుః సమాహితో భూత్వా ఆత్మన్యేవ ఆత్మానం పశ్యేత్" (బృ. 6-4-23) శాన్తుడు దాన్తుడు విషయభోగ విముక్తుడు సహనశీలి ఏకాగ్రతచిత్తుడునై తనయందు పరమాత్మను దర్శింపవలయును అను ఆత్మాగుణావశ్య కతా విద్యోదయక శ్రుతి బ్రహ్మవిద్యాంగముగ శమదమాదిగుణము లను కలిగియుండవలయునని బోధించుచున్నది. ధర్మసూత్రకారుడు గౌతమమహర్షి కర్మలకంటెను ఆత్మగుణములకు ప్రాముఖ్యము నిచ్చి నాడు. (శమము=బహిరింద్రియ నిగ్రహము దమము=అంతరింద్రియ నిగ్రహము.)

### 115 సర్వాన్నానుమత్యధికరణము 7

ఆపత్సమయమునందు తప్ప అభక్ష్య భక్షణము తగదు.

446 సూ॥ సర్వాన్నాను మతిశ్చ ప్రాణాత్యయే తద్దర్శనాత్ 3–4–28

అర్థ : ప్రాణ + అత్యయే = ప్రాణావసాన సమయమునందు (మాత్రమే), సర్వ + అన్న + అనుమతిః = సర్వాన్న భక్షణానుమతి ఇవ్వబడినది, తత్ + దర్శనాత్ = అట్లుచూపట్టువలన

వివ : "న హ వా ఏవంవిధి కించన అనన్నం భవతి", ప్రాణ విద్యోపాసకునకు అభక్ష్యమైనది ఏదియులేదు" (ఛా. 5–2–1)అనుచో సర్వాన్నభక్షణానుమతి చూపట్టుచున్నది. కాని ప్రాణము పోవునంతటి ఆపత్సమయమునందు మాత్రమే ఈ సర్వాన్న భక్షణానుమతి అని

గ్రహింపవలయును. తక్కిన సమయములందు పరిశుద్ధ ఆహార నియమములను ఎంతటి బ్రహ్మవేత్తయైనను పాటించి తీరవలసినదే ఉషస్తి వృత్తాంతమును చూడుడు.

మటచీహతము అను గ్రామమున ఉషస్తి అను ఒక బ్రహ్మవేత్త యుండెను. అతడు అనావృష్టి పీడితమైన మటచీహత గ్రామమును వదలి ఇభ్యగ్రామమును చేరెను. అచటకూడ ఆహారము దొరకనందున ఏనుగులకై ఉలవలను ఉడకబెట్టుచుండిన ఏనుగుల కావరిని చూచి ఆ ఉడుకుచున్న ఉలవలను తనకిమ్మని కోరినాడు. అట్లే అతడు ఉషస్తికి ఆ ఉలవలను ఇచ్చినాడు. ఉషస్తి ఆ ఉలవలలో సగము తిని మిగిలిన సగమును తన భార్యకు ఇచ్చినాడు. ఆమె దానిని దాచి యుంచినది. ఏనుగులకావరి ఉషస్తికి త్రాగుటకై నీటిని అందించి నాడు. కాని అది ఎంగిలినీరని దానిని ఉషస్తి త్రాగలేదు. మరుసటి దినమునను అతనికి ఇట్టి దుస్థితి యేర్పడినది. అపుడు భార్య దాచి యుంచిన పర్యుషిత-ఉచ్ఛిష్టములైన ఆ ఉలవలనే తిని ప్రాణము లను నిలుపుకొనినాడు. ఈవృత్తాంతమువలన ప్రాణాపాయదశయందు మాత్రమే సర్వాన్నానుమతి అని గ్రహింపవలయును.

**447 సూ॥ అబాధాచ్చ 3-4 29**

అర్థ : అబాధాత్ + చ = (ఆహార శుద్ధిని పాటించుటలో) బాధ లేనందువలనను (సర్వాన్నానుమతి ఆపత్సమయమునందే)

వివ : "ఆహార శుద్ధే సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధే ధ్రువాస్మృతిః" (ఛా.7-26-2) ఆహారశుద్ధినిబట్టి సత్త్వగుణశుద్ధి ఏర్పడుచున్నది. సత్త్వ గుణశుద్ధినిబట్టి ధ్రువానుస్మృతి (నిశ్చలధ్యానము) ఏర్పడుచున్నది

అను ప్రమాణమునుబట్టి ఉపాసకులెల్లరు ఆహారశుద్ధిని తప్పక పాటింప వలయును. దీనికి బాధకప్రమాణములేదుకదా.

448 సూ॥ అపి స్మర్యతే 3-4.30

అర్థ : స్మర్యతే + అపి = (ఈ విషయము) స్మృతియందును చెప్పబడినది.

వివ : "ప్రాణ సంశయ మాపన్నః యోఽన్న మత్తి యత స్తతః లిప్యతే న స పాపేన పద్మపత్ర మివాఽంభసా" ప్రాణము నిలుచునో నిలవదో అను పరిస్థితులలో ఏదో ఒక అన్నమును భుజించినను, తామరాకుకు నీటిబొట్లు అంటని రీతిని, అతనికి ఆ పాపము అంటదు అను స్మృతి వాక్యము సైతము ప్రాణోపాయ దశయందు మాత్రమే సర్వాన్నానుమతిని తెలుపుటవలనను బ్రహ్మవేత్తలు ఆహారశుద్ధిని పాటింప వలయును. లేనిచో పతనము తప్పదు.

449 సూ॥ శబ్దశ్చాఽతోకామకారే 3-4-31

అర్థ : అతః = ఇందువలన, అకామకారే = "అభక్ష్యభక్షణము చేయరాదు" అను విషయమున, శ్రుతిః + చ = శ్రుతియు కలదు.

వివ : "తస్మాత్ బ్రాహ్మణః సురాం న పిబేత్" కావున బ్రాహ్మణుడు సురాపానము చేయరాదు" అనుచు శ్రుతియు అభక్ష్య భక్షణమునునిరూపించుచున్నది. కావున సర్వాన్నాఽనుమతి ప్రాణా పాయదశయందు మాత్రమే అని సిద్ధించుచున్నది.

116 విహితత్వాధికరణము 8

అగ్నిహోత్రాదులు ఆశ్రమాంగములు ఉపాసనాంగములు నగుచున్నవి.

450 సూ॥ విహితత్వాచ్చాశ్రమ కర్మాఽపి 3-4-32

అర్థ : విహితత్వాత్ = విధింపబడినందువలన, ఆశ్రమ కర్మ + అపి = (అగ్నిహోత్రాదులు) ఆశ్రమాంగములైన కర్మలుగను అగు చున్నవి.

వివ : "యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి" జీవించియున్నంత కాలము అగ్నిహోత్రమును ఉపాసింపవలయును"అను శ్రుతివచనము వలన గృహస్థుడు జీవితాంతము అగ్నిహోత్రాదులను ఉపాసింప వలయునని తెలియుచున్నది. కావున గృహస్థుడు బ్రహ్మవేత్త అయి నను కాకున్నను అగ్నిహోత్రాద్యుపాసన అతనికి అవశ్య కర్తవ్యము. బ్రహ్మవేత్తయైన గృహస్థుడు ఫలాపేక్ష లేక అగ్నిహోత్రమును ఉపా సించినచో అది బ్రహ్మవిద్యాంగమై యుండును. బ్రహ్మవేత్త కాని గృహస్థుడు ఫలాపేక్షతో ఉపాసించినచో అది స్వర్గాది ఫలసాధకము కాగలదు, కావున ఈ కర్మలకు ఆశ్రమాంగత్వము కర్మాంగత్వము సిద్ధించుచున్నది.

451 సూ॥ సహకారిత్వేన చ 3-4-33

అర్థ : సహకారిత్వేన చ = (బ్రహ్మవిద్యకు) సహకరించునవగుటచేతను యజ్ఞాదికర్మలు (బ్రహ్మవేత్తలచేతను) అనుష్ఠేయములు.

వివ : "త మేతం వేదాఽనువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి, యజ్ఞేన దానేన తపసాఽనా శకేనా" (బృ. 6-4-22) "బ్రాహ్మణులు ఆయా పరమాత్మను వేదాధ్యయన యజ్ఞ దాన తపస్సులద్వారా తెలిసి కొనగోరుదురు" అను శ్రుతివచనము బ్రహ్మవేదనమునకు (జ్ఞానమునకు)

సహకారులనుగ యజ్ఞాదులనువిధించుటవలన బ్రహ్మవేత్తయు యజ్ఞాదు లను విద్యాసహకారులనుగ అనుష్ఠింపవలయును.

452 సూ॥ సర్వథాఽపి త ఏవోభయలిఙ్గాత్ 3-4-34

అర్థ : సర్వథా + అపి = ఆశ్రమాంగములైనను విద్యాంగము లైనను, ఉభయలింగాత్ = ఉభయమునకు శ్రుతిప్రమాణము ఉండుట వలన, తే + ఏవ = యజ్ఞాదులు అవే.

వివ : ఆశ్రమాంగముగను విద్యాంగముగను అనుష్ఠింపబడు యజ్ఞాదులలో స్వరూపభేదములేదు. ఏకరూపభేదములైన యజ్ఞాదులే ఉభయత్ర ప్రత్యభిజ్ఞాతములు అగుచున్నవిగదా. కావున వీనికి విని యోగభేదమేగాని స్వరూపభేదములేదని భావము.

453 సూ॥ అనభిభవం చ దర్శయతి 3-4-35

అర్థ ; అనభిభవం చ=విద్యోత్పత్తికి ప్రతిబన్ధకములేకుండుటను కూడ, దర్శయతి = శ్రుతి బోధించుచున్నది.

వివ : "ధర్మేణ పాపమపనుదతి" (తై.నా. 6-50) "యజ్ఞాది ధర్మానుష్ఠానముచేత పాపమును తొలగించుకొనుచున్నాడు" అనుచు శ్రుతి యజ్ఞయాగాదులు బ్రహ్మజ్ఞానోత్పత్తికి ప్రతిబన్ధకములైన పాపము లను తొలగించునట్లు తెలుపుచున్నది. కావున కేవల గృహస్థులును ముముక్షు గృహస్థులును యజ్ఞాద్యనుష్టానము గావింపవలయును.

117 విధురాధికరణము 9

ఆశ్రమ రహితులకును బ్రహ్మ విద్యాధికారము గలదు.

454 సూ॥ అన్తరా చాఽపితు దృష్టేః 3-4-36

అర్థ : అన్తరా + చ + అపి తు=ఆశ్రమరహితులకును, (బ్రహ్మ విద్యయందు అధికారముగలదు.) తత్ + దృష్టేః = అట్లు శ్రుతిద్వారా తెలియుటవలన.

వివ : బ్రహ్మచర్యాశ్రమమును పూర్తి చేసికొని గృహస్థాశ్రమమును స్వీకరింపక ఉండువారును, భార్య చనిపోయిన పిదప మరల గృహస్థాశ్రమమునుగాని సన్న్యాసాశ్రమమునుగాని స్వీకరింపక ఉండువారును ఆశ్రమరహితులని చెప్పబడుచున్నారు. ఇట్టి వారికిని బ్రహ్మవిద్యయందు అధికారముగలదు. (రైక్వమహర్షి బ్రహ్మచర్య వ్రతమును పూర్తి చేసికొని వివాహమునకై ప్రతీక్షించుచుండు దశ యందును సంవర్గవిద్యోపాసకుడుగ ఉపనిషత్తులలో వర్ణింపబడినాడు గదా. ఇట్టివారికి సర్వాశ్రమ సాధారణములైన, జపోపవాస ఆరాధ నాదికర్మలు విద్యాసహకారులగును.

455 సూ॥ అపి స్మర్యతే 3-4-37

అర్థ : స్మర్యతే + అపి=స్మృతియందును అట్లు చెప్పబడినది.

వివ : "జప్యేనాఽపిచ సంసిద్ధ్యేత్ బ్రాహ్మణోనాఽత్ర సంశయః" (మను. స్మృ. 2-87) బ్రాహ్మణుడు జపముచేతనైనను సిద్ధి నందును. సందేహములేదు. అనుస్మృతియు ఈ అర్థమును స్పష్ట మొనర్చుచున్నది.

456 సూ॥ విశేషానుగ్రహశ్చ 3-4-38

అర్థ : విశేష + అనుగ్రహః + చ = (ఏదియో ఒకఆశ్రమము నకు మాత్రమే సంబంధించిన పని.) ధర్మవిశేషములచేతను విద్యకు సహకారము లభించుచున్నది.

వివ : "తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా విద్యయా ఆత్మాన మన్విచేత్" (ప్రశ్న 1-10) "తపస్సు బ్రహ్మచర్యము శ్రద్ధ విద్య వీనిచే ఆత్మను తెలిసికొనవలయును. అను శ్రుతివచనముకూడ సర్వాశ్రమ సాధారణములైన తపస్సు మొదలగునవి విద్యకు సహకరించినట్లు తెలుపుచున్నది.

457 సూ॥ అత స్త్వితర జ్జ్యాయో లిఙ్గాచ్చ 3-4-39

అర్థ : అతః = అనాశ్రమిత్వముకంటెను, ఇతరత్=ఆశ్రమిత్వము జ్యాయః = శ్రేష్ఠమైనది, లింగాత్=స్మృతివలన.

వివ : "అనాశ్రమీ న తిష్ఠేత్తు దిన మేక మపి ద్విజః" (దక్ష స్మృ.1-16) "బ్రాహ్మణుడు అనాశ్రమిగా ఒక్కరోజుకూడ" అనుస్మృతి వచనమువలన అనాశ్రమిగా ఉండుటకంటె ఆశ్రమిగా ఉండుటయే శ్రేయస్కరము. అనాశ్రమికిని బ్రహ్మవిద్యాధికారమున్నను అతడు ఆశ్రమమును స్వీకరించుట మేలు అని భావము.

118 తద్భూతాధికరణము 10

భ్రష్టులైన నైష్ఠిక బ్రహ్మచారి సన్న్యాసి మున్నగు వారికి బ్రహ్మవిద్యాధికారములేదు.

458 సూ॥ తద్భూతస్య తు నాఽతద్భావో జైమినే రపి నియా మాత్ర ద్రూపాభావేభ్యః 3-4-40

అర్థ : తత్ + భూతస్య=నైష్ఠిక బ్రహ్మచర్యా ద్యాశ్రమ నిష్ఠునికి, అతత్ + భావః + తు = ఆశ్రమరాహిత్యము (భ్రష్టత) న = తగదు తత్ + రూప + అభావేభ్యః= (నైష్ఠిక బ్రహ్మచారి మున్నగువారిని)

అట్టి ఆశ్రమ ధర్మ త్యాగమునుండి (శాస్త్రము) నివారించుచున్నందు వలన, జైమినేః + అపి = జైమిని మహర్షికిని (ఇది అభిమతమే)

వివ : "బ్రహ్మచార్యాచార్యకులే వాసీ తృతీయః అత్యంతం ఆత్మానం ఆచార్యకులే అవసాదయన్" (ఛా.2-23) మూడవ బ్రహ్మచారి (నైష్ఠిక బ్రహ్మచారి) ఆచార్యగృహమున నివసించుచు వేదాధ్యయన గురు శుశ్రూదులచేత జీవితాన్తము శరీరమును కృశింపజేసికొనవల యును అనియు, "అరణ్యమియాత్ తతో న పునరేయాత్" "వాన ప్రస్థుడు అరణ్యమునకు వెళ్ళవలయును. అందుండి మరలి రారాదు" అనియు, సన్న్యస్యాఽగ్నిం న పునరావర్తయేత్" (యజు) అగ్నిని త్యజించి మరల స్వీకరింపరాదు అనగా సన్యాసి తిరిగి గృహస్థుడు కారాదు' అనియు శ్రుతివచనము నైష్టిక బ్రహ్మచారి మున్నగువారికి బ్రహ్మచర్యలోపమును అనుమతించుటలేదు. కావున ఈ ఆశ్రమముల నుండి భ్రష్టులై ప్రాయశ్చిత్తానర్హులైన వారికి బ్రహ్మవిద్యాధికారము లేదు. జైమినిమహర్షియు ఇదే అభిప్రాయమును కలిగియున్నారు.

459 సూ॥ న చాధికారిక మపి పతనానుమానా త్తదయోగాత్ 3-4-41

అర్థ : ఆధికారికం + అపి = (భ్రష్టులైన నైష్టిక బ్రహ్మచారి మున్నగువారికి) స్వాశ్రమలక్షణమున చెప్పబడిన ప్రాయశ్చిత్తమున్ను న = లేదు, పతన + అనుమానాత్ = అట్టివారు పతితులు అని తెలుపు నట్టి స్మృతివలన, తత్ + అయోగాత్ = అట్టివారికి ప్రాయశ్చిత్తము సంభవింపనందువలన.

వివ : నైష్ఠికా ద్యాశ్రమ భ్రష్టులకుకర్మాధికారమును కలిగించు

ప్రాయశ్చిత్తము సైతము చూపబడదు. ఉపకుర్వాణ బ్రహ్మచారికి స్త్రీ సాంగత్య దోషము ఏర్పడినచో ప్రాయశ్చిత్తము శాస్త్రమున చెప్పబడి నది. కాని "ఆరూఢో నైష్ఠికం ధర్మం యస్తు ప్రచ్యవతే ద్విజ ప్రాయ శ్చిత్తం న పశ్యామి యేన శుధ్యేత్ స ఆత్మ హా" (ఆగ్నేయపు. 165-23) నైష్ఠిక బ్రహ్మచారి పతితుడైనచో అతనిని పరిశుద్ధుని గావించు ప్రాయశ్చిత్తము తెలియకున్నది" అనుచు స్మృతి భ్రష్టులైన నైష్ఠికాదు లకు ప్రాయశ్చిత్తము లేదనుచున్నదిగదా. కావున పతితులైన నైష్ఠికాదులకు బ్రహ్మవిద్యాధికారములేదు.

460 సూ॥ ఉపపూర్వ మపీ త్యేకే భావ మశనవత్తదుక్తమ్ 3-4-42

అర్థ : ఏకే = కొందరు, ఉపపూర్వం = (నైష్ఠికాదుల భ్రష్టత) ఉపపాతకము, ఇతి=అని తలంచి అశనవత్ = సురాపానాదులకువలె, భావం=ప్రాయశ్చిత్త సద్భావమును (అంగీకరించుచున్నారు.) తత్= ఆ విషయము, ఉక్తం=(స్మృతికర్తలచే) చెప్పబడినది.

వివ : మధ్యపానాదులకు ప్రాయశ్చిత్తము ఉన్నట్లే నైష్ఠికా దుల బ్రహ్మచర్య లోపమునకును ప్రాయశ్చిత్తము కలదని "ఉత్తరే షాం చ ఏత దవిరోధి" (గౌత. ధర్మ.సూ. 1. ప్ర. 3 అధ్యా. 4 సూ.) "నైష్ఠిక వానప్రస్థ సన్న్యాసులకును ఈ ప్రాయశ్చిత్తము విరోధి కాదు అనగా సంభవించును అనుచు గౌతమ మహర్షి మున్నగు వారు భావించుచున్నారు. కావున నైష్ఠికాదులు బ్రహ్మచర్య భ్రష్టులైనచో మధ్యపానాదులను గావించినపుడువలె ప్రాయశ్చిత్తముచేసికొని తిరిగి ప్రాయశ్చిత్తము చేసికొని తిరిగి కర్మధికారులు కావచ్చును ఈపక్షము

నందు నైష్ఠికాదుల బ్రహ్మచర్యలోపము ఉపపాతకమగునుగాని మహా పాతకము కాజాలదు.

461 సూ॥ బహి స్తూభయథాఒపిస్మృతే రాచారాచ్చ 3-4-43

అర్థ : ఉభయథా + అపి = బ్రహ్మచర్య లోపము మహా పాతకమైనను ఉపపాతకమైనను, బహిః = (అట్టివారు) కర్మాధికార ర్భూమలే, స్మృతేః = స్మృతివలనను, ఆచారాత్ + చ = శిష్టాచారము వలనను.

వివ : నైష్ఠికాదుల బ్రహ్మచర్యలోపము ఉపపాతకమైనను మహాపాతకమైనను పతితులైన నైష్ఠికాదులు బ్రహ్మవిద్యాధికారులు కాజాలరు. "ఆరోఢో నైష్ఠికం ధర్మం" అను స్మృతివచనము ఇట్టివారికి ప్రాయశ్చిత్తములేదని తెలిసినదికదా శిష్టాచారము సైతము ఇట్లే చూపట్టుచున్నది. కావున భ్రష్ట నైష్ఠికాదులు బ్రహ్మవిద్యాధికార బహి ర్భూతులని సిద్ధాన్తము.

119 స్వామ్యధికరణము 11
కర్మాంగమైన ఉద్గీథా ద్యుపాసనలను ఋత్విజుడే
చేయవలయును.

462 సూ॥ స్వామినః ఫలశ్రుతే రిత్యాత్రేయః 3-4-44

అర్థ : స్వామినః = (కర్మాంగములైన ఉద్గీథాద్యుపాసనల కర్తృత్వము) యజమానునికే. ఫలశ్రుతేః = ఫలశ్రవణమునుబట్టి. ఇతి= అని, ఆత్రేయః = ఆత్రేయమహర్షి (తలంచుచున్నారు.)

వివ : యజ్ఞమునందు ఉద్గీథాద్యుపాసనమును యాజమానుడే చేయవలయును. "యదేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరం భవతి" అనిచెప్పబడినవీర్యవత్తరత్వరూపఫలమునకు భోక్త యజమానుడే

గదా. ఫలభోక్తయేగదా ఫలానుగుణ ప్రయత్నమును గావించుమ అని ఆత్రేయ మహర్షి ఆశయము.

**463 సూ॥ ఆర్త్విజ్య మిత్యౌడులోమి స్తస్మై హి పరిక్రియతే 3-4-45**

**అర్థ :** ఆర్త్విజ్యం = ఋత్విక్కులు చేయదగినది, ఇతి = అని. ఔడులోమిః = ఔడులోమి అను మహర్షి (తలంచుచున్నారు) తస్మైహి= అందుకొరకేగదా, పరిక్రియతే = (ఋత్విక్కు) వరింపబడుచున్నాడు.

వివ : యజ్ఞమునందు వీర్యవత్తరత్వ సిద్ధికై చేయబడు ఉద్గీథాద్యుపాసనలను ఋత్విజుడే చేయవలయునుగాని యజమానుడు కాడు. యజ్ఞఫలభోక్త యజమానుడే అయినను యజ్ఞానుష్ఠాత ఋత్విజుడేగదా. అందులకేగదా ఋత్విక్కును వరించినది అని ఔడులోమి మహర్షి ఆశయము. ఇదియే సిద్ధాన్తము.

**120 సహకార్యన్తరవిద్యధికరణమ్ 12**

యజ్ఞదాన-శ్రవణ మననాదులవలె మౌనమున్ను బ్రహ్మవిద్యకు సహకారి కారణము.

**464 సూ॥ సహకార్యన్తర విధిః పక్షేణ తృతీయం తద్వతో విధ్యాదివత్ 3-4-46**

**అర్థ :** తద్వతః = బ్రహ్మవిద్యావంతునకు, విధి + ఆదివత్ = యజ్ఞదానాది ఆశ్రమధర్మముల విధివలె, తృతీయం = మూడవదియగు మౌనమున్ను, సహకారి + అంతరవిధిః = మరియొక సహకారి కారణముగ విధింపబడుచున్నది. పక్షేణ = ప్రసిద్ధిచే (వ్యాసాదులయెడల ముని శబ్ద ప్రయోగ) ప్రసిద్ధిచేత.

వివ : బ్రహ్మవిద్యకు యజ్ఞదానాదులు శ్రవణమననాదులు సహకారి కారణములు వీనివలె మౌనమును మూడవ సహకారి కారణముగ విధింపబడినది. "తమేతం వేదానువచనేన బ్రాహ్మణాః వివిదిషన్తి, యజ్ఞేన దానేన తపసాదాశకేన" "ఆత్మావారే ద్రష్టవ్యశ్శ్రోతవ్యో మన్తవ్యోగ నిదిధ్యాసితవ్యః" ఇత్యాది వచనములచే యజ్ఞ దాన-శ్రవణమననాదులు విధింపబడిన రీతిని, "తస్మాద్బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్,బాల్యంచ పాండిత్యం చ నిర్విద్యఅథమునిం" (బృ. 5-5) బ్రహ్మవేత్త పాండిత్యమును (బ్రహ్మజ్ఞానమును పొంది బాలభావముతో (నిరాడంబరభావముతో) నుండగోరవలయును. ఇట్లు పాండిత్యమును బాల్యమును పొందిన బ్రహ్మవేత్త ముని (మౌనశీలి) కావలయును"అనుశ్రుతి బ్రహ్మవిద్యకు సహకారికారణముగ మౌనమును విధించుచున్నదికదా. వ్యాసాదులను మునులు అని వ్యవహరించుటయు ప్రసిద్ధమే. కావున బ్రహ్మవిద్యకు మౌనము మూడవ సహకారి కారణమగుచున్నది.

465 సూ॥ కృత్స్నభావాత్తు గృహిణోపసంహారః 3-4-48

అర్థ : గృహిణా=గృహస్థాశ్రమముతో, ఉపసంహార =(బ్రహ్మవిద్యను) ఉపసంహరించుట, తృత్స్న భావాత్ = అన్ని ఆశ్రమముల యందును బ్రహ్మవిద్య సంభవమగుటవలన.

వివ : అన్ని ఆశ్రమములవారును బ్రహ్మవిద్యార్హులగుటచేత "అభిసమావృత్య కుటుంబే శుచౌదేశే" అని ప్రారంభించి "సఖిత్వేం వర్తయన్ యావ దాయుషం బ్రహ్మలోక మభిసంపద్యత్తే" (ఛా. 8-15-1) గృహస్థుడైన ఆ బ్రహ్మవేత్త ఈ విధముగ జీవితాంతము

గడుపుచు చివరికి బ్రహ్మలోకమును పొందును అనుచు ఉపనిషత్తు బ్రహ్మవిద్యా ప్రస్తావమును గృహస్థునిగూర్చి తెలుపుచు ఉపసంహరించి నది. కావున బ్రహ్మవిద్యకు ఆశ్రమభేదము లేదు.

466 సూ॥ మౌనవ దితరేషా మప్యుపదేశాత్ 3–4–48

అర్థ : మౌనవత్ = మౌనమునకువలె, ఇతరేషాం + అపి = ఇతర ఆశ్రమ ధర్మములకును, పరిగ్రాహ్యత సిద్ధించుచున్నది. ఉప దేశాత్ = ఉపదేశించియున్నందువలన.

వివ : "అథ మునిః" (బృ. 5-5) అనియు "అథ భిక్షాచర్యం చరతి" (బృ. 5-5) అనియు మౌనమును భిక్షాచర్యమును విధించుట ఇతర ఆశ్రమ ధర్మములకును ఉపలక్షణము. "యజ్ఞేనదానేన తపసాఽ నాశకేన" అనుచు యజ్ఞదానాదులును బ్రహ్మవిద్యకు లింగములుగ ఉపదేశింపబడినవిగదా.

12 ॥ అనావిష్కారాధికరణము 13

బ్రహ్మవేత్త తన మహిమలను ప్రదర్శింపరాదు

467 సూ॥ అనావిష్కుర్వ న్నన్వయాత్ 3-4-49

అర్థ : అనావిష్కుర్వన్ = బ్రహ్మవేత్త తన మహిమాదులను ప్రదర్శింపనివాడగుచు ఉండవలయును, అన్వయాత్ = (అనావిష్కారాదులచే బ్రహ్మవిద్యయందు) సంబంధము ఉండుటవలన.

వివ : "పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్" (బృ. 5-5) బ్రహ్మవేత్త బ్రహ్మజ్ఞానమును సంపాదించిన పిదప బాలభావముతో నుండవలయును. అను శ్రుతివాక్యమున "బాలభావము" అనగా డం బాది రాహిత్యము అని మాత్రమే అర్థము. బాల్యావస్థను పొందుట

అనిగాని బాలచేష్టితములను చేయుట అనిగాని అర్థముకాదు. మహిమను ప్రదర్శింపక ఏమియు తెలియని బాలునివలె ఉండవలయునని తాత్పర్యము.

122 ఐహికాధికరణము 14

ప్రతిబన్ధకములు లేనిచో ఉపాసనలు ఐహికఫలములను శీఘ్రముగ నొసంగును.

468 సూ॥ ఐహిక మప్రస్తుత ప్రతిబన్ధే తద్దర్శనాత్ 3-4-50

అర్థ : ఐహికం = ఇహలోకసుఖముల నిచ్చు ఉపాసనము, అప్రస్తుత ప్రతిబన్ధే=ప్రతిబన్ధకములేనిపక్షమున, (శీఘ్రఫలప్రదమగును) తత్ + దర్శనాత్ = అట్లు శ్రుతి చెప్పుటవలన

అర్థ : ఐహికఫలములను ఒసంగునట్టి ఉపాసనములు అనుష్ఠాన సమనన్తరమే ఫలము నొసంగునను నియమములేదు. ప్రబల ప్రతిబన్ధకములు లేనపుడే అవి ఫలప్రదాన సమర్థములగును. "యదేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరం భవతి" (ఛా.1-1-10) ఉద్గీథోపాసనా పూర్వకముగ జేయు కర్మయే ఫలప్రదాన సమర్థమగును అని శ్రుతియు ఈ విషయమును తెలుపుచున్నది గదా. ఫలప్రదము కావలయునన్నచో ఉద్గీథోపాసనద్వారా ప్రతిబన్ధక నిరాసము కలుగవలయును.

123 ముక్తిఫలానియమాధికరణము 15

బ్రహ్మోపాసనములును ప్రతిబన్ధకములు లేనపుడే శీఘ్ర ఫలప్రదములగును.

469 సూ॥ ఏవం ముక్తిఫలాऽనియమ స్తదవస్థావధృతే స్తదవ స్థావధృతేః 3-4-51

అర్థ : ఏవం = ఇట్లే, ముక్తిఫల + అనియమః = ముక్తిరూప ఫలము నిచ్చు బ్రహ్మవిద్యయు శీఘ్రముగ ఫలము నిచ్చునను నియమములేదు. తత్ + అవస్థా + అవధృతేః = ప్రతిబన్ధకము లేనపుడే ఫలసిద్ధి కలుగును అను నిశ్చయమువలన.

వివ : "బ్రహ్మవిద్యలు సైతము ప్రబల ప్రతిబన్ధములు తొలగినపుడే ముక్తిరూప ఫలము నొసంగును. "తదవస్థాఽవధృతేః" అను పదమును రెండు పర్యాయములు చెప్పుట అధ్యాయ పరిసమాప్తిని సూచించును.

తృతీయాధ్యాయ చతుర్థపాదము
సమాప్తము.
తృతీయాధ్యాయము సమాప్తము

తృతీయాధ్యాయ చతుర్థపాద సంగ్రహశ్లోకము

శ్లో॥ విద్యా కర్మాఽంగికాస్యా ద్రసతమ ముఖధీ
శ్చోదితా ప్రాప్త్యభావాత్
ఆఖ్యానానాం చ విద్యావిధి సవిధ జుషాం
తద్విధానార్థతైవ।
విద్యా సాఽంగోర్ధ్వరేతస్స్వపి భవతి హి
సుయజ్ఞాది దానా ద్యపేక్షా
శాన్త్యాద్యర్హో గృహస్థోఽప్యవిపది
విదుషోఽప్యన్న శుద్ధైవ శుద్ధిః॥

శ్లో॥ ఏకా విద్యాశ్రమార్థం విధుర మపి యుతం
విద్యయాహు స్స్వతం న
క్రత్వంగే దృష్టి బుద్ధి శ్రుతి రథ మునితా
చోదితా ధ్యానసిద్ధ్యై।

బాల్యం శక్త్యాది గుప్తి ర్బలవ దభిహతేః
కర్మభి ర్నాఽన్య విద్యా
తద్వ న్మోక్షార్థ విద్యా స్వజనక సుకృతై
రిత్యువాచాఽత్రు పాదే॥

తా : పురుషార్థాధికరణమున ఉపాసనాంగముగ కర్మల నాచరింపవలయునని, స్తుతిమాత్రాధికరణమున ఉద్గీథాదులయందు రసతమత్వాది దృష్టి గావింపవలయునని, పారిప్లవాధికరణమున ఉపనిషత్తులలోని ప్రతర్దనాదుల ఆఖ్యాయికలు ఉపాసనావిధికై చెప్పబడినవని, అగ్నీన్ధనాధికరణమున ఊర్ధ్వరేతస్కులైన బ్రహ్మచారి ప్రస్థ పరిప్రాజలకును తత్త దాశ్రయోచిత కర్మలను అంగముగా గలిగిన ఉపాసనకలదని, సర్వాపేక్షాధికరణమున గృహస్థుల ఉపాసనకు యజ్ఞాదులు అంగములని, శమ దమాద్యధికరణమున గృహస్థునకును శమాదమాది గుణములు అవశ్యకములని, సర్వాన్నానుమ త్యధికరణమున ఉపాసకుడు ఆపన్నమయమునందు తప్ప తక్కిన సమయములయందు పరిశుద్ధాన్నమునే భుజింపవలయునని విహితత్వాధికరణమున ఉపాసకుడు అనుష్ఠించు యజ్ఞాది కర్మలు ఆశ్రమాంగములు ఉపాసనాంగములు నగునని, విధురాధికరణమున విధురాదులకును (ఆశ్రమరహితులకును) విద్యాధికారము గలదని. తద్భూతాధికరణమున భ్రష్టులైన నైష్ఠిక బ్రహ్మచారి మున్నగు వారికి విద్యాధికారములేదని, స్వామ్యధికరణమున కర్మాంగములైన ఉద్గీథా ద్యుపాసనములను ఋత్విక్కులే చేయవలయు ననియు, సహకార్యన్తర విధ్యధికరణమున ధ్యానసిద్ధికి మౌనము అవశ్యకమనియు, అనావిష్కారాధికరణమున బ్రహ్మవేత్త తన మహిమలను ప్రదర్శింపరాదనియు, ఐహికాధికరణమున బలవత్తరపాప

కర్మలచే ఐహికఫలప్రదములైన కర్మలకు ప్రతిబన్ధము లేర్పడుననియు ముక్తి ఫలాఽనియమాధికరణమున బ్రహ్మోపాసననకును (భాగవతాఽపచారాది) ప్రబల ప్రతిబన్ధకము లున్నచో అఫలప్రదములు కాజాలవనియు ఈ రీతిగ ఈ తృతీయాధ్యాయ చతుర్థపాదమైన అంగపాదమున నిరూపింపబడినవి.

## చతుర్థాధ్యాయము (ఫలాధ్యాయము)

### ప్రథమపాదము (ఆవృత్తిపాదము)

### 124 ఆవృత్త్యధికరణము 1

### బ్రహ్మవేత్త జీవితాన్తము బ్రహ్మోపాసన గావించుచుండవలయును.

470 సూ॥ ఆవృత్తి రసకృ దుపదేశాత్ 4-1-1

అర్థ : అసకృత్ అవృత్తిః = ఉపాసనమునకు ఆవృత్తి పలుమార్లు చేయబడదగినది. ఉపదేశాత్ = (వేదన (జ్ఞాన) శబ్దపర్యాయములైన ఉపాసన ధ్యాన శబ్దములచే ఉపక్రమోప సంహారములయందు) ఉపదేశించుటవలన.

వివ : పలుమార్లు కావింపబడిన ధ్యానరూప వేదనమే మోక్ష సాధనము. ఉపనిషత్తులయందు వినిపించు ఉపాసన ధ్యాన వేదన పదములు పర్యాయములు. "మనో బ్రహ్మే త్యుపాసీత" అని ఉపాసన శబ్దముతో ప్రారంభించి "య ఏవం వేద (ఛా. 3-1-8-1) అని వేదన పదముతో ఉపసంహరింపబడినది. ఇట్లే "యి స్తద్వేద య త్స వేద" (ఛా. 4-1-4) అని వేదన ప్రారంభముతో ప్రారంభించి "యాం దేవతా ముపాస్సే" అని ఉపాసన శబ్దముతో ఉపసంహరింపబడినది.

"నిదిధ్యాసితవ్యః" (ముండక. 3-1-8) అనునెడ ధ్యానమనగా వేదన మనియే అర్థము. ధ్యానము స్మృతిసన్తాన రూపమైనదియేగాని స్మృతి మాత్రముకాదుగదా! కావున అసకృదావృత్తి స్మృతి సన్తాన రూపము నిరతిశయ ప్రీతిరూపము దర్శన సమానాకారము అయిన వేదనమే ముక్తిసాధనము అని భావము.

471 సూ॥ లిఙ్గాచ్చ 4-1-2

అర్థ : లింగాత్ + చ = స్మృతివచనమువలనను (అసకృ దావృత్త ధ్యానమే మోక్షసాధనము.)

వివ ! "మాం ధ్యాయన్త ఉపాసతే తేషా మహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్" (భగ. 12-6) నన్ను ధ్యానించుచు ఎవరు ఉపాసింతురో, అట్టివారిని జనన మరణ శీలమైన సంసార సముద్రము నుండి నేను ఉద్ధరింతును" ఇత్యాది స్మృతివచనములును అసకృ దావృత్త ధ్యానమే మోక్షసాధనమని తెలుపుచున్నవి.

125 ఆత్మత్వోపాసనాధికరణము 2

పరమాత్మను తనకు అంతరాత్మగా ధ్యానింపవలయును.

472 సూ॥ ఆత్మేతి తూపగచ్ఛన్తి గ్రాహయన్తి చ 4-1-3

అర్థ : ఆత్మా + ఇతి తు = (పరమాత్మ తనకు)అంతరాత్మ (అని ఉపాసింపవలయును) ఉపగచ్ఛన్తి=(ప్రాచీనులు ఇట్లే) అంగీకరించి వారు. గ్రాహయన్తి చ = (శాస్త్రములును ఇట్లే) బోధించుచున్నవి.

వివ ! పరమాత్మను తనకు అంతరాత్మగా ఉపాసింపవలయును ప్రాచీనులు "త్వం వా అహ మస్మి భగవో దేవతే, అహం వై త్వమసి"

ఓ పూజ్యమైన దేవతా నేను నీవై ఉన్నాను. నీవు నేనై ఉన్నావు" అనుచు తమను పరమాత్మా౽భిన్నులనుగ (అహం బ్రహ్మాస్మి) ఉపాసించినారు. "అధికం తు భేద నిర్దేశాత్" (బ్ర. సూ. 2-1-22) ఇత్యాది సూత్రములచే జీవాత్మ పరమాత్మలు భిన్నులు అని తెలియుచుండగా "అహం బ్రహ్మాస్మి" అని అభేద భావనతో ఉపాసించుట యెట్లు అని సందేహింపనవసరములేదు. "య ఆత్మని తిష్ఠన్ ఆత్మనో౽న్తరో య మాత్మాన వేద యస్యాత్మా శరీరం య ఆత్మాన మన్తరో యమ యతి స త ఆత్మా అన్తర్యామ్యమృతః" (బృ. 5-7-22) అను శ్రుతి పరమాత్మ జీవునిలో అంతర్యామియై అతనిలో శరీరముగ కలిగియున్నాడు అని తెలుపుటచే ఇట్టి శరీరాత్మభావముబట్టి "అహం బ్రహ్మా౽స్మి" తత్త్వ మసి"వంటి అభేద బోధకవాక్యములు సంగతము లగును. "నేను లావుగా ఉన్నాను ఇది నా శరీరము"వంటి లౌకిక వాక్యములు శరీరముతో ఆత్మకు భేదము" ఉన్నను. అభిన్నముగ "నేను" అనియు ప్రయోగింపబడుచున్నవి గదా. కావున "అహం బ్రహ్మాస్మి" అనియే ఉపాసింపవలయును.

### 126 ప్రతీకాధికరణము 3

ప్రతీకములను బ్రహ్మదృష్టితో ఉపాసింపవలయును.

**473 సూ॥ న ప్రతీకే న హి సః 4-1-4**

అర్థ : ప్రతీకే=ప్రతీకమునందు, న=ఆత్మాత్వానుసన్ధానముచేయరాదు. సః=ఆ ప్రతీకము న హి=ఉపాసకునకు ఆత్మకాదుగదా.

వివ : "మనో బ్రహ్మే త్యుపాసీత" (ఛా.3-8-1) మనస్సును బ్రహ్మగా ఉపాసింపవలయును అని ఈ రీతిగా చెప్పబడిన ప్రతీకోపాసనలయందు మనస్సు మొదలైన ప్రతీకములను తనకు ఆత్మగా

ఉపాసింపదగినవనతము లేదు. ఆ మనస్సు మొదలగునవి ఉపాసనకునకు ఆత్మకావుగదా. 'ప్రతీకము' అనగా ఏకదేశము (ఒక భాగము) అని యర్థము.

474 సూ॥ బ్రహ్మదృష్టి రుత్కర్షాత్ 4-1-5

అర్థ : ఉత్కర్షాత్ = బ్రహ్మమునందలి ఉత్కర్షమునుబట్టి బ్రహ్మదృష్టిః=మనస్సు మొదలగువానియందలి బ్రహ్మదృష్టి కర్తవ్యం

వివ : బ్రహ్మదృష్టితో మనస్సు మొదలైన ప్రతీకములను ధ్యానింపవలయునేగాని మనస్సు మొదలైనవానిదృష్టితో బ్రహ్మమును ధ్యానింపరాదు. బ్రహ్మము సర్వోత్కృష్టమైనది. మనస్సు మొదలైనవి అపకృష్టములు. అపకృష్టములను ఉత్కృష్ట దృష్టితో చూడవచ్చును, కాని ఉత్కృష్టమైన దానిని అపకృష్ట దృష్టితో చూడరాదు. భృత్యుని జూచి "ఇతడు రాజు" అని అనవచ్చును. కాని రాజును చూసి ఇతడు భృత్యుడు అని అనరాదుగదా.

127 ఆదిత్యాది మత్యధికరణము 4

క్రత్వంగములైన ఉద్గీథాదులను ఆదిత్యాదిదృష్టితో ఉపాసింపవలయును.

475 సూ॥ ఆదిత్యాది మతయ శ్చాఙ్గ ఉపపత్తేః 4-1-7

అర్థ : అంగే=క్రత్వంగములైన ఉద్గీథాదులయందు, ఆదిత్య+ఆది మతయః = ఆదిత్యాది దృష్టి (కర్తవ్యము) ఉపపత్తేః=(అదియే) ఉపపన్నమగుటవలన.

వివ : "య ఏవాఽసౌ తపతి త ముద్గీథ ముపాసీత" (ఛా

1-2-1) ఈ తపించుచున్న సూర్యుని ఉద్గీథముగ ఉపాసింపవల యును ఇత్యాదిగా చెప్పబడిన క్రతవ్వంగోపాసనలయందు ఉద్గీథాదు లను ఆదిత్యాది దృష్టితో ఉపాసింపవలయును. అదియే యుక్తము. ఏలయన, ఈవిధముగ ఉపాసించినపుడే గదా ఉపాసనా సంప్రీతు లైన ఆదిత్యాది దేవతలు ఫలము నొసంగునది.

128 ఆసీనాధికరణము 5

కూర్చొనియే ఉపాసింపవలయును.

476 సూ॥ ఆసీన స్సంభవాత్ 4-1-7

అర్థ : ఆసీనః=కూర్చొన్నవాడై (ఉపాసింపవలయును) సంభ వాత్=(అప్పుడే ఏకాగ్రత) సంభవించుటవలన.

వివ : కూర్చొని యున్నపుడే చిత్తైకాగ్రత సిద్ధించుటవలన ఉపాసకుడు కూర్చొనియే ఉపాసింపవలయును.

477 సూ॥ ధ్యానాచ్చ 4-1-8

అర్థ : ధ్యానాత్+చ=(ఉపాసనము) ధ్యానరూపమగుటవలన (కూర్చొనియే ఉపాసింపవలయును.)

వివ : "నిదిధ్యాసితవ్యః" అను శ్రుతి ఉపాసనమును ధ్యాన ముగ చెప్పుటచే తమ కూర్చొనియే ఉపాసింపవలయును. ఇతర చిన్తన యేమాత్రములేని తైలధారవలె అవిచ్ఛిన్నమైన తదేక చిన్త నమునేకదా ధ్యానమని యనుచున్నారు.

478 సూ॥ అచలత్వం చాఽపేక్ష్య 4-1-9

అర్థ : అచత్వలం = నిశ్చలత్వమును, అపేక్ష్యయు చ = పురస్కరించుకొనియు (కూర్చొనియే ఉపాసింపవలయును.)

వివ : "ధ్యాయతీవ పృథివీ ధ్యాయతే వాన్తరిక్షం" (ఛా. 7-6-1) పృథివి ధ్యానించుచున్నట్లున్నది. అన్తరిక్షము ధ్యానించు చున్నట్లున్నది అని అనుచు శ్రుతి నిశ్చలములుగా ఉన్నందువలన పృథివ్యాదులు ధ్యానించుటకు నిశ్చలత్వము ఆవశ్యకము. అట్టి నిశ్చలత్వము కూర్చొనినపుడే సిద్ధించును. కాన ఉపాసకుడు కూర్చొనియే ఉపాసింపవలయును.

479 సూ॥ స్మరన్తి చ 4-1-10

అర్థ : స్మరన్తి చ = (ఈ విషయమును) స్మృతికారులును చెప్పుచున్నారు

వివ : శ్లో॥ శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః।
నాఽత్యుచ్ఛ్రితంనాఽతి నీచంచేలాఽజినకుశోత్తరం
తత్రైకాగ్రం మనః కృత్వా యత చిత్తేంద్రియ
యక్రియః।
ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగమాత్మ విశుద్ధయే॥
(భ.గీ. 6-11-12)

పరిశుద్ధ ప్రదేశమున మిక్కిలిఎత్తుగ గాని మిక్కిలి పొట్టిగ గాని ఉండనిది కుశలచేతను, కృష్ణాజనముచేతను వస్త్రముచేతను, కప్పబడినది అగు ఆసనముమీద కూర్చొని ఇంద్రియ వ్యాపారములను నిగ్రహించి మనస్సు నేకాగ్ర గావించి ఆత్మపరిశుద్ధికై ధ్యానింపవలయును అనుచు స్మృతియు కూర్చొనియే ఉపాసింపవలయునని తెలుపుచున్నది

480 యత్రైకాగ్రతా తత్రాఽవిశేషాత్ 4-1-11

అర్థ : యత్ర = ఏ దేశ కాలములయందు, ఏకాగ్రత = చిత్తైకాగ్రత (సిద్ధించునో) తత్ర = అట్టి దేశకాలములయందు (ఉపాసింపవలయును) అవిశేషాత్ = (ఉపాసనమునకు దేశ కాలవిశేషములను) విశేషించి చెప్పనందువలన

వివ : "శర్కరాది రహితే మనోఽనుకూలే శుచౌ దేశే" గులకరాళ్ళు మొదలగునవి లేనిది మనమ్మునకు ఇంపైనది పవిత్రమైనది అయిన స్థలమునందు (ఉపాసింపవలయును) అని మాత్రమే శాస్త్రము బోధించినది. కాని ఉపాసనకు అనుకూలముగ ప్రత్యేకించి దేశకాలములను కీర్తింపలేదు. కావున చిత్తైకాగ్రత సిద్ధింపగల ఏ స్థలముననైనను ఏ సమయముననైనను ఉపాసింపవచ్చును.

129 ఆప్రయాణాధికరణము 6

ఉపాసకుడు మరణ పర్యన్తము ఉపాసించుచుండవలయును.

481 సూ॥ ఆ ప్రయాణా త్తత్రాఽపి హి దృష్టమ్ 4-1-12

అర్థ : ఆ ప్రయాణాత్ = మరణ పర్యంతము (ఉపాసనము గావించుచుండవలయును.) తత్ర + అపి = ఉపాసనప్రారంభ దినము నుండి మరణ పర్యన్తమును, దృష్టం హి=(ఉపాసనము) శ్రుతియందు చెప్పబడినదిగదా.

వివ : "స ఖల్వేవం వర్తయన్ యావదాయుషం బ్రహ్మలోక మభిసంపద్యతే" (ఛా. 8-15-1) ఆ ఉపాసకుడు ఈరీతిగ జీవితాంతము అనుష్ఠించుచున్నవాడై బ్రహ్మలోకమును పొందుచున్నాడు

అను శ్రుతివాక్యము ప్రారంభదినము నుండి మరణపర్యన్తము ఉపాసనము గావించుచుండవలయునని బోధించుచున్నదిగదా. కావున ఉపాసకుడు ఏదో ఒక్కరోజున లేదా కొన్నిరోజులు మాత్రము ఉపాసించిన చాలదు. జీవితాంతము ఉపాసించుచుండవలయును.

130 తదధిగమాధికరణము 7

ఉపాసకునకు పూర్వకర్మలు నశించును తరువాతి కర్మలు అంటవు.

482 సూ॥ తదధిగమ ఉత్తర పూర్వాఘయో రశ్లేష వినాశౌ తద్వ్యపదేశాత్ 4-1-13

అర్థ : తత్ + అధిగమే = ఆ బ్రహ్మవిద్యాప్రాప్తి కలుగుగనే, ఉత్తరపూర్వ + అఘయోః=ఉత్తరపూర్వపాపములకు, అశ్లేష వినాశౌ= అంటకుండుట నశించుట (కలుగుచున్నవి) తత్ + వ్యపదేశాత్ = అట్లు శ్రుతి చెప్పుటవలన.

వివ : "ఏవం హాఽస్య సర్వే పాప్మానః ప్రదూయన్తే" (ఛా. 5-24-3) ఈ విధముగ ఈ ఉపాసకుని సకల పాపములు నశించును. అను శ్రుతి పూర్వకర్మ నాశమును "ఏవ మేవం విది పాపం కర్మ న శిష్యతే" (ఛా. 4-14-3) ఈ రీతిగ బ్రహ్మవేత్తయందు పాప కర్మ అంటదు అను శ్రుతి ఉత్తరకర్మ నాశమును తెలుపుటచేత ఉపాసనా బలముచే ఉపాసకుని ఉత్తరపాపములు అంటవు. పూర్వపాపములు నశించును అని స్పష్టమగుచున్నది "నాఽభుక్తం క్షీయతే కర్మ కల్ప కోటిశతై రపి" కర్మను అనుభవింపనిదే అది నూరుకోట్ల కల్పములైనను నశింపదు ఇత్యాది ప్రమాణములు మనము చేయు కర్మఫలము

నిచ్చి తీరును" అను విషయమును మాత్రమే బోధించుచున్నది. ఇది అబ్రహ్మవేత్తల విషయము. బ్రహ్మవేత్తల విషయమున ఉపాసనా సామర్థ్యముచే వారి కర్మఫల జనన సామర్థ్యమును కోల్పోవుచున్నవి అని తలంపవలయును.

131 ఇతరాధికరణము 8

పుణ్యము సైతము మోక్షవిరోధి

483 సూ॥ ఇతరస్యా ప్యేవ మసంశ్లేషః పాతే తు 4-1-14

అర్థ : ఇతరస్య + అపి=పాపముకంటె భిన్నమైన పుణ్యమునకును, ఏవం = ఇట్లు (అశేష వినాశములు సంభవించును. పాతే తు= శరీరపాతానంతరము, అసంశ్లేషః =(అప్పటికి మిగిలియున్న) కర్మ (ఇక నిష్ఫలమగుటవలన) అంటదు.

వివ : బ్రహ్మవేత్తకు పాపమువలె పుణ్యముకూడ (మోక్ష)విరోధియగుటవలన దానికిని ఉపాసనాసామర్థ్యముచే అశ్లేష వినాశములు సంభవించుచున్నవి. ఉపాసకునకు శరీరాధారణకై, వృష్టి-అన్న-ఆయురారోగ్యాదుల నొసంగుచు వచ్చిన పుణ్యము సైతము అతడు మరణించినంతనే నిష్ప్రయోజనమగుటవలన అంటక నశించుచున్నది అని భావము.

132 అనారబ్ధకార్యాధికరణము 9

ప్రారబ్ధకర్మము ఉపాసకుడు అనుభవించి తీరవలసినదే.

484 సూ॥ అనారబ్ధకార్యే ఏవ తు పూర్వే త దవధేః 4-1-15

అర్థ : అనారబ్ధ కార్యే = తమ పనిని ప్రారంభించని, పూర్వే

ఏవ తు = విద్యోత్పత్తికి పూర్వము కావింపబడిన పుణ్యపాపములు మాత్రమే (నశించును) తద్ + అవధేః = (శ్రుతి తెలిపిన) శరీర పాతాఽవధివలన.

వివ : "తస్య తావ దేవ చిరం యావన్న విమోక్ష్యే అథ సంపత్స్యే" (ఛా. 6-14-2) బ్రహ్మవేత్త శరీర పాతమగుటయే తడవుగ (మరణించినంతనే) బ్రహ్మమును పొందుచున్నాడు అను శ్రుతి శరీర పాతాఽనన్తరమే బ్రహ్మప్రాప్తి" అని తెలుపుటచేత సంచితములైన పుణ్యపాపములు మాత్రమే నశించును ప్రారబ్ధకర్మ నశింపదు. ఉపాసన సిద్ధించిన పిదపకూడా శరీరము నిలిచియుండుట ప్రారబ్ధవశమునసేగదా. కావున ఫలము నిచ్చుటకు ఉపక్రమించిన ప్రారబ్ధ కర్మము కంటె భిన్నములైన సంచిత కర్మలు మాత్రమే తొలుత నశింపగా శరీరపతానాఽనన్తరము ప్రారబ్ధ మనువర్తించును అని స్పష్టమగుచున్నది. కావున బ్రహ్మవేత్తయొక్క సకలపాపములు నశించును. (తస్య సర్వే పాప్మానః ప్రదూయన్తే) అను శ్రుతివచనము ప్రారబ్ధ కర్మేతర విషయమని తెలియవలయును.

### 133 అగ్నిహోత్రాద్యధికరణము 10

ఉపాసనాసిద్ధికై నిత్యనైమిత్తిక కర్మలను ఆచరింపవలయును

485 సూ॥ అగ్నిహోత్రాది తు తత్ కార్యాయైవ తద్దర్శనాత్ 4-1-16

అర్థ : అగ్నిహోత్ర + ఆది తు = అగ్నిహోత్రాది నిత్యనైమిత్తిక కర్మలు, తత్ + కార్యాయ + ఏవ = ఆ విద్యరూప ఫలసిద్ధికొఱకే, తత్ + దర్శనాత్ = అట్లు శ్రుతి తెలుపుటవలన.

వివ : "త మేతం వేదాఽనువచనేన బ్రాహ్మణాః వివిదిషన్తి" (బృ. 6-4-22) అ ఈ పరబ్రహ్మమును వేదాధ్యయనాదులచే బ్రాహ్మణులు తెలియగోరుచుందురు. ఇత్యాది శ్రుతివాక్యములనుబట్టి అగ్నిహోత్రాది నిత్య నైమిత్తిక కర్మలను బ్రహ్మవిద్య సిద్ధికై తప్పక అనుష్ఠింపవలయునని స్పష్టమగుచున్నది. కావున "ఉపాసకుని పూర్వోత్తరాయములు నశించుచున్నవిగదా. మరల అతడు అగ్నిహోత్రాది కర్మలను ఎందులకు ఆచరింపవలయును?" అని సందేహింపరాదు. ఉపాసనాసిద్ధికై వానిని ఆచరింపవలయును.



486 సూ॥ అతోఽన్యాఽపి హ్యేకేషా ముభయోః 4-1-17



అర్థ : అతః = ఈఅగ్నిహోత్రాది సత్కర్మముకంటెను, అన్యా+అపి = భిన్నమగు పుణ్యకర్మముకూడ (కలదు) ఉభయోః = (అది) సంచిత ఆగామి పుణ్యములలోనిది, ఏకేషాం = కొన్ని శాఖలలోని వాక్యములకు (అది విషయము.)



వివ : అగ్నిహోత్రాది నిత్య కర్మానుష్ఠానమునకు ప్రతిబన్ధక నివృత్తి ఫలమగుచో "తస్య పుత్రాః దాయ ముపయన్తి. సుహృదస్సాధు కృత్యాం, ద్విషన్తః" పాపకృత్యాం" మరణించిన బ్రహ్మవేత్తయొక్క కుమారులు అతని ఆస్తిని పంచుకొందురు. మిత్రులు అతని పుణ్యమును శత్రువులు అతని పాపమును పంచుకొందురు అని శ్రుతి ఎట్లు బోధించును? ఉత్తర పూర్వాఘములకు అశేష వినాశములు ముందే చెప్పబడినవికదా అని శంకింపరాదు. విద్యోత్పత్తికి పూర్వము చేయబడిన కర్మలలో ప్రబల కర్మాన్తర ప్రతిబన్ధముత్రి ఫలింపక మిగిలియున్న కర్మములను విద్యోత్పత్త్యనంతర కృతకర్మలలో ప్రబల

కర్మ ప్రతిబన్ధముచే ఫలింపని కర్మలును "సుహృదస్సాధు కృత్యాం" ఇత్యాది శ్రుతివచనమునకు విషయములగుచున్నవి.

487 యదేవ విద్యయేతి హి 4-1-18

అర్థ : "యదేవ విద్యయా" ఇతి హి = "యదేవ విద్యయా కరోతి" అను శ్రుతి విద్యతోగూడిన కర్మము వీర్యవత్తర మగునని చెప్పుచున్నదికదా.

వివ : "యదేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరంభవతి" (ఛా. 1-1-10) అనుశ్రుతి ఉద్గీథాద్యుపాసనముతో చేయబడినకర్మము నిరాటంకముగ ఫలము నొసంగగలదని తెలుపుచుండుటచే విద్యారహితముగ చేయబడిన ప్రబల కర్మాన్తర ప్రతిబద్ధములై ఫలింపని అనేక కర్మలు ఉండును అని సూచించుచున్నదికదా. ఇట్టి కర్మశేషమును అతని మిత్రులు మున్నగువారు పంచుకొందురు.

134 ఇతర క్షపణాధికరణము 11

ప్రారబ్ధ కర్మానుభవాఽనన్తమే మోక్షము. అది ఒకే శరీరము తనైనను అనేకశరీరముల యందైనను కావచ్చును.

488 సూ॥ భోగేన త్వితరే క్షపయిత్వాఽథ సమ్పద్యతే

4-1-19

అర్థ : ఇతరే=(సంచిత-ఆగామి సుకృత దుష్కృతములకంటె భిన్నమైన) ప్రారబ్ధ సుకృత దుష్కృతములను, భోగేన = అనుభవించుటద్వారా, క్షపయిత్వా = నశింపచేసి, అథ = పిమ్మట, సంపద్యతే = (బ్రహ్మవేత్త బ్రహ్మమును) పొందుచున్నాడు.

వివ : ప్రారబ్ధ పుణ్యపాపములను ఒకశరీరముతో కాని అనేక శరీరములతో కాని అనుభవించి పూర్తిగా వానిని నశింపజేసికొని పిమ్మట బ్రహ్మవేత్త బ్రహ్మమును పొందుచున్నాడు. కావున ప్రారబ్ధము అనుభవించియే తీరవలయును.

చతుర్థాధ్యాయ ప్రథమపాదము సమాప్తము.

చతుర్థాధ్యాయ ప్రథమపాదార్థ సంగ్రహ శ్లోకము

శ్లో॥ ఆవర్త్యా బ్రహ్మవిద్యా తపక్ప దహమితి స్యాచ్ఛన స్యాత్ప్రతీకే
క్రత్వంగే కాది దృష్టిః ప్రణిధి రపి భవేత్ సాసనః ప్రత్యహం చ
పాపే పుణ్యే చ నాశాదిం మథవ తయో ర్భోగ్యతాఽఽరబ్ధ కార్యే
కార్యత్వ స్యార్థవృత్తేః ఇతి కథితా మిహారబ్ధకాన్తౌ చ మోక్షః॥

తా॥ అవృత్త్యధికరణమున జీవితాంతము ఉపాసన గావించుచుండవలయునని, ఆత్మత్వోపాసనాధికరణమున "అహం బ్రహ్మాఽస్మి" అని ఉపాసింపవలయుననియు ప్రతీకాధికరణమున నామాదిప్రతీకములను బ్రహ్మదృష్టితో ఉపాసింపవలయునేగాని బ్రహ్మమును ప్రతీకాది దృష్టితో ఉపాసింపరాదనియు, ఆదిత్యాదిమత్య్వధికరణమున క్రత్వంగములైన ఉద్గీథాదులను ఆదిత్యాది దృష్టితో ఉపాసింపవలయుననియు, ఆసీనాధికరణమున కూర్చొనియే ఉపాసింపవలయుననియు ఆ ప్రయాణాధికరణమున బ్రహ్మవేత్త మరణపర్యన్తము ఉపాసించువే ఉండవలయుననియు, తదధిగమాధికరణమున విద్యా మాహాత్మ్యముచే పూర్వకర్మలు నశించును. ఉత్తరకర్మలు అంటవు అనియు, ఇతరాధికరణమున పుణ్యకర్మలు సైతము మోక్ష విరోధులగుటవలన విద్యామాహాత్మ్యముచేత పూర్వపుణ్యకర్మలు నశింపగా తరువాతి పుణ్య

కర్మలు అంటవనియు, అనారబ్ధకార్యాధికరణమున ఉపాసకుడు ప్రారబ్ధ కర్మలను అనుభవించి తీరవలసిదే అనియు, అగ్నిహోత్రాధికరణమున విద్యాశుద్ధికై నిత్య నైమిత్తిక కర్మలను అనుష్ఠింపవలయుననియు, ఇతర క్షపణాధికరణమున ప్రారబ్ధ కర్మాఽవసానమున బ్రహ్మసంపత్తి రూపమోక్షము ప్రాప్తించుననియు ఈరీతిగ ఈ చతుర్థాధ్యాయప్రథమ పాదమైన అవృత్తిపాదమున నిరూపింపబడినవి.

## చతుర్థాఽధ్యాయ ద్వితీయ పాదము

### 135 వాగధికరణము 1 ఉత్క్రాన్తిపాదము

ప్రాణోత్క్రమణ సమయమున బ్రహ్మవేత్తయొక్క ఇంద్రియములు మనస్సును చేరును.

489 సూ॥ వాఙ్మనసి దర్శనా చ్ఛబ్దాచ్చ 4-2-1

అర్థ : వాక్ = వాగింద్రియము, మనసి = మనస్సునందు (కలియుచున్నది) దర్శనాత్ = (అట్లు) చూపట్టుటవలన, శబ్దాత్ చ = శ్రుతి ప్రమాణమువలనను.

వివ : "అస్యసౌమ్య పురుషస్య ప్రయతః, వాక్ మనసిసంపద్యతే(ఛా. 6-8-6) ఓ సౌమ్యుడా! ఉత్క్రాన్తిని పొందుచున్న ఈ పురుషుని యొక్క వాగింద్రియము మనస్సున జేరుచున్నది అను శ్రుతియందు మరణసమయమున బ్రహ్మవేత్తయొక్క వాగింద్రియము మనస్సునందు సంపత్తిరూపసంశ్లేషము నందుచున్నది. (ఇచట వాగింద్రియము ప్రస్తావన తక్కిన బాహ్యేంద్రియములకును సూచకము అని తెలుపుచున్నది. కొందరు "వాక్" అనగా వాగింద్రియము అనికాక "వాగ్వ్యాపారము" అని అర్థము చెప్పుచున్నారు. కాని ఇది యుక్తముకాదు.

వాగింద్రియమునకుగాని వాగ్వ్యాపారమునకుగాని మనస్సుకారణము కాదు. ఇట్టియెడ, తమకు కారణము కాని మనస్సునందు అవి ఎట్లు లయించును? కార్యము తన కారణమునందేగదా లయింపవలయును? కావున "వాఙ్మనసి" ఇత్యాది శ్రుతి ప్రమాణమునుబట్టి "వాక్" అను పదము వాగింద్రియమునే బోధించును. ఇచట "సంపద్యతే" అనగా లయించున్నది అని అర్థముకాదు. సంశ్లేషించుచున్నది అని మాత్రమే అర్థము. ఈవిధముగ బ్రహ్మవేత్త మరణించునపుడు తొలుత అతని వాక్కు ఆగిపోవును అని భావము.

490 సూ॥ అతఏవ సర్వాణ్యను 4-2-2

అర్థ : అతః+ఏవ = కావుననే, సర్వాణి = సమస్తములైన బాహ్యేంద్రియములు, అను = వాగింద్రియము ననుసరించి మనసు నందు సంశ్లేషించుచున్నవి.

వివ : "ఇంద్రియై ర్మనసి సంపద్యమానైః" అనుశ్రుతి వాగింద్రియముతోబాటు తక్కిన అన్ని ఇంద్రియములును మనస్సున సంశ్లేషించుచున్నవి అని చెప్పుటవలన చక్షురాది సర్వేంద్రియములు మనస్సున జేరుచున్నవి అని భావము.

136 మనోఽధికరణము 2

మనస్సు ప్రాణమును చేరును.

491 సూ॥ తన్మనః ప్రాణ ఉత్తరాత్ 4-2-3

అర్థ : ఉత్తరాత్ = తరువాతి వాక్యమున, తత్=ఇంద్రియములతోగూడిన) ఆ మనస్సు, ప్రాణే = ప్రాణమునందు (సంశ్లేషించుచున్నది.)

వివ : అస్య సోమ్య పురుషస్య ప్రయతోవాఙ్మనసి సంపద్యతే మనః ప్రాణే" అనుశ్రుతియందు వాగాదీంద్రియములు మనస్సునందు సంశ్లేషించును అని తెలిపి పిదప "మనః ప్రాణే" మనస్సు ప్రాణము నందు చేరును అని తెలుపుటచేత మనస్సు ముఖ్యప్రాణమునందు చేరు చున్నదని గ్రహింపవలయును. మనస్సు ప్రాణజన్యముకానందువలన ప్రాణమునందు లయించుచున్నదని అని అర్థము చెప్పరాదు.

137 అధ్యక్షాధికరణము 3

ప్రాణము జీవునిలో జేరును.

492 సూ॥ సోఽధ్యక్షే తదుపగమాదిభ్యః 4-2-4

అర్థ : సః = ఆ ప్రాణము, అధ్యక్షే = కరణాఽధిపుడైన జీవుని యందు (సంశ్లేషించును) తత్ + ఉపగమ + ఆదిభ్యః = ప్రాణము జీవుని చేరును అని తెలియుటవలన.

వివ : "ఏవ మేవేమ మాత్మానం అన్తకాలే సర్వే ప్రాణాః అభిసమాయన్తి" (బృ. 6-3-38) మరణ సమయమున ప్రాణము లన్నియు జీవుని జేరుచున్నవి అను శ్రుతి ప్రాణములకు జీవసంశ్లే మును తెలుపుచున్నది. ఇట్లే "కస్మిన్ ఉత్క్రాన్తే ఉత్క్రాన్తో భవి ష్యామి. కస్మిన్ వా ప్రతిష్ఠితే ప్రతిష్ఠాస్యామి" (ప్రశ్న. 6-3) ఎవడు బయలుదేరినంతనే నేను బయలుదేరుదును? ఎవడు స్థిరముగ నుండిన నేను స్థిరముగనుందును" అను శ్రుతి ప్రాణముయొక్క స్థితిగతులు జీవాత్మాధీనములని తెలుపుచున్నది. కావున ఉత్క్రమణ సమయమున ముఖ్యప్రాణము జీవునితో సంశ్లేషించుచున్నది అని గ్రహింపవలయును

138 భూతాధికరణము 4

జీవసంశ్లిష్టమైన ప్రాణము భూత సూక్ష్మములతో చేరును.

493 సూ॥ భూతేషు తచ్ఛ్రుతేః 4-2-5

అర్థ : తత్ + శ్రుతేః = "జీవుడు సర్వ భూతమయుడు" అను శ్రుతివలన, భూతేషు = జీవునితోకూడిన ప్రాణము భూత సూక్ష్మముల యందు (సంశ్లేషించుచున్నది)

వివ : "ప్రాణ స్తేజసి" (ఛా. 6-8-6) ప్రాణము తేజస్సున చేరుచున్నది అను వాక్యమున తేజశ్శబ్దము పంచభూతములకును ఉప లక్షణము కావున పంచభూతములయందు చేరుచున్నది అని అర్థము. మరియు "పృథివీమయః అపోమయః తేజోమయః" (బృ. 6-4-5) జీవుడు పృథివీమయుడు అపోమయుడు తేజోమయుడు అను శ్రుతి వలనను జీవసంశ్లిష్ట ప్రాణము భూతసూక్ష్మములతో చేరునని స్పష్ట మగుచున్నది.

494 సూ॥ నైకస్మిన్ దర్శయతో హి 4-2-6

అర్థ : ఏకస్మిన్ = ఒక్క భూతమునందు మాత్రమే, న = (జీవుడు) సంశేషింపడు, దర్శయతః + హి = శ్రుతి స్మృతులు అట్లు తెలుపుచున్నవికదా.

వివ : "ప్రాణ స్తేజసి" అను శ్రుతి తేజస్సునందు మాత్రమే జీవసంశేషము అని బోధింపదు "అనేన జీవేనాత్మనా అను ప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి. తాసాంత్రివృతం త్రివృతం ఏకైకాం కర వాణి" (అను శ్రుతి త్రివృత్కరణమును ఉపదేశించుచున్నది "నానా వీర్యాః పృథగ్భూతాః తత స్తే సంహతిం వినా-నాఽశక్నువన్ ప్రజా స్స్రష్టుం అసమాగమ్య కృత్స్నశః సమేత్యాఽన్యోన్య సంయోగం

పరస్పర సమాశ్రయః మహదాద్యాః విశేషాన్తాః అండ ముత్పాద యంతి తే" (విష్ణు. పు. 1-2-52) నానాశక్తి విశిష్టములైన పంచ భూతములు విడివిడిగ నున్నపుడు జగత్సృష్టి గావింపలేకుండినవి. ఆ పంచభూతములే పరస్పరమత సంశ్లేషించినపుడు జగత్సృష్టి గావింప గలిగినవి అనుచు స్మృతియు త్రివృత్కరణ పంచకరణములను విశదీ కరించినది. కావున జీవసంశ్లిష్టమైన ప్రాణము భూత సూక్ష్మముల యందు సంశ్లేషించును అని సారాంశము.

139 ఆసృత్యుపక్రమాధికరణము 5

మూర్ధన్య నాడీ ప్రవేశ పర్యన్తము బ్రహ్మవేత్తకును ఉత్క్రాన్తి గలదు.

485 సూ॥ సమానా చాసృత్యుప క్రమా దమృతత్వం చాఽ నుపోష్య. 4-2-7

అర్థ : ఆ సృతి + ఉపక్రమాత్ = నాడీ ప్రవేశ పర్యన్తము, సమానా = (బ్రహ్మవేత్తకును బ్రహ్మవేత్త కాని వానికిని ఉత్క్రాన్తి) సమానము. అమృతత్వం చ = (ఈ) అమృతత్వము, అనుపోష్య = (శరీరేంద్రియాది సంబంధమును) దహింపక ఏర్పడునట్టి (సంచితా గామి కర్మల అశేష వినాశరూపమైనది.)

వివ : యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది స్థితాః అథ మర్త్యోఽమృతో భవతి అత్ర బ్రహ్మసమశ్నుతే" (కఠ.2-6-14) బ్రహ్మవేత్తయొక్క హృదయమును ఆశ్రయించుకొనియుండు కోరికలన్నియు ఎపుడు సమగ్రముగ నశించునో అపుడు అతడు జనన మరణరూప సంసారబన్ధ విముక్తుడై ఇచటనే బ్రహ్మమును పొందు

చున్నాడు" అనుటచేత బ్రహ్మవేత్తకు ఉత్క్రమణములేదుగదా అని సందేహము కలుగుచున్నది. కాని బ్రహ్మవేత్తకును ప్రాణోత్క్రమణము కలదు అని సిద్ధాన్తము. బ్రహ్మప్రాప్తి అర్చిరాదిగతిద్వారా మాత్రమే లభించును. మూర్ధన్యనాడిద్వారా ఉత్క్రమించనిచో అర్చిరాది గతి సంభవింపదుగదా. మనస్సులోని కోరికలు నశించినంతనే అమృతత్వ సాధనమైన ఉపాసన మారంభమగును. పిమ్మట మర్త్యుడు, అమర్త్యుడు అగును. అనగా ఉపాసనామాహాత్మ్యముచే సంచితాగామి పుణ్యపాపరహితుడు అగును. అని భావము. "అత్ర బ్రహ్మసమశ్నుతే" అనువాక్యమునకును ఉపాసనాకాలమున కలుగు ప్రత్యక్ష సమానాకార బ్రహ్మానుభూతిని పొందును అని యర్థము. కావున బ్రహ్మవేత్తకును ఉత్క్రాన్తి గలదు.

496 సూ॥ త దాపీతే స్సంసార వ్యపదేశాత్ 4-2-8

అర్థ : తత్ = ఆ అమృతత్వము శరీరేంద్రియములు ఉండగనే ఉపాసనా ప్రారంభ దశయందు గలుగు ఉత్తర పూర్వాఘ వినాశరూపమైనదియే.) ఆ + అపీతేః = బ్రహ్మప్రాప్తి పర్యన్తము, సంసార వ్యపదేశాత్ = సంసారము ఉండును అని శ్రుతి బోధించుట వలన.

వివ : "తస్య తావ దేవ చిరం, యావన్న విమోక్ష్యే-అథ సంపత్స్యే" (ఛా. 6-14-2) బ్రహ్మవేత్తకు ప్రారబ్ధకర్మమూలకమైన శరీరసంబన్ధము వీడినంతనే బ్రహ్మప్రాప్తి కలుగును అనుశ్రుతి బ్రహ్మప్రాప్తి పర్యంతము శరీరసంబన్ధము ఉండును అని తెలుపుచున్నది. కావున పైశ్రుతి వాక్యమున చెప్పబడిన అమృతత్వము శరీరసంబ

స్థము వీడుటకు ముందు కలుగునదియే అని గ్రహింపవలయును.

497 సూ|| సూక్ష్మం ప్రమాణతశ్చ తథోపలబ్ధేః 4-2-9

అర్థ : సూక్ష్మం = సూక్ష్మ శరీరము (మాత్రము అనువర్తిం చును) ప్రమాణతః = శ్రుతిప్రమాణమువలన, తథా = అట్లు ఉపలబ్ధేః= తెలియుటవలన.

వివ : బ్రహ్మవేత్తకు స్థూల శరీరసంబన్ధము వీడినను, సూక్ష్మశరీరము అనువర్తించును. సూక్ష్మశరీరము లేనిచో అర్చిరాది గమనముగాని "తం ప్రతిబ్రూయాత్ సత్యం బ్రూయాత్" సత్యమును వలుకవలయును అని అతనితో చెప్పుము ఇత్యాదిగ అర్చిరాది మార్గ మున చంద్రునితో సంభాషణ మొదలగునవిగాని అతనికి సంభ వింపవుగదా.

498 సూ|| నోపమర్దే నాఽతః 4-2-10

అర్థ : అతః = అందునలన, ఉపమర్దేన = సంసారసంబన్ధ (శరీర సంబన్ధ) నాశముచే (గలుగు అమృతత్వము) న=చెప్పబడదు.

వివ : శ్రుతిప్రమాణమునుబట్టి మరణానన్తరము బ్రహ్మవేత్త సూక్ష్మ శరీరసంబన్ధము ఉండునట్లు తెలియుటచేత "అథ మర్త్యోఽ మృతోభవతి" అను శ్రుతివచనమునందలి "అమృత" శబ్దమునకు బ్రహ్మప్రాప్తి రూపమైన అమృతత్వము అర్థముకాదు. ఉపాసనా ప్రారంభమున ఉపాసనా మాహాత్మ్యముచే గలుగు సంచితగామి పుణ్యపాప వినాశరూపమైన అమృతత్వమనియే అర్థము.

499 అస్యైవ చోపపత్తే రూష్మా 4-2-11

అర్థ : అస్య = ఈ సూక్ష్మశరీరముయొక్క, ఉపపత్తేః=ఉనికి

వలననే, ఊష్మా చ = స్థూల శరీరమునందు వేడి (కలుగుటయు) సంభవించుచున్నది.

వివ : బ్రహ్మవేత్త మరణించునపుడు అతని స్థూల శరీరము నందు ఏదో ఒక భాగమున వేడి చూపట్టుచుండును. ఆ వేడి సూక్ష్మ శరీరమువలన ఏర్పడినదే. అది స్థూల శరీరమునకు సంబన్ధించినదే అయినచో శరీరమునందు అంతట వేడి చూపట్టవలయునుగదా. ఇట్టి సూక్ష్మశరీరము అనువర్తించుచుండుటవలన అమృత శబ్దమునకు సాక్షాదమృతత్వము అర్థముకాదని భావము.

500 సూ॥ ప్రతిషేధా దితిచేన్న శారీరా త్స్పష్టో హ్యేకేషామ్ 4-2-12

అర్థ : ప్రతిషేధాత్ = (బ్రహ్మవేత్తకు ఉత్క్రాన్తి) నిషేధింప బడుటవలన (అతనికి ఉత్క్రాన్తి సంభవింపదు), ఇతిచేత్ = అనుచో న=అట్లుకాదు, శారీరాత్ = జీవునినుండి కలుగు ప్రాణోత్క్రమణము మాత్రమే అచట నిషేధింపబడుచున్నది.) ఏకేషాం = కొన్ని శాఖల యందు స్పష్టః + హి = (ఈ విషయము) స్పష్టముగదా.

వివ : "న తస్య ప్రాణాః ఉత్క్రామన్తి" (బృ. 6-4-6) ఆ బ్రహ్మవేత్తయొక్క ప్రాణములు ఉత్క్రమింపవు అనుచు శ్రుతి బ్రహ్మ వేత్తకు ప్రాణోత్క్రమణమును నిషేధించుచున్నదిగదా అని శంకింప రాదు. బ్రహ్మవేత్తయైన జీవునియొక్క ప్రాణములు ఆ జీవునినుండి ఉత్క్రమింపవు అని పై శ్రుతికి అర్థము. అర్చిరాది గమన సిద్ధికై అతని ప్రాణములో అతని సూక్ష్మశరీరముతో కలిసియే యుండునని భావము, ఈ విషయము మాధ్యన్దిన ప్రాణమున స్పష్టముగ చూపట్టు

చున్నది. "న తస్మాత్ ప్రాణాః ఉత్క్రామన్తి" (మాధ్యందిన. 6-1) బ్రహ్మవేత్తయైన ఆ జీవునినుండి ప్రాణములు ఉత్క్రమింపవు అనుచు మాధండిన శ్రుతి అర్చిరాదిమార్గమున వయనించి బ్రహ్మమును చేరు నంతవరకు బ్రహ్మవేత్తయైన జీవుని అతని ప్రాణములు అంటిపెట్టుకొని యుండును. వదలిపెట్టవు (ఉత్క్రమింపవు) అని తెలుపుచున్నది గదా. కావున బ్రహ్మవేత్తకును శరీరా దుత్క్రాన్తి గలదని భావము.

**501 సూ॥ స్మర్యతే చ 4_2_13**

**అర్థ ॥** స్మర్యతే చ = (ఈ విషయము) స్మృతియందును చెప్పబడినది.

**వివ :** "ఊర్ధ్వమేకస్థిత స్తేషాం యో భిత్త్వా సూర్యమండలం బ్రహ్మలోక మతిక్రమ్య తేన యాతి పరాంగతిం" (యాజ్ఞవల్క్యస్మృతి) ఆ నాడులలో ఊర్ధ్వముగ బోవునట్టి నాడి (సుషుమ్నా) ద్వారా బయలు వెడలి జీవుడు సూర్యమండలమును భేదించుకొని బ్రహ్మలోకమును అతిక్రమించి ఉత్తమగతి పొందుచున్నాడు అను స్మృతియు మూర్ధన్య నాడిద్వారా బ్రహ్మవేత్తకు ఉత్క్రాన్తిని బోధించుచున్నది. కావున అమృతత్వము అనగా సాక్షాన్ముక్తి అని అర్థముకాదు.

## 140 పరసంపత్త్యధికరణము 6

ఉత్క్రాన్తి దశయందు భూత సూక్ష్మములు పరమాత్మలోనే చేరుచున్నవి.

**502 సూ॥ తాని పరే తథా హ్యాహ 4_2_14**

**అర్థ :** తాని = ఆ భూత సూక్ష్మములు, పరే = పరబ్రహ్మము

నందు, (సంశ్లేషించుచున్నవి) తథా = అట్లు, ఆహ హి = శ్రుతి చెప్పు చున్నదికదా.

వివ : "తేజః పరస్యాం దేవతాయాం" (ఛా 6–8–6) తేజస్సు (భూత సూక్ష్మములు) పరదేవత (పరమాత్మయందు సంశ్లేషించును అనుచుశ్రుతి జీవసంశ్లిష్టములైన భూత సూక్ష్మములు పరమాత్మయందు చేరుటను తెలుపుచున్నది.

**141 అవిభాగాధికరణము 7**

పరమాత్మలో చేరుట అనగా లయించుట అని అర్థము కాదు.
విడదీయరాని విధముగ కలియుట అని అర్థము.

503 సూ॥ అవిభాగో వచనాత్ 4-2-15

అర్థ : అవిభాగః = జీవసంశ్లిష్టములైన భూత సూక్ష్మములు పరబ్రహ్మమును చేరుట (సంపత్తి) అనగా ప్రత్యేకించి పేర్కొనుటకు వీలుకానియట్టి సంశ్లేషించుట అని యర్థము, వచనాత్ = సంపద్యతే అని శ్రుతి చెప్పుటవలన.

వివ : పరబ్రహ్మము సర్వమునకు కారణమగుటవలన "తేజః పరస్యాం దేవతాయాం (సంపద్యతే)" అని చెప్పబడిన పరబ్రహ్మము నందు భూతసూక్ష్మముల "సంపత్తి" అనగా "లయము" అని అర్థము. కావచ్చునుగదా అని తలంపరాదు వాఙ్మనసి సంపద్యతే మనః ప్రాణే ప్రాణ స్తేజసి తేజః పరస్యాం దేవతాయాం" అను శ్రుతి వాక్యమున "సంపద్యతే" అను క్రియయే అంతట అన్వయించుటవలన దానికి "సంశ్లేషించును" అను అర్థమునే అంతట గ్రహించుట యుక్తము.

### 142 తదోకోధికరణము 8

### బ్రహ్మవేత్త మరణ సమయమున భగవదనుగ్రహమువలన సుషుమ్నా నాడిద్వారా బయలువెడలును.

504 సూ॥ తదోకోఽగ్రజ్వలనం తత్ప్రకాశిత ద్వారో విద్యా సామర్థ్యా త్తచ్ఛేష గత్యనుస్మృతి యోగాచ్చ హార్దానుగృహీత శ్శతాధికయా 4-2-16

అర్థ : విద్యా సామర్థ్యాత్ = ఉపాసనా ప్రభావమువలనను, తత్ + శేష + అనుస్మృతి యోగాత్ + చ = అట్టి ఉపాసనమునకు అంగమైన అర్చిరాది గతి చిన్తనమువలనను, హార్ద + అనుగ్రహీతః = హృదయాన్తర్వర్తియైన పరబ్రహ్మముచే బ్రహ్మవేత్త అనుగ్రహింప బడుచున్నాడు. తత్ + ఓకః = ఆ జీవుని స్థానమైన హృదయము, అగ జ్వలనం = నాడీ ముఖమున ప్రకాశము గలదిగా అగుచున్నది. తత్ + ప్రకాశిత ద్వారః = దానిచే ప్రకాశింపజేయబడిన నాడీద్వారము గలవాడై, శత + అధికయా=నూట ఒక్కటియవదైన సుషుమ్నా నాడీ ద్వారా శరీరమునుండి ఉత్క్రమించును.

వివ : పరమ పురుషారాధనరూపమైన బ్రహ్మోపాసనముచేతను దానికి అంగమైన అర్చిరాది గతిచిన్తనముచేతను సంప్రీతుడైన హృదయ కమలాన్తర్వర్తి పరమాత్మ అనుగ్రహింపగా బ్రహ్మవేత్తకు మూర్ధన్య నాడీద్వారాము సుస్పష్టముగ భాసించును. అపుడు అతడు అందు ప్రవేశించి మూర్ధన్య (సుషుమ్నా) నాడీద్వారా ఉత్క్రమిం చును. మన శరీరమున నూటఒక్క నాడులు గలవు. బ్రహ్మవేత్త మాత్రమే భగవదనుగ్రహముచే నూటఒక్కవదైన సుషుమ్నా నాడీ

న్వారా ఉత్క్రమింపగలుగుచున్నాడు. తక్కినవారు ఏదియో ఒకనాడి ద్వారా నిష్క్రమింతురు. "తయోర్ధ్వ మాయన్ అమృతత్వ మేతి" అను శ్రుతి సుషుమ్నానాడిద్వారా ఉత్క్రమించిన వానికే అమృతత్వ ప్రాప్తి గలుగునని బోధించుచున్నది.

### 143 రశ్మ్యనుసారాధికరణము 9

సుషుమ్నా నాడిద్వారా వెలువడిన ఆత్మ సూర్యకిరణముల ద్వారా సూర్యమండలమును జేరును.

505 సూ॥ రశ్మ్యనుసారీ 4-2-17

అర్థ : రశ్మి+అనుసారీ = సూర్యకిరణములను అనుసరించి విద్వాంసుడు పయనించును.

వివ : "అథ యత్రైత దస్మాత్ శరీరాత్ ఉత్క్రామతి అథ ఏతైరేవ రశ్మిభిః ఊర్ధ్వ మాక్రమతే" (ఛా. 8-6-5) బ్రహ్మవేత్త, శరీరమునుండి వెలువడి సూర్యకిరణములద్వారా పైకి బోవుచున్నాడు అనుశ్రుతి సూర్యకిరణములద్వారా జీవునికి ఊర్ధ్వగతిని బోధించుచున్నది మరిరాత్రి మరణించిన వారికి సూర్యరశ్మిద్వారా పైకి వెళ్ళు అవకాశము ఉండదుగదా అని శంకింపవలదు. రాత్రివేళయందును సూక్ష్మరూపమున సూర్యరశ్మి సంచారము ఉండును. రాత్రి ఉబ్బగా నుండుట వీనివలనేగదా.

### 144 నిశాధికరణము 10

బ్రహ్మవేత్తకు రాత్రి మరణము ప్రతిబన్ధకముకాదు.

506 సూ॥ నిశిచేన్న సంబద్ధస్య యావ ద్దేహ భావిత్వాద్దర్శయతి చ 4-2-18

అర్థ : నిశి = రాత్రియందు (మరణించినవానికి) న + ఇతి చేత్ = బ్రహ్మప్రాప్తి లేదుగదా అనుచో, న = అట్లుకాదు, సంబన్ధస్య = కర్మ సంబన్ధము, యావ = దేహభాపిత్వాత్ = శరీరము ఉండునంత వరకే ఉండుటదగుటవలన, దర్శయతి చ = శ్రుతియు ఇట్లు చెప్పు చున్నది.

వివ : "దివా చ శుక్లపక్షశ్చ ఉత్తరాయణ మేవ చ ముమూర్షతాం ప్రశస్తాని విపరీతం తు గర్హితం" పగలు శుక్లపక్షముఉత్తరాయణము ఇవి మరణించువారికి ప్రశస్తములు. ఇందుకు విపరీతమైనవి అప్రశస్తములు అనుటచే రాత్రి మృతిజెందినవానికి బ్రహ్మప్రాప్తి లేదు గదా అని తలంపరాదు. శరీరము ఉన్నంతవరకే ప్రారబ్ధ కర్మ సంబన్ధము ఉండును, సంచిత—ఆగామి కర్మలు ముందే నశించినవి. కావున ఏట్టి కర్మశేషములేనందువలన బ్రహ్మప్రాప్తికి ఆటంకము లేదుగదా. ఇట్టియెడ నిశాదులు బ్రహ్మప్రాప్తిని అడ్డగించజాలవు. "తస్య తావదేవ చిరం-యావన్న విమోక్ష్యే అథ సంపత్స్యే" (ఛా. 5-4-2) బ్రహ్మవేత్త శరీరబన్ధమును వీడుటయే తడవుగా బ్రహ్మమును పొందును అనుచు శ్రుతియు ఈ విషయమును తెలిపినది. కాన బ్రహ్మవేత్తలు కానివారికే నిశామరణాది దోషములు అని గ్రహింపవలయును.

### 145 దక్షిణాయనాధికరణము 11

బ్రహ్మవేత్తకు దక్షిణాయన మరణము ప్రతిబన్ధనముకాదు.

507 సూ॥ అతశ్చాయనేఽపి దక్షిణే 4-2-19

అర్థ : అతః + చ = ఇందువలన, దక్షిణే + అయనే + అపి = దక్షిణాయనమునందు (మరణించిన బ్రహ్మవేత్తకును బ్రహ్మప్రాప్తి గలదు.)

వివ : బన్ధహేతువులైన కర్మలు అన్నియు నశించుటవలన రాత్రి మరణించినను దక్షిణాయనమున మరణించినను బ్రహ్మవేత్తకు బ్రహ్మప్రాప్తి సంభవమే. "అథ యో దక్షిణే ప్రమీయతే పితృణా మేవ మహిమానం గత్వా చన్ద్రమస స్సాయుజ్యం గచ్ఛతి" (తై.నా. 6–5–2) దక్షిణాయనమున మృతిజెందినవారు పితృదేవతల మహిమ లను పొంది చంద్ర సాయుజ్యమును పొందుదురు అను శ్రుతి బ్రహ్మ వేత్తనుగూర్చి చెప్పినదికాదు. బ్రహ్మజ్ఞానములేని వారిని గూర్చి చెప్పినది.

508 సూ॥ యోగినః ప్రతి స్మర్యతే స్మార్తే చైతే 4–2–20

అర్థ : ఏతే = ఈ, స్మార్తే = స్మృతిప్రోక్తములైన దేవయాన పితృయాణములు, యోగినః ప్రతి–యోగులను ఉద్దేశించి, స్మర్యేతే– స్మర్తవ్యములుగా చెప్పబడుచున్నవి.

వివ : "యత్ర కాలే త్వనావృత్తిం ఆవృత్తిం చైవ యోగి నః ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ. అగ్నిర్జ్యోతి రహశ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణం. తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదోజనాః ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనం. తత్ర చాన్ద్రమసం జ్యోతిః యోగీ ప్రాప్య నివర్తతే. నైతే సృతే పార్థజానన్ యోగీ ముహ్యతికశ్చన్ తస్మా త్సర్వేషు కాలేషు యోగ యుక్తో భవాఽర్జున॥ (భ. 8–23–24. 25–27) అర్జున మరణా నన్తరము ఏ కాలభిమాని దేవతలననుసరించిపోయినచో పునర్జన్మ కలుగదో, ఏ కాలాభిమాని దేవతలు ననుసరించిపోయినచో, పునర్జన్మ కలుగునో ఆ మార్గమును తెలిపెదను. అగ్ని రూపమైన జ్యోతిస్సు పగలు శుక్లపక్షము ఉత్తరాయణము. ఈ కాలాభిమాని దేవతల మార్గ

మున పయనించినవారు పునర్జన్మను పొందరు. ధూమము రాత్రి కృష్ణ పక్షము దక్షిణాయనము ఈ కాలాభిమాని దేవతలమార్గమున పయనించినవారు చంద్రుని జేరి మరల జన్మలనందుచుందురు. ఈ మార్గము లను చక్కగ తెలిసినవాడు మోహమును పొందడు. కావున నీవు సర్వదా అర్చిరాది మార్గ చిన్తన గావింపుము అను భగవద్గీతావచనము మరణ కాలమును తెలుపునట్టిదికాదు. బ్రహ్మవేత్త ఈ రెండు మార్గములను చక్కగ తెలిసికొని కానకు గన్తవ్యమైన అర్చిరాది మార్గమును ప్రతి నిత్యము స్మరించుచుండవలయును అని మాత్రమే బోధించుచున్నది. కావున బ్రహ్మవేత్తకు రాత్రి దక్షిణాయనాది మరణదోషములేదు.

చతుర్థాధ్యాయ ద్వితీయపాదము సమాప్తము.

చతుర్థాధ్యాయ ద్వితీయ పాదార్థ
సంగ్రహశ్లోకము

శ్లో॥ పంపద్యే తాఽన్య దక్షం మనసి తదపి తత్ప్రం
యుతం ప్రాణవాయో
సోఽధ్యక్షే తై స్సమేత స్స చ తదఖిలవాన్
భూతవర్గే తు సూక్ష్మే।
ఉత్క్రాన్తి స్సావ్యె త్సమానా యుతి రపి చ పరే
సా చ సంశ్లేష మాత్రం
నిర్గచ్ఛేద్బ్రహ్మనాడ్యా ఘృణిభి రథ నిశా దేవ
రాత్రోశ్చ మోక్షీ।

తా : వాగధికరణమున బాహ్యేంద్రియులు మనస్సున జేరు ననియు, మనోఽధికరణమున ఇంద్రియ విశిష్టమైన ప్రాణవాయువును

జేరుననియు, అధ్యక్షాఽధికరణమున ఆప్రాణవాయువు దేహాధ్యక్షుడైన జీవునియందు జేరుననియు, భూతాఽధికరణమున ఆ జీవుడు భూత సూక్ష్మములయందు చేరుననియు. ఆసృత్యుప క్రమాఽధికరణమున బ్రహ్మవేత్తకును అబ్రహ్మవేత్తకును ఉత్క్రాన్తి సమానమనియు, పర సంపత్త్యధికరణమున భూతసూక్ష్మములతోగూడిన జీవుడు పరమాత్మతో చేరుననియు, అవిభాగాఽధికరణమున సంపత్తిచేరుట అనగా విడ దీయరానివిధముగ కలియుట అనియు, తదోఽధికరణమున బ్రహ్మ వేత్త సుషుమ్నా (మూర్ధన్య) నాడిద్వారా ఉత్క్రమించుననియు, రశ్మ్యనుసారాధికరణమున సూర్యకిరణములద్వారా అర్చిరాదిగమనము ఆరంభమగుననియు. నిశాధికరణమున బ్రహ్మవేత్తకు నిశామరణము దోషము కాదనియు, దక్షిణాయనాధికరణమున దక్షిణాయనమరణము కూడ దోషముకాదనియు. ఈరీతిగా ఈ చతుర్థాధ్యాయ ద్వితీయపాద మైన ఉత్క్రాన్తిదపాదమున ఈ విషయము వివరింపబడినవి.

## చతుర్థాధ్యాయ తృతీయపాదము

## అర్చిరాదిగతిపాదము

### 146 అర్చిరాద్యధికరణము 1

బ్రహ్మవేత్త అర్చిరాదిమార్గముద్వారా పరబ్రహ్మమును చేరును

509 సూ॥ అర్చిరాదినా తత్ప్రథితేః 4–3–1

అర్థ : అర్చిః + ఆదినా = అర్చిరాది మార్గముద్వారా (బ్రహ్మ వేత్త పయనించును) తత్ప్రథితేః = (శ్రుతులయందు) అర్చిరాది మార్గమునకుగల ప్రసిద్ధివలన.

వివ : బ్రహ్మవేత్త అర్చిరాదిగతిద్వారా మాత్రమే పయనించి బ్రహ్మమును పొందును. ఉపనిషత్తులయందు అర్చిరాది మార్గమే బ్రహ్మవేత్తకు ప్రసిద్ధమై యున్నందువలన. "అథ యదు చ అస్మిన్ శవ్యం కుర్వన్తి, యదు చన, అర్చిష మేవ అభిసంభవన్తి అర్చిషః అహః, అహ్నః అపూర్వమాణపక్షః అపూర్వమాణపక్షాం యాన్ షట్ ఉద ఏతి మాసాన్‌తాన్ మాసేభ్య స్సంవత్సరం, సంవత్సరా=, ఆదిత్యః, ఆదిత్యాత్ చంద్రమసం, చంద్రమసః విద్యుతం, తత్పురుషః అమానవః స ఏనాన్ బ్రహ్మగమయతి. ఏష దేవపథో బ్రహ్మపథః ఏతేన ప్రతిపద్యమాః ఇమం మానవం ఆవర్తం నావర్తంతే నా వర్తన్తే" (ఛా. 4-15) బ్రహ్మవేత్త మరణించిన పిదప అతనికి శ్రాద్ధక్రియలు జరిగినను జరుగకున్నను అతడు అర్చిరాది మార్గమున ప్రవేశించును తొలుత అర్చిస్సును, అర్చిస్సునుండి అహస్సును, అహస్సునుండి శుక్లపక్షమును, శుక్లపక్షమునుండి ఉత్తరాయణమును, దానినుండి సంవత్సరమును, సంవత్సరమునుండి సూర్యుని, అతనినుండి చంద్రునికి. చంద్రునినుండి విద్యుత్తును చేరును. అచటనుండి మానవపురుషుడు బ్రహ్మవేత్తను బ్రహ్మమువద్దకు గొనిపోవును. ఈ మార్గమునకు బ్రహ్మపథము (దేవపథము) అనిపేరు. ఈ మార్గమున పోయిన వారికి పునరావృత్తి యుండదు.

### 147 వాయ్వధికరణము 2

సంవత్సర దేవతనుండి వాయు దేవతను చేరును.

**510 సూ॥ వాయు మబ్దా దశేష విశేషాభ్యామ్ 4-5-2**

అర్థ : అవిశేష విశేషాభ్యాం = సామాన్య విశేష శబ్దములచే

పేర్కొనినందువలన, అబ్దాత్ = సంవత్సరమునుండి, వాయుం = వాయువును (బ్రహ్మవేత్తలు చేరుచున్నారు.)

వివ : "తే అర్చిషం అభిసంభవన్తి, అర్చిషః, అహః, అహ్నః అపూర్యమాణపక్షం, అపూర్యమాణ పక్షాత్ యాన్ షణ్మాసాన్ ఉదఙ్ ఆదిత్యః ఏతి, మాసేభ్యో దేవలోకం, దేవలోకాత్ ఆదిత్యః" (బృ. 8-2-15) పంచాగ్ని విద్యోపాసకులును పరబ్రహ్మోపాసకులును (ఉత్క్రాన్తి సమయమున సుషుమ్నానాడిద్వారా) అర్చిస్సును దానినుండి అహస్సును, దానినుండి శుక్లపక్షమును, దానినుండి ఉత్తరాయణమును, దానినుండి దేవలోకమును, దానినుండి ఆదిత్యుని (చేరుచున్నారు) అనియు "యదా వై పురుషః అస్మాత్ లోకాత్ ప్రైతి, స వాయుం ఆగచ్ఛతి. తస్మై సః తత్ర విజిహీతే. యథా రథ చక్రస్య ఖం తేన సః ఊర్ధ్వం ఆక్రమతే. సః ఆదిత్యం ఆగచ్ఛతి" (బృ. 7-10-1) ఉత్క్రాన్తి జెందిన బ్రహ్మవేత్త వాయువును చేరును. ఆ వాయువు అతనికి రథచక్రముయొక్క మధ్యగల రంధ్రమంతటి (బండికన్ను) (అవకాశమును) రంధ్రమును కలిగించును. దానిద్వారా బ్రహ్మవేత్త పైకి వెడలి ఆదిత్యలోకమును చేరును అనియు బృహదారణ్యకోపనిషత్తు ఆదిత్యుని చేరుటకు ముందు వాయువును చేరునట్లు తెలుపుచున్నందువలన, సంవత్సరమునుండి వాయువును వాయువునుండి ఆదిత్యుని బ్రహ్మవేత్త చేరును అని భావించవలయును దేవలోకము అనగా వాయువు అనియే అర్థము. "యోఽయం పవతే, ఏష ఖవ దేవానాం గృహాః" అనుశ్రుతివాక్యము (ఈ వీచుచున్నగాలియే దేవతలకు గృహము) ఈ అరమును తెలుపుచున్నదిగదా.

### 148 వరుణాధికరణము 3

విద్యుత్తులనుండి వరుణుని జేరును.

511 సూ॥ తటితో౽ధి వరుణ స్సంబన్ధాత్ 4-3-3

అర్థ : తటితః + అధి = విద్యుత్తుకంటే పైన వరుణః=వరుణుడు గన్తవ్యుడు, సంబన్ధాత్ = విద్యుత్తునకును వరుణునకును గల సంబన్ధముకలన.

వివ ॥ ఛాందోగ్య బృహదారణ్యకాది - ఉపనిషత్తులయందు అతివాహిక దేవతలుగా 1 అర్చిస్సు 2 అహస్సు 3 శుక్లపక్షము 4 ఉత్తరాయణము 5 సంవత్సరము 6 వాయువు 7 ఆదిత్యుడు 8 చంద్రుడు 9 విద్యుత్తు 10 వరుణుడు 11 ఇంద్రుడు 12 ప్రజాపతి అనువారు పేర్కొనబడియున్నారు. కాని కౌషితకి క్యుపనిషత్తునందు "స వాయు లోకం స వరుణలోకం" అనుచు వాయులోకము తర్వాత వరుణలోకము ప్రస్తుతమైనది. వాయులోకమువరకు అంతట క్రమము సమానమే. అట్టియెడ వరుణుడు వాయువు తర్వాతనా? విద్యుత్తు తర్వాతనా? అను సందేహము కలుగుట సహజముగదా. దీనికి సమాధానము. పాఠ క్రమముకంటెను అర్థక్రమము బలీయమగుటవలన కౌషీతకిపాఠమును ఉపేక్షించి అర్థక్రమానుసారము విద్యుతు తర్వాత వరుణుడని భావింప వలయును. మేఘమునందు విద్యుత్తుతోబాటు ఉదకములును ఉండును. ఉదకములకు అధిష్ఠానదేవత వరుణుడు. ఈ విధముగ విద్యుద్వరుణులకు గల సన్నిహిత సంబన్ధమునుబట్టి విద్యుత్తు తర్వాత వరుణుని భావించుటయే యుక్తము. వరుణునికి తర్వాత ఇంద్ర ప్రజాపతుల స్థానము సిద్ధించునుగదా.

149 అతివాహికాధికరణము 4

అర్చిరాదులు అతివాహికులు

512 సూ|| ఆతివాహికా స్తల్లిఙ్గాత్ 4-3-4

అర్థ : ఆతివాహికాః=(అర్చిస్సు ఆహస్సు మున్నగుదేవతలు) ఆతివాహికులు అనగా ఒక స్థానమునుండి మరియొక స్థానమునకు చేర్చునట్టివారు. తత్ + లింగాత్ = అట్టిసూచనవలన

వివ : అర్చిరాదులు బ్రహ్మవేత్తకు అర్చిరాదిమార్గమున కొండ గుర్తులవంటివారేమో అను సన్దేహమునకు ఈసూత్రము సమాధానము అర్చిరాదులు కొండగుర్తులు కావు. వారు ఆతివాహిక దేవతలు అనగా బ్రహ్మవేత్త తమ లోకమునకురాగానే అతనిని సత్కరించి సాదరముగ పైలోకమునకు సాగనంపునట్టివారు "తత్పురుషః అమానవః సః ఏ నాన్ బ్రహ్మ గమయతి" (ఛా. 4-15) ఆ అమానవ పురుషుడు ఈ బ్రహ్మవేత్తలను బ్రహ్మమును పొందించుచున్నాడు అనుశ్రుతి అర్చిరాదులు బ్రహ్మవేత్తను బ్రహ్మమునొద్దకు చేర్చునట్టి ఆతివాహిక దేవతలే అని సూచించుచున్నదిగదా.

513 సూ॥ వైద్యుతేనైవ తతస్తచ్ఛ్రుతేః 4-3-5

అర్థ : తతః = విద్యుల్లోకమును పొందిన తర్వాత, వైద్యుతే న + ఏవ = విద్యుల్లోకవర్తియగు ఆ మానవ పురుషునిచేతనే (వరు ణేంద్ర ప్రజాపతి లోకములకు కొనిపోబడుదురు. తత్ + శ్రుతేః = అట్టి శ్రుతివచనమువలన.

వివ : బ్రహ్మవేత్త విద్యుల్లోకమునుచేరిన పిదప అచటనుండి వరుణ-ఇంద్రప్రజాపతుల లోకములకు అమానవపురుషుడు కొనిపోవును "తత్పురుషోఽమానవః స ఏనాన్ బ్రహ్మ గమయతి" అను శ్రుతి అమానవపురుషుడే ఆ పైలోకములకు గొనిపోవునని స్పష్టముగ చెప్పు

చున్నదిగదా. వరుణేంద్ర ప్రజాపతి లోకములలో వరుణేంద్రాదులు అమానవపురుషునికి సహకరింతురు. అమానవపురుషుడు నిత్యసూరి కోటిలోనివాడు.

150 కార్యాధికరణము 5

అర్చిరాదిగతి పంచాగ్ని విద్యోపాసకులకును పరబ్రహ్మోపాసకుల కును గలదు.

514 సూ॥ కార్యం బాదరి రస్య గత్యుపపత్తేః 4-3-6

అర్థ : కార్యం = (సృష్టిలో అంతర్భూతుడైన హిరణ్యగర్భ బ్రహ్మను ఉపాసించిన వారిని అర్చికాదిదేవతలు) ఆ హిరణ్యగర్భుని (యొద్దకు చేర్చింతురు అని) బాదరిః = బాదరి అనుమహర్షి (తలంచు చున్నారు) అస్య = కార్య బ్రహ్మోపాసకునకే, గతి + ఉపపత్తేః = అర్చిరాది గతి సంభవమగుటవలన.

వివ ; సర్వ వ్యాప్తమైన కారణ బ్రహ్మమును పొందుటకు ప్రత్యేకించి ఒక మార్గము అవసరములేదు. అది అంతటఉన్నదేగదా కావున కార్యవర్గమున జేరిన హిరణ్యగర్భుని ఉపాసించిన వారిని మాత్రమే అర్చిరాదిమార్గము ఆ హిరణ్యగర్భునియొద్దకు చేర్చును బాదరి మహర్షి ఆశయము.

515 సూ॥ విశేషితత్వాచ్చ 4-3-7

అర్థ : విశేషితత్వాత్ + చ = (ప్రాప్యమైన) బ్రహ్మము బహు వచనాదులచే) విశ్లేషింపబడుటవలనను (హిరణ్యగర్భోపాసకునే అర్చి కాదిగణము కొనిపోవును.)

వివ : "పురుషః అమానవః ఏత్య బ్రహ్మలోకాన్ గమయతి"

(బృ. 8—2—15) అను శ్రుతివాక్యమునందలి "లోకాన్" అను లోకశబ్దము దాని బహువచనము "ప్రజాపతే స్సభాంవేశ్మ ప్రపద్యే" అను శ్రుతియు ప్రాప్యస్థానమును విశేషించి చెప్పుటచేతను అర్చిరాదిగణము హిరణ్య గర్భోపాసకులను హిరణ్యగర్భునియొద్దకు చేర్చునని సిద్ధించుచున్నది.

516 సూ॥ సామీప్యాత్తు తద్వ్యపదేశః 4·3 8

అర్థ : సామీప్యాత్ + తు = పరబ్రహ్మ సాన్నిహిత్యమువలన తత్ + వ్యపదేశః = నపుంసకలింగ బ్రహ్మశబ్దముచే హిరణ్యగర్భునికి బోధించుట.

వివ : "బ్రహ్మ గమయతి" అను శ్రుతివాక్యమునందలి నపుంస కలింగ బ్రహ్మశబ్దము హిరణ్యగర్భుని బోధింపజాలదు. హిరణ్యగర్భ వాచకమైన బ్రహ్మశబ్దము పుంలింగముగ నుండునుగదా. అపుడు "బ్రహ్మాణం గమయతి" అని ఉండవలయును అను ప్రశ్నకు సమా ధానము. "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం" (శ్వే. 6—3—5) ఏ పరమాత్మ తొలుత బ్రహ్మను సృజించుచున్నాడో అనుచు శ్రుతి హిరణ్య గర్భ బ్రహ్మను పరబ్రహ్మముయొక్క ప్రథమసృష్టియగుటచే సన్నిహి తునిగా పేర్కొనుచున్నది. ఇట్టి పరబ్రహ్మ సామీప్యమునుబట్టి చతుర్ముఖ బ్రహ్మముకూడ నపుంసకలింగ బ్రహ్మశబ్దముచే "బ్రహ్మగమయతి" అని శ్రుతి పేర్కొనుటలో దోషములేదు. కావున అర్చిరాది గణము హిరణ్య గర్భుని పొందించునది.

517 సూ॥ కార్యాత్యయే తదధ్యక్షేణసహాఽతః పరమభిధానాత్ 4-3-9

అర్థ : కార్య + అత్యయే=సృజింపబడిన హిరణ్యగర్భలోకము

నకు ప్రళయము సంభవింపగనే, తత్ + అధ్యక్షేణ సహ = ఆ లోకము నకు అధ్యక్షుడైన హిరణ్యగర్భునితోబాటు, అతః పరం = దీనికంటె ఉత్తమమైన పరమపదమును (బ్రహ్మవేత్తయు పొందును) అభిధా వాత్ = శ్రుతి అట్లు చెప్పుటవలన.

వివ : "తే బ్రహ్మలోకే తు పరాన్తకాలే పరామృతాత్ పరిముచ్య న్తి సర్వే" (తై. నా. 6-10-22) వారందరును మహాప్రళయానన్త రము అమృతత్వమును పొంది ముక్తులగుచున్నారు అనుచు శ్రుతి హిరణ్యగర్భలోకమునకు ప్రళయమేర్పడగనే ఆ లోకమునకు అధ్యక్షు డైన హిరణ్యగర్భునితోబాటు అచట బ్రహ్మవేత్తలైనవారును విముక్తు లగుదురు అని తెలుపుచున్నది. కావున అర్చిరాది మార్గముద్వారా హిరణ్యగర్భుని చేరిన హిరణ్యగర్భోపాసకులకును అచట బ్రహ్మజ్ఞాన మేర్పడినచో పునరావృత్తి రహితమైన పరమపదమును వారు పొంద గలరు. ఈ రీతిని అర్చిరాదిగతిద్వారా అపునరావృత్తి సంభవమగుటచే అపునరావృత్తి శ్రుతికి బాధ కలుగదు.

518 సూ.॥ స్మృతేశ్చ 4-3-10

అర్థ : స్మృతేః + చ = స్మృతి వచనమువలనను (ఈ విష యము స్పష్టము.)

వివ : "బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్తే ప్రతి సంచరే పర స్యాన్తే కృతాత్మానః ప్రవిశన్తి పరంపదం" మహాప్రళయము ప్రాప్తించి నంతనే హిరణ్యగర్భుని జీవితావసాన దశయందు అతనితోబాటు ఆత్మ సాక్షాత్కారము నందినవారును పరమపదమును పొందుచున్నారు అను స్మృతియు ఈ విషయమును విశదీకరించుచున్నది.

519 సూ॥ పరం జైమిని ర్ముఖ్యత్వాత్ 4-3-11

అర్థ : పరం = పరబ్రహ్మోపాసకులను అర్చిరాదిగతిగొనిపోవునని, జైమినిః = జైమినిమహర్షి తలంచుచున్నారు. ముఖ్యత్వాత్ = నపుంసకలింగ బ్రహ్మశబ్దమునకు పరబ్రహ్మము అను అర్థమే ముఖ్యమగుటవలన.

వివ : "బ్రహ్మగమయతి" అనువాక్యమునగల నపుంసకలింగ "బ్రహ్మ" శబ్దము పరబ్రహ్మవాచకమేగాని హిరణ్యగర్భవాచకముకాజాలదు. కావున అర్చిరాది-ఆతివాహికగణము పరబ్రహ్మమును చేర్పుపెట్టిదే ఇట్లే "బ్రహ్మలోకాన్" అనునెడ గల సమాన బహువచనములు కూడ సాధకములుకావు. "నిషాదస్థపతి " అనుపదమునకు నిషాదానాంస్థపతిః" (బోయవారిని ప్రభువు) అనికాక, నిషాద ఏవ స్థపతిః = (బోయజాతి వాడైన ప్రభువు) అని అర్థమైనట్లు, ప్రకరణానుగుణముగ బ్రహ్మైవ లోకః = (బ్రహ్మలోకః అని కర్మధారయ సమాసముద్వారా (ఆత్మానమేవలోకం ఉపాసీత) దర్శనీయమైన బ్రహ్మమును అను అర్థమును గ్రహింపవలయును. "అదితిః పాశాన్" అనునెడ "పాశాన్ = పాశం" అని అర్థమైనట్లు "లోకాన్ = లోకం" అని ఏకవచనార్థకమునే ఇచట గ్రహింపవలయును. కావున బ్రహ్మలోకాన్ గమయతి=దర్శనీయమైన పరబ్రహ్మమును పొందుచున్నది అని అర్థము.

520 సూ॥ దర్శనాచ్చ 4-3-12

అర్థ : దర్శనాత్ + చ = శ్రుతివచనమువలనను ఈ అర్థము సిద్ధించుచున్నది.

వివ : "అస్మాత్ శరీరాత్ సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేనరూపేణ అభినిష్పద్యతే" (ఛా. 8-3-4) బ్రహ్మవేత్త ఈ శరీరము నుండి బయలువెడలి పరంజ్యోతిస్సును పొంది స్వస్వరూపముతో ఆవిర్భవించుచున్నాడు అనుశ్రుతి అర్చిరాదిగతి పరబ్రహ్మ ప్రాపకమని స్పష్టముగ చెప్పుచున్నదిగదా.

521 సూ॥ నచ కార్యే ప్రత్యభిసన్ధిః 4-3-13

అర్థ : ప్రత్యభిసన్ధిః=ప్రత్యభిసన్ధానము (గుర్తించుట) కార్యే= కార్యబ్రహ్మమైన హిరణ్యగర్భుని విషయమైనది న చ = కాదు.

వివ : "ప్రజాపతే స్సభాం వేశ్మ ప్రపద్యే" (ఛా. 8-14) ప్రజాపతియొక్క సదస్సును సదనమును పొందుచున్నాను అను వాక్యమునగల ప్రజాపతి శబ్దము హిరణ్యగర్భుని బోధింపదు. "పతిం విశ్వస్య" విశ్వపతి అనికీర్తింపబడిన పరబ్రహ్మమునే బోధించుచున్నది. "ధూత్వాశరీరం అకృతం కృతాత్మా బ్రహ్మలోకం అభిసంభవామి" (ఛా 8-13) శరీరమునువీడి కృతార్థుడనై నిత్యమైన బ్రహ్మలోకమును పొందుచున్నాను అనుచు శాశ్వతమైన బ్రహ్మలోకమునేగదా శ్రుతి ప్రాప్యముగ బోధించుచున్నది. ఇచట "బ్రహ్మలోకశబ్దమునకూడ కర్మ ధారయ సమాసమును భావింపవలయును "యశోఽహం భవామి బ్రాహ్మణానం" బ్రాహ్మణులలో నేను యశస్సును (యశోవంతుడను) అగుదును (ఛా. 8-14) అను వాక్యశేషము బ్రహ్మవేత్తయొక్క పర్వాత్మ భావానుసన్ధానమును బోధించుచున్నది. పరబ్రహ్మమును పొందినపుడే ఇట్టి అనుసన్ధానము సంభవము, కావున అర్చిరాదిగతి పరబ్రహ్మప్రాపకమే (బ్రహ్మఏవలోకః = బ్రహ్మలోకః)

522 సూ॥ అప్రతీకాలమ్బనా న్నయతీతి బాదరాయణ ఉభ
యథా చ దోషా త్తత్క్రతుశ్చ 4-3-14

అర్థ : అప్రతీక + ఆలంబనాన్ = ప్రతీక ఉపాసకులుకానివారి
నయతి + ఇతి = (అర్చిరాదిగణము) తీసుకొనిపోవుచున్నది అని. బాద
రాయణః = బాదరాయణమహర్షి (తలంచుచున్నారు) ఉభయథా చ =
పైరెండు పక్షములలో ఏ పక్షమును అంగీకరించినను, దోషాత్=శ్రుతి
విరోధరూప దోషము చూపట్టువలన, తత్క్రతుః + చ = ఉపాసకుడు
తన ఉపాసనముబట్టిగదా ఉపాసనా ఫలమును పొందుట.

వివ : అర్చిరాదిగణము కార్య బ్రహ్మోపాసకులను మాత్రమే
కొనిపోవుననిగాని పరబ్రహ్మోపాసకులను మాత్రమే కొనిపోవుననిగాని
భావించుట తగదు. "అస్మాత్ శరీరాత్ సముత్థాయ పరంజ్యోతిః ఉప
సంపద్య స్వేన రూపేణ అభినిష్పద్యతే" (ఛా. 8-3-4) ఇత్యాదిశ్రుతి
పరబ్రహ్మోపాసకులను అర్చిరాది గణము కొనిపోవునని తెలుపుచున్నని
గదా. ఇట్లే "తద్య ఇత్థంవిదుః" (ఛా 8-3-4) ఇత్యాది శ్రుతిపంచాగ్ని
విద్యోపాసకులను అర్చిరాదిగణము గొనిపోవునని తెలుపుచున్నది.
కావున ప్రతీకోపాసకులను తప్ప తక్కిన పంచాగ్ని విద్యోపాసకులను
అనగా పరిశుద్ధ జీవాత్మోపాసకులను పరబ్రహ్మోపాసకులను అర్చిరాది
గణము కొనిపోవునని అంగీకరింపవలయును. తత్క్రతు న్యాయము
ననుసరించి ఉపాసనానుసారమేగదా ఫలసిద్ధియు పంచాగ్ని విద్యో
పాసకుడు బ్రహ్మాత్మకమైన తన ఆత్మను ఉపాసింపగా పరబ్రహ్మోపాస
కుడు ఆత్మ శరీరకుడై ఆత్మాన్తర్యామియైన పరమాత్మను ఉపాసిం
చును. గాన తమ తమ ఉపాసనానురూప ఫలమునే వీరు పొందు
చున్నారు. నామాదిప్రాణపర్యన్తముగల నామాదులను బ్రహ్మదృష్టితో

ఉపాసించువారు ప్రతీకోపాసకులు. వీరికి ఫలము పరిమితము. వీరికి పునరావృత్తి తప్పదు. ఇది బాదరాయణమహర్షియొక్క సిద్ధాన్తము.

523 సూ॥ విశేషం చ దర్శయతి 4-3-15

అర్థ : విశేషం చ = (ప్రతీకోపాసకులకు) ఫల విశేషమును, దర్శయతి = శ్రుతి తెలుపుచున్నది.

వివ : "యావన్నామ్నో గతం తత్ర అస్య యథా కామచారః భవతి" (ఛా.7-1-5) నామము వ్యాపించియుండునంతవరకు నామాది ప్రాణపర్యన్తోపాసకునకు స్వేచ్ఛావిహారము గలదు ఇత్యాది శ్రుతి ప్రతీకోపాసకులకు దేశకాల పరిమితిగల ఫలవిశేషములను నిర్దేశించుచున్నది కావున వీరికి పరబ్రహ్మ ప్రాప్తియుండదు. కావుననే అర్చిరాదిగతియు అపునరావృత్తియు వీరికిలేదు. పరబ్రహ్మోపాసకులకును పంచాగ్ని విద్యోపాసకులకును అర్చిరాదిగతియు అపునరావృత్తియు గలవని సిద్ధాన్తము.

చతుర్థాధ్యాయ తృతీయపాదము సమాప్తము

చతుర్థాధ్యాయ తృతీయపాదార్థ
సంగ్రహశ్లోకము

శ్లో॥ ఏకత్వం బ్రహ్మవిద్యా పరిషది సుపథో
దీయమానస్య తస్మిన్
వాయో స్స్వా ద్దేవలోక శ్రుతి రథ వరుణా
ద్యన్వయో విద్యుతోఽధః।
నేతానోఽమానవాన్తాః పరపద గమనే

తద్విదాం సోఽయ మథ్యా
తుర్థాధ్యాయస్య పాదే స్మృతి రధికరణై
రిత్థముక్తా తృతీయే॥

తా : అర్చిరాద్యధికరణమున అర్చిరాది మార్గమొక్కటే బ్రహ్మ వేత్తను బ్రహ్మమునొద్దకు చేర్చునదనియు, వాయ్వధికరణమున అర్చి రాదిమార్గమును వివరించు వాక్యములగల దేవలోకశబ్దము వాయువు వాచకమనియు, వరుణాధికరణమున విద్యుత్తుమదాటి వరుణ ఇంద్ర ప్రజాపతులను చేరుననియు, ఆతివాహికాధికరణమున అర్చిరాదిదేవతలు ముక్తాత్మను అర్చిరాది మార్గమున తమ స్థానమునుండి తమ పై స్థానమునకు చేర్చునట్టి వారనియు, కార్యాధికరణమున అర్చిరాది గమనము బ్రహ్మోపాసకులకేగాక పంచాఽగ్ని విద్యోపాసకులకును అనగా పరిశుద్ధాత్మ స్వరూపోపాసకులకును గలదనియు, ఈరీతిగ ఈ చతుర్థాధ్యాయ తృతీయపాదమైన అర్చిరాదిగతిపాదమున నిరూపింప బడినవి.

## చతుర్థాధ్యాయ చతుర్థపాదము
## స్వరూపావిర్భావపాదము

### 151 సంపద్యావిర్భావాఽధికరణము 1
### బ్రహ్మవేత్త మోక్షమున అపహత పాపత్వాది విశిష్ట సహజ స్వస్వరూపావిర్భావమునందును

524 సూ॥ సమ్పద్యావిర్భావ స్స్వేనశబ్దాత్ 4-4-1

అర్థ : సంపద్య=(జీవుడు పరబ్రహ్మమును) పొంది, అవి

ర్భావః = స్వస్వరూపావిర్భావమును పొందును. "స్వేన" శబ్దాత్ = స్వేన (తనదైన) అను శ్రౌతపదమువలన

వివ : "ఏవమేవైష సంప్రసాదః అస్మాత్ శరీరాత్ సముత్థాయ పరంజ్యోతిః ఉపసంపద్య స్వేనరూపేణ అభినిష్పద్యతే (ఛా.8-12-2) జీవుడు ఈ శరీరమునుండి బయలువెడలి పరంజ్యోతిని (పరమాత్మను) పొంది తనదైన (అపహత పాప్మత్వాది గుణవిశిష్టమైన) రూపముతో ఆవిర్భవించును అని చెప్పుటచేత స్వతః అపహత పాప్మత్వాది గుణ విశిష్టమై ప్రకృతి సంబంధముచే తిరోహితప్రకాశమై యున్న జీవుని స్వస్వరూపమే పరంజ్యోతిః ప్రాప్తిచేతను దేహసంబన్ధము తొలగుట చేతను అసంకుచితజ్ఞానాది గుణకమైన తన సహజ స్వరూపముతో ఆవిర్భవించును. స్వరూపమువలె అసంకుచిత జ్ఞానానన్దాది గుణము లును జీవునికి నిత్యసిద్ధములే. కావున ఇవి క్రొత్తగా మోక్షమున ఏర్ప డవు. ప్రతిబన్ధకము తొలగుటచేత ప్రకాశించును అని భావము. ఇట్టి దశలో ఇతడు నిరతిశయానన్ద బ్రహ్మానుభూతిని పొందగలుగును.

525 సూ॥ ముక్తః ప్రతిజ్ఞానాత్ 4-4-2

అర్థ : ప్రతిజ్ఞానాత్ = (శ్రుతియందు) ప్రతిజ్ఞ చేయుటవలన, ముక్తః = ఇతడు సర్వ బన్ధ వినిర్ముక్తుడు.

వివ : "అహం జానాగా" నేను తెలిసికొనుచున్నాను. మొద లైన వ్యవహారమువలన జీవస్వరూపము జ్ఞానగుణకముగ తెలియ వచ్చుచున్నను కర్మసంబన్ధమువలన నేర్పడిన దేహాదులనుండి విము క్తమై అపరిచ్ఛిన్న జ్ఞానాదికమైన స్వరూపము మోక్షదశయందే ఆవి

ర్భవించును. "ఏతం తు ఏవ తే భూయః అను వ్యాఖ్యాస్యామి" (ఛా. 8-9-3) ఈఆత్మను గురించియే నీకు మరల వ్యాఖ్యానింతును అనుచు మరల మరల ఆత్మనుగురించి ఉపదేశించుచు చివరికి జాగరిత ద్యవస్థా తిరోధానమునుండి విముక్తమై పరిశుద్ధాత్మ స్వరూపమును "స్వేన రూపేణ అభినిష్పద్యతే" అని తెలుపుచు ఉపసంహరించినాడు. కావున పరంజ్యోతిస్సును పొందుటచే నేర్పడు కర్మబన్ధవిముక్తియే స్వరూపావిర్భావము అని సిద్ధించుచున్నది.

526 సూ॥ ఆత్మా ప్రకరణాత్ 4-4-3

అర్థ : ప్రకరణాత్ = ప్రకరణమునుబట్టి, ఆత్మా = జీవాత్మయే (అపహత పాప్మత్వాది గుణవిశిష్టుడుగ తెలియబడుచున్నాడు.

వివ : "య ఆత్మా అపహత పాప్మా విజరో విమృత్యుః విశోకః విజిఘత్సః అపిపాసః సత్యకామసత్యసంకల్పః"(ఛా 8-7-1) ఆత్మ పాపరహితుడు. జరామరణములు లేనివాడు. దుఃఖము ఆకలి దప్పిక లేనివాడు. సత్యకాముడు. సత్యసంకల్పుడు అనుచు జీవాత్మను ప్రస్తావించి "ఏతం తు ఏవ తే భూయః అను వ్యాఖ్యాస్యామి" అనుచు వివరించుటచే దేహాదివినిర్ముక్తము అపహత పాప్మత్వాది గుణ విశిష్టము అయిన ఆత్మస్వరూపముయొక్క ఆవిర్భావము ఇచట చెప్పబడినదని భావము ఈ ప్రకరణము జీవాత్మను గురించి చెప్పునట్టిదికదా.

### 152 అవిభాగేన దృష్టత్వాధికరణము 2

బ్రహ్మతో అవినాభూతుడై ముక్తుడు కల్యాణగుణ విశిష్టబ్రహ్మము ననుభవించును.

527 సూ॥ అవిభాగేన దృష్టత్వాత్ 4-4-4

అర్థ : అవిభాగేన = ముక్తుడు పరబ్రహ్మమునుండి విడివడక (పరబ్రహ్మమును అనుభవించును) దృష్టత్వాత్ = ఉపాసనాచే పర బ్రహ్మాంతర్యామికమైన ఆత్మ స్వరూపమును దర్శించినందువలన.

వివ : "యః ఆత్మని తిష్ఠన్" ఇత్యాది శ్రుతివాక్యములు ఆత్మ యందు పరమాత్మ అన్తర్యామిగా ఉన్నట్లు తెలుపుచున్నవి. కావున ఉపాసకుడు "అహం బ్రహ్మాఽస్మి" నేను బ్రహ్మనై యున్నాను అని ఆత్మస్వరూపమును బ్రహ్మతో అవినాభూతముగధ్యానించుటచే మోక్షం నందును "అహం బ్రహ్మాఽస్మి" అను భావనతోనే బ్రహ్మము ననుభవించును. "నిరంజనః పరమం సామ్యముపైతి" (ముం 3-1-3) ముక్తుడు ప్రకృతి సంబన్ధములేనివాడై పరబ్రహ్మముతో పరమసామ్య మును పొందుచున్నాడు అను శ్రుతి పరమాత్మకు శరీరమై యున్న జీవాత్మ మోక్షమున అపహత పాప్మత్వాది గుణాష్టక ఆవిర్భావముచే పరమాత్మతో అత్యంతము సమానుడైయుండును అని తెలుపుచున్నది "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా" (తై. ఆ. 2-1-2) ఆ ముక్తపురుషుడు సర్వజ్ఞమైన బ్రహ్మముతోబాటు అతని కామములను అనగా కళ్యాణగుణములను (కామ్యన్తే ఇతి కామాః = కళ్యాణ గుణాః) అనుభవించును అనుశ్రుతి బ్రహ్మమునకు శరీరమై యుండు ముక్తుడు తనకు అన్తర్యామియు కళ్యాణవిశిష్టుడు నైన పరబ్రహ్మము ననుభవించునని బోధించుచున్నది కావున జీవాత్మ పరమాత్మల ఈ శరీరాత్మ భావ సంబన్ధముచేతనే "అహంబ్రహ్మాఽస్మి" పరమం సామ్యముపైతి "సోఽశ్నుతే. సహబ్రహ్మణా" ఇత్యాది భేదాఽ భేద శ్రుతులు సమన్వితములగుచున్నవి.

## 153 బ్రాహ్మాధికరణము 3

### అపహత పాప్మత్వాది బ్రహ్మ గుణ విశిష్ట స్వరూపముతో ముక్తుడు ఆవిర్భవించును.

528 సూ॥ బ్రాహ్మేణ జైమిని రుపన్యాసాదిభ్యః 4—4—5

అర్థ : బ్రాహ్మేణ = బ్రహ్మసంబన్ధమైన అపహత పాప్మత్వాది ధర్మముతో (ముక్తుడు ఆవిర్భవించును అని) జైమినిః = జైమిని అను ఆచార్యులు తలంచుచున్నారు ఉపన్యాస + ఆదిభ్యః = ఆ అపహత పాప్మత్వాది ధర్మములనే జీవాత్మలయందును చెప్పుటవలన.

వివ : దహరవిద్యయందు పరమాత్మయొక్క గుణములుగ కీర్తింపబడిన అపహత పాప్మత్వాది సత్యసంకల్పాన్త గుణములే ఛాన్దోగ్యమునందలి ప్రజాపతి వాక్యమున ప్రత్యగాత్మ గుణములుగను ప్రస్తుతములగుటచే ముక్తపురుషుడు మోక్షమున బ్రహ్మగుణములైన అపహత పాప్మత్వాదిగుణములతో గూడియే ఆవిర్భవించును అని జైమిని మహర్షి ఆశయము. "ఆది" శబ్దమువలన "జక్షత్ క్రీడన్ రమమాణః (ఛా. 8-12-3) తినుచు క్రీడించుచు ఇత్యాది శ్రుతివాక్యములవలన దెలియవచ్చు సత్యసంకల్పాదిగుణములను గ్రహింపవలయును. "విజ్ఞాన ఘన ఏవ" (బృ. 6 5-13) ఈ ఆత్మ విజ్ఞానమయుడే అని అన్నంత మాత్రమున ఆత్మయందు అపహత పాప్మత్వాది గుణములు ఉండవని తలంపరాదు. ఉప్పుగల్లును "రసఘన ఏవ" లవణ రసమయము అని అన్నంతమాత్రమున ఆ ఉప్పుగల్లునందు రంగు స్పర్శవంటి గుణములు ఉండవని అర్థము కాదుగదా. జడత్వ వ్యావృత్తికై "విజ్ఞాన ఘనఏవ" అని చెప్పబడినది. కావున 'ఆత్మ స్వరూపము విజ్ఞానఘనము

అపహత పాప్మత్వాది గుణవిశిష్టమునై యుండును. ముక్తిదశయందు ఇది నిరాటంకముగ భావించుము అని భావము.

529 సూ॥ చితితన్మాత్రేణ తదాత్మకత్వాది త్యౌడులోమిః 4-4-6

అర్థ ॥ చితి = చిత్తునందు, తన్మాత్రేణ = చిన్మాత్ర (స్వరూప) ముతో (ఆవిర్భవించును) తత్ + ఆత్మకత్వాత్ = చిత స్వరూపుడు అగుటవలన (అని) ఔడులోమిః = ఔడులోమి అను ఆచార్యుడు (తలంచుచున్నారు.)

వివ : విజ్ఞాన ఘనఏవ" విజ్ఞానమయుడే అని అవధరించి చెప్పుటవలన చిన్మాత్రస్వరూపుడుగా ముక్తుడు ఆవిర్భవించును అని ఔడులోమి మహర్షి ఆశయము.

530 సూ॥ ఏవమప్యుపన్యాసా త్పూర్వభావా దవిరోధం బాదరాయణః 4-4-7

అర్థ : ఏవం + అపి = ఆత్మ విజ్ఞానఘనుడే అయినను, ఉపన్యాసాత్ = (అపహత పాప్మత్వాది గుణములనుకూడ శ్రుతియే) చెప్పుటవలనను. పూర్వభావాత్ = ముందు చెప్పిన ఆ గుణములు ఆత్మయందు ఉండుట సంభవమే అగుటవలనను. అవిరోధః = విజ్ఞాన ఘనత్వ అపహత పాప్మత్వాదులకు పరస్పర విరోధము లేదని, బాదరాయణః = బాదరాయణమహర్షి తలంచుచున్నారు.

వివ : విజ్ఞానఘనుడు అగుటచే స్వయంప్రకాశమానస్వరూపుడైన ఆత్మయందు పూర్వము ప్రస్తుతములైన అపహత పాప్మత్వాది

గుణములును ఉండును. విరోధములేదు. రెంటిని శ్రుతియే బోధించి నదిగదా. కావున ముక్తిదశయందు ఆత్మ కల్యాణ గుణవిశిష్టమైన స్వరూపముతో ఆవిర్భవించును అని బాదరాయణమహర్షి ఆశయము. ఇదియే సిద్ధాన్తము.

### 154 సంకల్పాధికరణము 4

ముక్తుడు సంకల్పించినంతనే అభిమతార్థసిద్ధిని పొందును.

531 సూ॥ సఙ్కల్పాదేవ తచ్ఛ్రుతేః 4-4-8

అర్థ : తత్ + శ్రుతేః = "సంకల్పాదేవాఽస్య పితర స్సముత్తిష్ఠన్తి" అను శ్రుతివలన, సంకల్పాత్ + ఏవ = సంకల్పమాత్రముననే (పితాదులు ఆవిర్భావము).

వివ : "సంకల్పా దేవాఽస్య పితర స్సముత్తిష్ఠన్తి (ఛా. 8-2-1) (ముక్తపురుషుని) సంకల్పమాత్రముననే అతని పితరులు సాక్షాత్కరింతురు అని చెప్పుటచేత ముక్తునకు ఆయా లోకములయందు యథేచ్ఛావిహారాదులు పితాది సాక్షాత్కారాదికము సంకల్పమాత్రమున సిద్ధించుచున్నవి. ముక్తుడు పరమాత్మతో పరమసామ్యమును పొంది యున్నందువలన అతని అనుగ్రహముతో సంకల్పమాత్ర సృష్టిని ఇతడు గావింపగలుగుచున్నాడు అని భావము.

532 సూ॥ అత ఏవ చాఽనన్యాధిపతిః 4-4-9

అర్థ : అతః + ఏవ చ = ఇందువలననే, అనన్య + అధిపతిః = కర్మాదికమును నియామకముగ కలిగియుండడు.

వివ : ముక్తపురుషునిగూర్చి శ్రుతి "సత్యసంకల్పుడు" అని చెప్పుటవలననే ముక్తుడు కర్మాధీనుడుకాడు. కర్మాధీనుడైనచో అతనికి

ఆయా లోకాలలో స్వేచ్ఛావిహారాదికము సంభవింపదుగదా (అనన్యాధిపతిత్వము = కర్మాధీనత్వము.)

155 అభావాధికరణము 5

ముక్తునకు స్వసంకల్పసిద్ధమైన శరీరము ఉన్నను లేకున్నను బాధలేదు.

533 సూ॥ అభావం బాదరి రాహ హ్యేవమ్ 4-4-10

అర్థ : అభావం = (ముక్తునికి శరీరేంద్రియాదుల) అభావము, బాదరిః = బాదరిమహర్షి (భావించుచున్నారు) ఏవం = ఇట్లు, ఆహ హి = శ్రుతియు చెప్పుచున్నదికదా.

వివ : న హ వై సశరీరస్య సతః ప్రియాఽప్రియయోః అపహతిః అస్తి. అశరీరం వా సన్తం న ప్రియాఽప్రియే స్పృశతః (ఛా. 12-1) శరీరము ఉన్నంతకాలము సుఖదుఃఖములు తొలగవు. శరీరము వీడినంతనే ఇక సుఖదుఃఖములుచేరవు అనిశ్రుతి తెలుపుటవలన ముక్తునకు శరీరేంద్రియాదులు ఉండవు అని బాదరిమహర్షిమతము.

534 సూ॥ భావం జైమిని ర్వికల్పామననాత్ 4-4-11

అర్థ : వికల్ప + ఆమననాత్ = వివిధ కల్పమును అనగా నానా భావమును శ్రుతి చెప్పుచున్నందువలన, భావం = శరీరేంద్రియాది సద్భావమును, జైమినిః = జైమిని మహర్షి అంగీకరించుచున్నారు.

వివ : "స ఏకధా భవతి త్రిధా భవతి" (ఛా. 26-2) ఆ ముక్తుడు ఒకడు ముగ్గురుగా అగుచున్నాడు అని శ్రుతి చెప్పుచున్నందు వలన ముక్తునకు శరీరేంద్రియాదులు గలవని జైమినిమహర్షి తలంచు

చున్నారు. ముక్తుని శరీరము కర్మజనితముకాదు. సంకల్పమాత్రజనిత మని గుర్తుంచుకొనవలయును.

535 సూ॥ ద్వాదశాహవ దుభయవిధం బాదరాయణోఽత [3]

4-4-12

అర్థ : అతః + సంకల్పముమబట్టి, ద్వాదశాహవత్ = ద్వాదశాహమువలె, ఉభయవిధం = ముక్తుని సశరీరునిగ అశరీరునిగను, బాదరాయణః = బాదరాయణమహర్షి అంగీకరించుచున్నారు.

వివ : "స ఏకధా భవతి త్రిధా భవతి" అనియు "న హ వై సశరీరస్య సతః ప్రియాఽప్రియయోః అపహతిరస్తి" అనియు రెండు విధములైన శ్రుతులవలనను ముక్తునకు సశరీరత్వ అశరీరత్వములు రెండును సంభవము అని బాదరాయణమహర్షి సిద్ధాన్తము ద్వాదశాహము అను క్రతువుసంకల్పానుసారముగ సత్రము అహీనము అగు రీతిని ముక్తుడును సంకల్పానుసారము సశరీరుడుగాని అశరీరుడుగాని కావచ్చును అని భావము.

536 సూ॥ తన్వభావే సన్ధ్యవ దుపపత్తేః 4-4-13

అర్థ : తను + అభావే=శరీరములేనిచో, సన్ధ్యవత్=స్వప్నమునందువలెనే, ఉపపత్తేః = (లీలారసానుభూతి) ఉపపన్నమగుటవలన (ఆ పక్షము యుక్తమే)

వివ : ముక్తపురుషుడు తాను సృజించుకొను శరీరాదులులేని పక్షమున స్వప్నమునందు పరమాత్మ సృష్టములైన రథాదులను ఎట్లు అనుభవించునో అట్లే మోక్షమునకు పరమాత్మచే సృజింపబడిన

శరీరాద్యుపకరణములద్వారా లీలారసమును అనుభవించును. ఇచట శరీరాదులు లేకపోవుట అనగా తాను సృజించుకొనిన శరీరాదులు లేకపోవుట అని అర్థము.

537 సూ॥ భావే జాగ్రద్వత్ 4-4-14

అర్థ : భావే = శరీరాదులు కలవు అని అంగీకరించుపక్షమున జాగ్రద్వత్ = మేల్కొనియున్న వానివలె (లీలారసమును అను- భవించును.)

వివ : ముక్తుడు తన సంకల్పమాత్రమున సృజించుకొన్న శరీరమును కలిగియున్నచో జాగ్రద్దశయందువలే లీలారసమును అనుభవించును. భగవన్తుడు దశరథాదులను తనకు పిత్రాదులుగా జేసికొని రామాదిరూపములతో అవతరించి లీలారసమును ఎట్లు అనుభవించెనో అట్లే ముక్తపురుషుడును అనుభవించునని తాత్పర్యము.

538 సూ॥ ప్రదీపవ దావేశ స్తథా హి దర్శయతి 4-4-15

అర్థ : ప్రదీపవత్ = దీపమువలెనే, ఆవేశః = (ముక్తునకు అనేక శరీరములయందు) ప్రవేశము (సంభవమే), తథా = అట్లు దర్శయతి హి = శ్రుతి తెలుపుచున్నదిగదా.

వివ : అణుపరిమాణుడైన జీవుడు అనేక శరీరములయందు ఎట్లు ఉండును అను సందేహమునకు సమాధానము. దీపము ఒకే స్థలమునందు ఉన్నను దాని కాన్తి అనేక ప్రదేశములయందు వ్యాపించియుండు రీతిని జీవుడు అణుపరిమాణుడైనను జ్ఞానగుణముచే అనేక శరీరములయందు వ్యాపించియుండును. శరీరమునందును జీవునికి సమగ్రదేహవ్యాప్తి జ్ఞానగుణముచేతనేగదా. శ్రుతియు వాలా-

గ్రశత భాగస్య శతధా కల్పితస్య చ. జీవోభాగస్య విజ్ఞేయః స చానన్త్యాయ కల్పితే వెంట్రుకకొనను నూరుభాగములుగా ఖండించి అందొక భాగమును మరల నూరుభాగములుగ ఖండించినచో ఆ భాగం ఎంత సూక్ష్మముగ నుండునో అంతటి సూక్ష్మ పరిమాణముగలవాడు జీవుడు. ఈతడే అనన్తుడును అగుచున్నాడు అనుచు జీవుని అణుత్వ మును సర్వత్రవ్యాప్తింపు మత్త్వమును సోదాహరణముగ బోధించి నది కావున ముక్తుడు అనేక శరీరములయందు ఉండుటలో బాధలేదు భావము.

539 సూ|| స్వాప్యయ సంపత్త్యో రన్యతరాపేక్ష మావిష్కృతం హి 4-4-16

అర్థ : స్వాప్యయ సంపత్త్యోః = సుషుప్తి మరణదశలయందు అన్యతర + అపేక్షం = ఎదో ఒకదానిని గురించి (జ్ఞానశూన్యత్వము చెప్పబడినది.) ఆవిష్కృతం హిం = ఈ విషయము శ్రుతిచే బోధింప బడినదిగదా.

వివ : "ప్రాజ్ఞే నాత్మనా సంపరిష్వక్తః న బాహ్యం కించన వేదనాఽఽన్తరం" (బృ. 6–3–21) జీవుడు పరమాత్మతో కలిసినవాడై బాహ్యాభ్యన్తర పదార్థములను వేనిని తెలిసికొనజాలడు అనుచు శ్రుతి పరబ్రహ్మతో చేరిన జీవునకు అన్తరబాహ్య జ్ఞానలోపమును తెలుపు చున్నది ఇట్టియెడ ముక్తునకు జ్ఞానానన్త్యము ఎట్లు సిద్ధించుమ అను సందేహముపలదు. ఇట్టి బాహ్యాభ్యన్తర పదార్థ జ్ఞానశూన్యత సుషుప్తి యందు మరణదశయందు మాత్రమే సంభవించును. కాని మోక్షదశ యందు పరమాత్మ సామ్యమునుబట్టి సర్వజ్ఞుడై యుండును. "నాహ

ఖలు అయం ఏవం సంప్రతి ఆత్మానాం జానాతి అయమహం అస్మీతి" (ఛా. 8-11 2) నిద్రయందు జీవుడు నేను ఇట్టివాడను అని తెలిసికొన జాలడు అనువాక్యము సుషుప్తిదశయందలి జ్ఞానశూన్యతను తెలుపు చున్నది "ఏతేభ్యః భూతేభ్యః సముత్థాయ తాన్యేవ అనువినశ్యతి" (బృ. 6-5-13) పురుషుడు ఈ భూతములనుండి బయలువెడలి ఈ భూతములను తెలిసికొనజాలడు అనువాక్యము మరణదశయందలి జ్ఞానశూన్యతను తెలుపును. సవా ఏష దివ్యేన చక్షుషా మనసా ఏతాన్ కామాన్ పశ్యన్" (ఛా. 8 12-5) ఈముక్తపురుషుడు బ్రహ్మలోకమున గల భోగవస్తువులను దివ్యమైన జ్ఞాన నేత్రముతో దర్శించుచు అను భవించును అనువాక్యము ముక్తపురుషుని సర్వజ్ఞత్వమును తెలుపు చున్నది.

## 156 జగద్వ్యాపారవర్జాధికరణము 6

### జగత్సృష్ట్యాదులు పరమాత్మ కార్యములే ముక్తునకు అవి సంభవింపవు.

540 సూ॥ జగద్వ్యాపారవర్జం ప్రకరణా దసన్నిహితత్వాచ్చ 4-4-17

అర్థ : జగత్ + వ్యాపారవర్జం = ముక్తైశ్వర్యము జగత్కర్తృ త్వాది రహితమైయుండును, ప్రకరణాత్ = ఈశ్వరునిమాత్రమే జగ- త్కారణముగ పేర్కొను సృష్టి ప్రకరణమువలనను, అసన్నిహిత త్వాత్ + చ = ఆ సృష్టి ప్రకరణమున ముక్తుడు సన్నిహితుడుకానందు వలనను.

వివ : ముక్తునకు పరమాత్మతో పరమ సామ్యాపత్తి సిద్ధించు

టచే జగత్కర్తృత్వాదికముకూడ సంభవించునుగదా అనినచో కాదు. జగత్కర్తృత్వాదికము పరమాత్మ కార్యమే. "యతో వా ఇమాని భూతాని జాయన్తే" (తై. భృ 1) దేనినుండి ఈ భూతములు పుట్టు చున్నవో సదేవ సోమ్య ఇద మగ్రే ఆసీత్ (ఛా.6-2- ) ఓసౌమ్యుడా ఇదియంతయు సృష్టికి పూర్వం సద్రూపముగనే ఉండినది. "ఏకో హవై నారాయణః ఆసీత్" (మహోపనిషత్) నారాయణుడు ఒక్కడేగదా ఉండినది. ఇత్యాది సృష్టివాక్యములు పరమాత్మనే జగత్కారణముగ పేర్కొనుచున్నవి. ఆ ప్రకరణమున ముక్తుల ప్రస్తావనలేదుగదా. కావున పరమాత్మయొక్క సృష్ట్యాదికర్త ముక్తునకు పరమాత్మతో పరమ సామ్యాపత్తి అనగా జగత్కర్తృత్వాదికమును మినహాయించి తక్కిన విషయములయందని భావము.

541 సూ॥ ప్రత్యక్షోపదేశా దితిచే న్నాధికారిక మణ్డలస్థోక్తే 4-4-18

అర్థ : ప్రత్యక్ష + ఉపదేశాత్ = ముక్తునికి జగత్కర్తృత్వాదికమును శ్రుతి చెప్పుటవలన, న + ఇతి చేత్ = ముక్తైశ్వర్యము జగత్కర్తృత్వాదిరహిత కాననినచో, న=అట్లుకాదు. అధికారికమండలస్థ+ ఉక్తే + ఆ శ్రుతి వాక్యములు అధికారి స్థానములయందు ఉండు గర్భాదుల భోగములను అనుభవించుచున్నాడు అని తెలుపుటవలన.

వివ : "స స్వరాట్ భవతి. తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి" (ఛా. 7-25-2) ఆ ముక్తపురుషుడు స్వయంప్రకాశమానుడగును. అతడు అన్నిలోకములయందును యథేచ్ఛగా సంచరించును ఇత్యాది శ్రుతులు జగద్వ్యాపారములను ఉపదేశించుటచే ముక్తుడు

జగత్సృష్ట్యాదికములను గావింపగలదుగదా అని అనరాదు. పరమ పురుషునిచే ఆయా అధికారములయందు నియోగింపబడిన హిరణ్య గర్భాదుల లోకములయందు గల భోగములను పరమపురుషుని అను గ్రహముతో ఇచ్ఛానుసారము ముక్తుడు అనుభవించును అనిమాత్రమే పైశ్రుతి వాక్యమునగలదు. జగన్నియమాదులను గావించునని అందు చెప్పబడలేదు. కావున ముక్తైశ్వర్యము జగద్వ్యాపారరహితమే.

542 సూ॥ వికారావర్తి చ తథాహి స్థితి మాహ 4-4-19

అర్థ : వికార + అవర్తి చ = జన్మాదివికారములులేని బ్రహ్మ మునే ముక్తుడు అనుభవించును), తథా = అట్లే, స్థితిం = ముక్తుని బ్రహ్మానుభవస్థితిని, ఆహ హి = శ్రుతిచే చెప్పుచున్నదిగదా.

వివ : ముక్తుడు జన్మాదివికారములేని పరబ్రహ్మమునే అను భవించును అని శ్రుతి చెప్పుచున్నది. అనగా జన్మాదివికారములు హేయగుణములులేక కళ్యాణగుణాకరుడు నిరతిశయానన్దయుక్తుడునైన పరమాత్మను అతని కళ్యాణగుణములను అతని ఉభయవిభూతులను ముక్తుడు అనుభవించును అని భావము. "రసో వై సః రసం హ్యేవ అయంలబ్ధ్వా ఆనన్దభవతి"(తై.ఆ.2-7-1) పరమాత్మ ఆనన్దమయుడు అట్టి ఆనన్దమయుడు పరమాత్మను పొందిన ఈ ముక్తపురుషుడును ఆనన్దముగలవాడగుచున్నాడు అను శ్రుతియు ఈ విషయమును తెలుపు చున్నది పరమాత్మను పొందుట అనగా నిరతిశయానన్ద స్వరూపము అనన్త కళ్యాణగుణాకరము అనన్త మహావిభూతివిశిష్టమునైన పర మాత్మను పొందును అనియేగదా అర్థము. కావున ముక్తపురుషుడు

ఇచ్ఛానుసారము లీలా విభూతియందుగల హిరణ్యగర్భాదులలోకముల యందును సంచరింపవచ్చును.

543 సూ॥ దర్శయత శ్చైవం ప్రత్యక్షానుమానే 4-4-20

అర్థ : ప్రత్యక్ష + అనుమానే = శ్రుతిస్మృతులు, ఏవం = ఇతి
దర్శయతః = బోధించుచున్నవి.

వివ : "తస్మాత్ వా ఏతస్మాత్ ఆత్మనః ఆకాశః సంభూతః (తై.ఆ.2-1-2) ఆ యీపరమాత్మనుండి ఆకాశము జనించినది ఇత్యాది శ్రుతులును, "అహం సర్వస్య జగతః ప్రభవః ప్రళయః తథా" (గీ. 10-8) ఈ సమస్త ప్రపంచముయొక్క సృష్టి సంహారములనుగావించు వాడను నేనే అని చెప్పునట్టి స్మృతులును పరమాత్మనే జగజ్జన్మాది కారణముగ బోధించుచున్నవి. ఇట్లే ముక్తపురుషుని నిరతిశయానన్దానుభవమునకు హేతువు ఆ పరమాత్మయే అని "ఏషః హి ఏవ ఆనన్దయాత్" (తై.ఆ.) ఈ పరమాత్మయేగదా ముక్తుని ఆనన్దింపజేయునది అనుశ్రుతియు, "బ్రహ్మణః హి ప్రతిష్ఠాఽహం అమృతస్య అవ్యయస్య చ శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్య ఐకాన్తికస్య చ (గీ. 14-27) జరామరణములులేని పరిశుద్ధాత్మస్వరూపప్రాప్తికి, నిరతిశయైశ్వర్యమునకు, నిరతిశయానన్దమునకు ఆధారము నేనే అనుస్మృతియుబోధించుచున్నవి. కావున ముక్తైశ్వర్యము జగద్వ్యాపారరహితమే.

544 సూ॥ భోగమాత్ర సామ్య లిఙ్గాచ్చ 4-4-21

అర్థ : భోగమాత్ర సామ్య లింగాత్ + చ = ముక్తపురుషునకు ఆనన్దాద్యనుభవమునందు మాత్రమే పరబ్రహ్మముతో సామ్యము అని

తెలుపునట్టి శ్రుతివచనము వలనను (ముక్తపురుషుని ఐశ్వర్యము జగ ద్వ్యాపార వర్జమే.)

వివ : "సః అశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విప శ్చితా" (తై.ఆ. 2-1-2) ఆముక్తపురుషుడు సర్వజ్ఞుడగు పరబ్రహ్మతో బాటు అతినిసర్వభోగములను అనుభవించుచున్నాడు ఈ మొదలైన శ్రుతివచనములు నిరతిశయానన్దాది భోగమున మాత్రమే ముక్తునకు పరమసామ్యమును వర్ణించుచున్నవి. కావున ముక్తైశ్వర్యము జగ ద్వ్యాపారరహితమే.

545 సూ॥ అనావృత్తిః శబ్దా దనావృత్తిశ్శబ్దాత్ 4-4-22

అర్థ : శబ్దాత్ = శ్రుతివలన, అనావృత్తిః = (ముక్తపురుష నికి) పునరావృత్తిలేదని తెలియుచున్నది.

వివ : "స ఖల్వేవం వర్తయన్ యావదాయుషంబ్రహ్మలోకం అభిసంపద్యే న సః పునరావర్తతే" (ఛా. 8-15-1) బ్రహ్మవేత్త ఈ విధముగ జీవితాన్తము ఉపాసన గావించి (మరణానన్తరము) పర బ్రహ్మమును పొందినవాడై మరల ఈ సంసారమండలమునకు తిరిగి రాడు అను శ్రుతివచనమువలన ముక్తునకు పునరావృత్తి యుండదు. "ఆ బ్రహ్మ భువనా ల్లోకాః పునరావర్తినోఽర్జున మాముపేత్య తు కౌ న్తేయ పునర్జన్మ న విద్యతే" (భ.గీ 8-15) అర్జున బ్రహ్మలోకము వరకుగల లోకములన్నియు జీవునకు పునరావృత్తిని కలిగించునట్టివే. కాని నన్ను పొందిన వారికి మాత్రము పునర్జన్మ కలుగదు అనుచు గీతాచార్యుడును పరబ్రహ్మమును పొందినవారికి పునర్జన్మ యుండ దని స్పష్టమొనర్చినాడు. పరమాత్మ సర్వస్వతంత్రుడై ముక్తుని

ఐశ్వర్యము పరమాత్మ సంకల్పాధీనమైన దయినను తనకు అత్యం తము ప్రియమైన ముక్తునికి అతడు పునర్జన్మను ఎన్నటికిని కలిగింపడు. "ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః" (గీ. 7-17) జ్ఞానికి నేను నాకు జ్ఞాని అత్యంతము ప్రియులముగదా అని గీతాచార్యుడే ఈ విషయమును స్పష్టముగ నుడివినాడు గదా.

కావున ముముక్షువైన చేతనుడు జగత్కారణమైన బ్రహ్మతత్త్వ మును గురుసన్నిధిని శాస్త్రముద్వారా తెలిసికొని శాస్త్ర విహితములు స్వవర్ణాశ్రమోచితములు అయిన నిత్యనైమిత్తిక కర్మలను అహంకార మమకారరహితుడై నిష్కామముగ ఆచరించుచు శమదమాద్యాత్మ గుణములు గలిగి ఆహారనియమాదులను పాటించుచు యావజ్జీవము తైలధారవలె అవిచ్ఛిన్నమైన భక్తిరూపాపన్న స్మృతి సంతానముతో శ్రియఃపతియైన పరమాత్మను ధ్యానించుచుండవలయును. ఇట్టి ముముక్షువు భగవదనుగ్రహపాత్రుడై శరీరావసానమున (మూర్ధన్య) సుషుమ్నానాడిద్వారా అర్చిరాది మార్గమున ప్రవేశించి ఆ మార్గమున ఆతివాహికులచే సత్కార పూర్వకముగ కొనిపోబడి పరమపదము పర బ్రహ్మమును చేరి అపహత పాప్మత్వాది కల్యాణగుణ విశిష్ట స్వరూప ముతో సహస్ర స్థూణా మండపమున నిత్యసూరి పరిషత్తున ప్రవేశించి శేషపర్యంకమున విరాజిల్లు శ్రియఃపతి యనుగ్రహముతో సాలోక్య సారూప్య సాయుజ్య సామీప్యములను హొంది పరిపూర్ణ బ్రహ్మానుభవా నన్ద పరీవాహ రూపమైన భగవత్కైంకర్య రసమును యావదాత్మ భావిగ అనుభవించుచుండును అని ఉపనిషత్తులకు వ్యాఖ్యానమైన

బ్రహ్మసూత్రముల సారాంశము. "అనావృత్తి శ్శబ్దాత్" అను సూత్రమును రెండుమార్లు పఠించుట గ్రంథ పరిసమాప్తికి సూచకము.

చతుర్థాధ్యాయ చతుర్థపాదము సమాప్తము
చతుర్థాధ్యాయము సమాప్తము
బ్రహ్మ మీమాంసా శాస్త్రము సమాప్తము

శ్లో॥ ఆత్రేయ శ్రీ శ్రీనివాస రామానుజ విపశ్చితా।
ఇత్థం శ్రీభాష్యసారోఽయం వ్యరచ్యత సతాం ముదే॥

శ్లో॥ శ్రీ వేంకటాచలాధీశ చరణాఽంభోరుహ ద్వయే।
భక్త్యా శ్రీభాష్యసారోఽయం తద్దాసేనస మర్ప్యతే॥

శ్లో॥ వేదాత్మక ప్రమాణేన సాత్త్వికైశ్చ ప్రమాతృభిః।
ప్రమేయేణ సహ శ్రీమాన్ వర్ధతాం యతి శేఖరః॥

శ్లో॥ పుణ్యాఽంభోజ వికాసాయ పాపధ్వాన్త క్షయాయ చ।
శ్రీమాన్ ఆవిరభూ ద్భూమౌ రామాజ దివాకరః॥

శ్లో॥ ప్రాచార్యం కృష్ణ సూరీంద్రం వేదాన్తద్వయ దేశికమ్।
శ్రీశేష సూరి వంశాఽబ్ధి చందిరం ప్రణతోఽస్మ్యహమ్॥

చతుర్థాధ్యాయ చతుర్థ పాదార్థ
సంగ్రహ శ్లోకము

శ్లో॥ స్వావిర్భావోఽపవర్గే నిరుపధి నియత
స్వ ప్రకారత్వన్త దృష్టిః
చిద్రూపస్యైవ తద్వ చ్ఛృతి మతుట మితై

స్స్వప్రకారై స్స్వహేజా।
సంకల్పాదేవ సిద్ధి స్తనుష చ నియమో
న్ముక్తతా బ్రహ్మసామ్య
ప్రాప్తౌ తల్లక్షణాఽంశో జ్ఝన మితి చర
మాధ్యాయ తుర్యాంశ పాదః।

తా : సంపద్యా విర్భావాధికరణమున ముక్తునకు మోక్షదశ యందు కర్మబన్ధ నివృత్తి అగుటవలన అపహత పాప్మత్వాది విశిష్టమై స్వ స్వరూపముతో అతడు ఆవిర్భవించుననియు, అవిభాగేన దృష్ట త్వాధికరణమున బ్రహ్మాన్తర్యామికుడైన ముక్తుడు త దవినాభూతుడై కళ్యాణగుణ విశిష్టమైన బ్రహ్మమును అనుభవించుననియు, బ్రాహ్మా ధికరణమున జీవుడు చిద్రూపియే అయినను శ్రుత్యన్తప్రతిపాదితము లైన అపహత పాప్మత్వాది గుణములను కూడ కలిగియుండుననియు, సంకల్పాధికరణమున ముక్తునకు సంకల్పమాత్రమున స్వాభిమతాఽర్థ సిద్ధికలుగుననియు, అభావాధికరణమున ముక్తునకు దేహము ఉండి తీరవలయునను నిర్బంధములేదనియు జగద్వ్యాపారవర్జాధికరణమున ముక్తునకు బ్రహ్మముతో పరమసామ్యము కలిగినను జగత్స్రష్టృత్వా దులు అతనికి సంభవింపవనియు ఈ రీతిగా ఈ చతుర్థాధ్యాయ చతుర్థపాదమైన స్వరూపావిర్భావపాదమున నిరూపింపబడినవి.

## బ్రహ్మసూత్ర ప్రమేయసారము

శ్లో॥ స్రష్టా దేహీ స్వనిష్ఠో నిరవధి మహిమాఽ
పాస్త బాధః శ్రుతాప్తః
ఖాత్మాదే లింద్రియాదే రుచిత జనవకృ

త్వంసృతౌ తన్నివాహీ!
నిర్దోషత్వాదిరమ్యో బహుభజన పదం
స్వార్థ కర్మ ప్రసాదః
పాపచ్ఛి ద్బ్రహ్మనాడీ గతికృ దతివహ త్సామ్య
ద శ్చాత్ర వేద్యః||

తా: ఈ బ్రహ్మసూత్రముల ప్రథమాధ్యాయ ప్రథమపాదమున పరబ్రహ్మము జగత్కారణమని, రెండవపాదమున అతడు జగచ్ఛరీరకు డని, తృతీయపాదమున జగత్తునకు అతడు ధారకుడని, చతుర్థపాద మున నిఖిల జగదేకాకారణత్వాదిరూపమైననిరతిశయ మహిమగలవాడని

ద్వితీయాధ్యాయ ప్రథమపాదమున పరబ్రహ్మముయొక్క జగ-త్కారణత్వాదికమును సాంఖ్యాది స్మృతులు బాధింపజాలవని ద్వితీయ పాదమున తంత్రాంతర నిష్ఠులుగాక శ్రీ పాంచరాత్ర నిష్ఠులగు సాత్త్విక భక్తులకు అతడు అత్యంత ఆప్తుడని, తృతీయపాదమున ఆకాశాదులు జీవాత్మయు యథోచితముగఅతనిచేతనే సృజింపబడుదురని చతుర్థపాదమున ప్రాణాదీంద్రియములకను అతడే స్రష్ట అనియు,

తృతీయాధ్యాయ ప్రథమపాదమున సంసార తంత్ర నిర్వాహకు డనియు, ద్వితీయపాదమున అతడు అఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణైకతానుడనియు, తృతీయపాదమున బహువిధముల భజనీయు డనియు, చతుర్థపాదమున స్వవర్ణాశ్రమోచిత కర్మానుష్ఠానముచేత అతడు ప్రసన్నుడగుననియు,

చతుర్థాధ్యాయ ప్రథమపాదమున ఉపాసకుల పాపములను నశింపజేయు వాడనియు, ద్వితీయపాదమున సుషుమ్నా నాడీద్వారా

ముక్తపురుషుని అర్చిరాదిమార్గమున ప్రవేశపెట్టుననియు, తృతీయ పాదమున అర్చిరాది మార్గముద్వారా అతివాహకులచే ముక్తపురుషుని పరమపదమునకు చేర్పించుననియు, చతుర్థపాదమున ముక్తునకు తనతో పరమసామ్యమును కలిగించుననియు, ఈ ఈ విధముగ బ్రహ్మ సూత్రములయందుగల 16 పాదములచేతను పరమపురుషుని 16 కళ్యాణగుణములు ప్రస్తుతింపబడినవి. ఇట్లు షోడశ కళ్యాణగుణ పరిపూర్ణుడైన పరమపురుషుని ముముక్షువు ఈ శాస్త్రముద్వారా తెలిసికొనవలయునని తాత్పర్యము.

అధికరణసారావళి సమాప్తము.

శ్లో॥ కవి తార్కిక సింహాయ కళ్యాణ గుణశాలినే।
శ్రీమతే వేంకటేశాయ వేదాన్త గురవే నమః

నిత్యశ్రీ ర్నిత్యమంగళమ్.

—:0:—

## బ్రహ్మసూత్రములు - ఉపాసనలు

| | |
|---|---|
| 1) సద్విద్యా | ఈక్షత్యధికరణము I(i) 5 |
| 2) ఆనంద(మయ)విద్యా | ఆనందమయాధికరణముI(i)6 |
| 3) ఉద్గీథాహిరణ్మయ పురుష దృష్టివిద్యా | అంతరధికరణము I(i) 6,7 |
| 4) ఉద్గీథాకాశ దృష్టివిద్యా | ఆకాశాధికరణము I(i) 8 |
| 5) ప్రస్తావన ప్రాణదృష్టివిద్యా | ప్రాణాధికరణము I(i) 9 |
| 6) గాయత్రీవిద్య | |
| 7) కౌక్షేయజ్యోతిర్విద్యా | జ్యోతిరధికరణము I(i) 10 |
| 8) ప్రతర్దనవిద్యా | ఇంద్రప్రాణాధికరణముI(i)11 |
| 9) శాండిల్యవిద్యా | సర్వత్రప్రసిద్ధ్యధికరణముI(ii) 1 |
| 10) నాచికేతవిద్యా | (1) అత్త్రధికరణము I(ii) 2 |
| వాచికేతవిద్యా | (2) ప్రమితాధికరణముI(iii)2 |
| నాచికేతవిద్యా | (3) ఆనుమానికాధికరణము I[iv] 1 |
| 11) ఉపకోసలవిద్యా | అంతరాధికణము I(ii) 4 |
| 12) అగ్నిత్రయవిద్యా | |
| 13) అంతర్యామివిద్యా | అంతర్యామ్యధికరణముI(ii)4 |
| 14) అక్షరవిద్యా | అదృశ్యత్వాదిగుణాధి-కరణము I(ii) 5 |
| అక్షరవిద్యా | ద్యుభ్వాద్యధికరణము I(iii) 1 |
| అక్షరవిద్యా | అక్షరాధికరణము I(iii) 3 |
| 15) వైశ్వానరవిద్యా | వైశ్వానరాధికరణము I(ii) 6 |
| 16) భూమవిద్యా | భూమాధికరణము I (ii) 2 |

| | |
|---|---|
| 17) గార్గ్యక్షరవిద్యా | అక్షరాధికరణము I(iii) 3 |
| గార్గ్యక్షరవిద్యా | అదృశ్యత్వాదిగుణకాధికరణము I(ii) 5 |
| 18) త్రిమాత్రప్రణవవిద్యా | ఈక్షతికర్మాధికరణము I(iii)4 |
| 19) దహరవిద్యా (సూ. 26) | దహరాధికరణము I(iii) 5 |
| " | అర్థాంతరత్వాది వ్యపదేశాధికరణము I(iii) 10 |
| 20) మధువిద్యా | మధ్వధికరణము I(iii) 8 |
| 21) సంవర్గవిద్యా | |
| సత్యకామవిద్యా | అపశూద్రాధికరణము I[iii]9 |
| 22) జ్యోతిషాం జ్యోతిర్విద్యా | సంఖ్యోపసంగ్రహాధికరణము I [iv] 3 |
| 23) బాలాకీవిద్యా | జగద్వాచిత్వాధికరణము I[iv] 5 |
| 24) మైత్రేయీవిద్యా | వాక్యాన్వయాధికరణముI[iv]6 |
| 25) పంచాగ్నివిద్యా | తదంతరప్రతిపత్త్యధికరణము III [i] 1 |
| 26) దహరవిద్యా సూ. 197 బృ.) | సంధ్యాధికరణము III[ii] 1 |
| 27) మాండూకవిద్యా | |
| 28) మూర్తామూర్తబ్రహ్మవిద్యా | ఉభయలింగాధికరణము III [ii] 5 |
| 29) ఉద్గీథప్రాణవిద్యా | అన్యథాత్వాధికరణము III [iii] 2 |
| 30) ఉద్గాతృప్రాణవిద్యా | |
| 31) జ్యేష్ఠ, శ్రేష్ఠప్రాణవిద్యా | ఆనందాద్యధికరణము III [iii] 3 |

| | |
|---|---|
| 32) అహర్వ్యాహృతి బ్రహ్మవిద్యా | |
| 33) అహంవ్యాహృతి బ్రహ్మవిద్యా | సంబంధాధికరణము III[iii]7 |
| 34) ఆయుఃఫలక పురుషవిద్యా | |
| 35) వ్యాసవిద్యా | పురుషవిద్యాధికరణము III [iii] 9 |
| 36) పర్యంకవిద్యా | సాంపరాయాధికరణము III [iii] 12 |
| 37) ఉషస్తకహోళవిద్యా | అంతరత్వాధికరణము III [iii] 15 |
| 38) ఉద్గీథాదివిద్యా | తన్నిర్ధారణానియమాధికరణము III [iii] 17 |
| 39) అగ్నివిద్యా | పూర్వవికల్పాధికరణము III [iii] 20 |
| 40) జీవాత్మవిద్యా | శరీరేభావాధికరణముIII[iii]2 |
| 41) యజ్ఞపవమానదృష్టివిద్యా | యథాశ్రయభావాధికరణము III [iii] 26 |
| 42) ఈశావాస్యవిద్యా | పురుషార్థాధికరణము III [iv] 1 |
| 43) ఉషస్తివిద్యా | సర్వాన్నానుమత్యధికరణము III [iv] 7 |

ఉపనిషత్తులలో ప్రస్తావించబడిన అనేక ఉపాసనలలో, ఈ పైన పేర్కొనిన ఉపాసనలు, బ్రహ్మసూత్రములయందు వివరించబడినవి. ప్రసిద్ధముగ 32 బ్రహ్మవిద్యలు ప్రచారములో ఉన్నవి.

—:0:—

## బ్రహ్మసూత్రములయందు పేర్కొనబడిన ఋషులు

1 అత్రేయుడు

సూ. స్వామినః ఫలశ్రుతేరిత్యాత్రేయః 3-4-44

2 అశ్మరథ్యుడు

సూ. 1. అభివ్యక్తేరిత్యాశ్మరథ్యః 1-2-30

2. ప్రతిజ్ఞాసిద్ధేర్లింగ మాశ్మరథ్యః 1-4-20

3 ఔడులోమిః

సూ. 1 ఉత్క్రమిష్యత ఏవం భావాదిత్యౌడులోమిః 1-4-21

2. ఆర్త్విజ్యమిత్యౌడులోమిః 3-4-45

3. చితిచిన్మాత్రేణ తదాత్మకత్వాదిత్యౌడులోమిః 4-4-6

4 కార్ష్ణాజిని

సూ. చరణాదితిచేన్న తదుపలక్షణార్థేతి కార్ష్ణాజినిః 3-1-9

5 కాశకృత్స్నః

సూ. అవస్థితేరితి కాశకృత్స్నః 1-4-22

6 బాదరాయణః

సూ. 1. తదుపర్యపి బాదరాయణస్సంభవాత్ 1-3-25

2. భావంతు బాదరాయణో 1-3-32

3 పూర్వంతు బాదరాయణో 3-2-40

4 పురుషార్థోఽతశ్శబ్దాదితి బాదరాయణః 3-4-1

5. అనుష్ఠేయం బాదరాయేణః 3-4-19

6. అప్రతీకాలంబనాన్నయతీతి బాదరాయణః 4-3-14

7. అధికోపదేశాత్తు బాదరాయణస్యైవం 3-4-8

—:0:—

## సూత్రసూచీ

### అ

సూత్రసూచీ సమాప్తం.